# శృంగారసంధ్య

(గద్యపద్యాన్వితము)

(కాళికాపురాణాంతర్గతము.)

విజయవిజయ, విచిత్రవీరబొబ్బిలి, ప్రతిజ్ఞాచాణక్య, శ్రీతులసీరామా
యణాది గ్రంథకర్తలగు

**భాగవతుల నృసింహశర్మగారిచే**

విరచితము.

Registered




ఇతరులకు:—

విలువ, రూ 1—4—0.) (పోస్టేజి ప్రత్యేకము.)

For copies apply to:-

**Bh. N. Serma Garu,**
*Proprietor*, **Vegu-Jukka Series,**
Pudipeddivari Street;
BERHEMPUR, (Ganjam.)

సంపాదకులు:—ఆదిభట్ల తరిణయ్యసిద్ధాంతిగారు.

ప్రకాశకులు:—భాగవతుల నృసింహశర్మగారు.

వేగుఁజుక్క గ్రంథమాల,
పూడిపెద్దివారివీధి, బరంపురం (గంజాం.)

*Published by:*— **Bh. N. Serma,**
VEGU-JUKKA SERIES,
Pudipeddivari street, BERHEMPUR,
*(Ganjam)*

*Printed by:*— **Cocanada printing works,**
COCANADA.

1ST ADITION
1000 COPIES.
1927

మఱి చెప్పకేమి: —

# ఉభయులకు లాభకరము.



చందాదారులారా !

పోస్టేజి మనియార్డరుఖర్చులు మేమే భరించి వి. పి. ద్వారా గ్రంథముఁ బం[పు] మొదల 1 రూపాయిలో పోస్టువారు 0-8-0 తీయఁగా మాకు దక్కెడి 0-8-0 మాత్ర మే. ఇదిమాకు కిట్టుబడి కాదు మీకే భరింపవలసివచ్చిన, నివారణము దండుగ య[గు] చున్నదని మీరే కాదు మేము కూడ, దుఃఖింపవలసినదే. అందుచే, ఉభయులకు నష్ట లేకుండ ఒకయుపాయము చెప్పుచున్నారము వినుఁడు. ముందు అడ్వాన్సుగా, 1 మాత్రము, మేము ఇంటిమేషను పంపివెంటనే, మాకుఁ బంపింపఁ జాలును. సంవత్స చందా ఒక్కమారుగ పంపవలెనను నిర్బంధము లేదు. మీ అడ్వాన్సు అందినవెం గ్రంథము అన్‌రిజిష్టర్డు పార్సెలుద్వారా, (అందుకయిన పోస్టేజి మేమే భరించి) దుము. ఇది గ్రహింపక చందాదారులు మాకు నష్టముగూర్చిన ప్రయోజనము పోషకులుగాని రాజపోషకులుగాని లేకపోయినను చందాదారుల యభిమానపో షణముల బలమున నిల్చి పనిచేయుచున్న మా గ్రంథమాలకుఁ దోడ్పడి యుద్ధరింప చాలమంది చందాదారులీవిధముగ అడ్వాన్సు పంపుచున్నారు. అన్‌రిజిష్టర్డు పార్సెలు ద్వారా పంపిన గ్రంథము తప్పక అందితీరును.

ప్రతివిషయములో మా యీక్రింది చిరునామా గమనించవలెను.

భాగవతుల నరసింహశర్మ.

ప్రొప్రైటర్, "వేగుఁజుక్క" గ్రంథమాల,

పూడిశెద్దివారివీధి—బరంపురం—(గంజాం.)

జాగ్రత్త !

దొంగలు కొందఱు బరంపురమునుండి వేగుఁజుక్క గ్రంథమాల పంపినట్లు భ్రమింపజేయుచు మా చందాదారులకు పనికిమాలిన గ్రంథములు పంపవచ్చును. మాచందాదారులు మాపార్సెలుపైఁగల చిరునామాయును, రిజిష్టర్డు లేబిలుమార్కున్ను ముఖ్యముగా చూచి పుచ్చుకొనవలెను. "రేచుక్క" "పగటిచుక్క" దొంగల, ధ్వజాపహలక్ష్య మాచందాదారులు మోసపోకూడదు.

"దొంగలున్నారు. జాగ్రత్త"..............

# మనవి.

ఆంధ్రభాషాభిజ్ఞులకు:—

మద్విరచిత శ్రీ తులసీరామాయణముఁ బఠించి నన్నెంతయుఁ బ్రోత్సహించుచు నుత్తరములు వ్రాసిన, బ్రహ్మశ్రీ మంగిపూడి వేంకటశాస్త్రివిపశ్చిత్తులకుఁ, పవిత్రభాషాభిమానులకు, శ్రీరామభక్తులకు నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

శృంగారసంధ్య యను సగద్యపద్యాన్విత పౌరాణిక ప్రబంధమును, శ్రీ తులసీరామాయణ బాలకాండమునకుఁ బూర్వ మెనిమిదేండ్లక్రింద విరచించితిని. మిత్రుల ప్రోత్సాహమున నేఁటికిఁ బ్రకటించు భాగ్యము లభించినది. ఇందుఁగల కొన్నికొన్ని పద్యములు (స్వల్పముగ మాత్రమే) బాలకాండమునందుఁ జెప్పఁబడెను. క్షమింపఁ బ్రార్థితులు.

శ్రీ తులసీరామాయణమునందలి, బాలకాండము, నయోధ్యాకాండప్రథమభాగము నిప్పటికిఁ బ్రకటించితిమి. అయోధ్యాకాండ ద్వితీయభాగము నచిరకాలములోనే ప్రకటింపఁ బ్రయత్నించుచున్నారము. కష్టసాధ్యమగు నిక్కార్యమునకుఁ బూనుకొన్న మేము భక్తుల తోడ్పాటునకు, భాషాభిజ్ఞుల ప్రోత్సాహమునకు నర్హులమైనఁ గృతకృత్యుల మగుదు మని మనవి చేయుచున్నారము.

ఇట్లు విధేయుఁడు,

భాగవతుల నృసింహాశర్మ.



# సంపాదకీయము.



ద్వాదశవర్షీయ యగు నీ "శృంగారసంధ్య" శ్రీ శర్మగారి వలనఁ గాళికాపురాణమునుండి యనువదింపఁబడి, లుప్తప్రాయ మయ్యును, దైవవశమున, దుర్దశను గడపి, యాంధ్రభాషాభిజ్ఞులను సందర్శించు సుయోగము సంప్రాప్తమయ్యెను. ఆనందవత్సరజాత యయ్యు రాక్షసబాధ తప్పదయ్యెను. ఒకానొక శిష్టునివలన సిద్ధార్థులము కాక, వంచితులమై, నిరుత్సాహవశమున నింతదనుక బహిర్గత మొనరింపఁ దలపెట్టక, శ్రీ శర్మగారి కవితామాధురి నాస్వాదింపఁ గోరు చందాదారుల యభిరుచి నీడేర్పఁబూని దీనినిఁ బ్రచురించినారము.

"గీ. పండితుఁడు సద్గుణంబును । బ్రస్తుతించు
లోప ముండినఁ గంఠంబు । లో నణంచుఁ;
జంద్రు నౌదల ధరియించి । చంద్రమౌళి
హాలహలమును కంఠంబు । నందఁ బూనె."

(అభినవభర్తృహరి.)

ఇట్లు,

గుణగ్రహణపారీణుల యాశీర్వాదమును బడయఁ దలంచు
విద్వద్విధేయుఁడు,

ఆవిభట్ల తరిణయ్యసిద్ధాంతి,
సంపాదకుఁడు.

వేగుఁజుక్క-గ్రంథమాల,
5—8—1927.



Intimation for Next issue "**Vishama Rahasyam**" a mysterious Detective Novel with wonderful incidents—

రాబోవు నవల కిదియే యింటిమేషనుగా భావింపవలెను. అడ్వాన్సు పంపువారు చాల లాభమును బొందఁగలరు. అవసరములేని వారు వెంటనే తెలియఁ జేయఁ బ్రార్థితులు.

# విషమరహస్యము

అత్యద్భుతకథాసంవిధానముఁ గలిగి, నిగూఢరహస్యములచే భేదింప శక్యము గాని నిరూపకనవల—

విషమరహస్యములతో నిండియున్న యీనవల, తననామమును సార్థకముఁ జేయుచున్నది - అద్భుతపరిసంగములతో సంబంధించిన చపలకుఁ దీసిపోవక ఘనీభూతమర్మములతో నిండుకొని, విభ్రమములకు, సంధిగ్ధావస్థలకు తావొసంగుచు, ద్వివిధవిషయములను జూపించుచు, నడుగడుగునకు భ్రమింపఁ జేయుచు, సాంతముగఁ బఠించినఁ గాని యెఱుంగ శక్యము గానిరహస్యములతో నలరారుచున్నది.

సర్వవిజయుని హత్యాన్వేషణము—నాయకుని దుర్దశాఘటనాచక్రము—గంభీరహృదయ యగు నాయిక పవిత్ర ప్రేమ—బంధుజనప్రీతి—మిత్రకృతజ్ఞత—ఆత్మత్యాగము—పరార్థప్రాపకత్వము—ఉత్తేజనస్వభావమునకుఁ దగినశాస్తి—పాపాచరణశీలమునకుఁ దగిన ప్రతిఫలము—దీర్ఘక్రోధమునకు మెచ్చఁదగిన యాత్మబలిదానము—శాత్రవనిబర్హణము—ఆత్మగోపనము—మృతునిప్రత్యక్షసంచారము—అతని రహస్యనాటకసూత్రధారిత్వము—ప్రధాననిరూపకుని, ప్రతిజ్ఞా

నిర్వహణమునకుఁ దగినసహనము — సహాయనిరూపకుని వేగిర పాటు— బాహ్యాడంబరమగు విచారణ – నిర్దోషియందు దోషపరిగ ణనము— సాక్షిమాత్రుఁడగు దోషియందు, ఔదాసీన్యము— అతఁడే కూటస్థుఁ డని నిర్విచక్షణజ్ఞానము— అనుమానవశమున భూతగృహ మేమోయని సంశయజ్ఞానము— పుత్రుఁడని మిథ్యాజ్ఞానము— చచ్చి నవానిఁ గూర్చి విపర్యయజ్ఞానము— మానవ దుర్జ్ఞేయమగు శునకజ్ఞాన ము— పురుషుని మించిన స్త్రీసమయస్ఫూర్తిజ్ఞానము – చెప్పనేమి ? తుదకు అజ్ఞానజనితవిజ్ఞానముతోఁ బూర్తియగును. మబ్బుఁబాసిన నింగివలె నిర్మలప్రేమము హృదయగోచరమగును. ... ...

చందాదారులకు వెల 1 రూ. (పోస్టేజితో సహా) మనియార్డరు కమీషను ప్రత్యేకము.

ఇతరులకు రూ 1—8—0 (ఖర్చులతో సహా.)

ఇట్లు,

భా॥ నృ॥ శర్మ—

వేగుఁజుక్క గ్రంథమాల,

పూడిపెద్దివారివీధి,

బరంపురము. (గంజాము.)



# విషయసూచిక.

## ప్రథమాశ్వాసము

## తృతీయాశ్వాసము





శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శృంగారసంధ్య

(కాళికాపురాణాంతర్గతము.)

## ప్రథమాశ్వాసము.



### ఇష్టదేవతారాధనము



ఆద్యంబై ప్రకృతిస్వరూపమున లో
కాతీతమై నిత్యమై
హృద్యంబై యనవద్యమై యతులమై
సృష్ట్యంతరవ్యాప్తమై
ఆద్యంతంబున నేకమై సగుణమై । యద్వైతఖద్యోతమై
ప్రద్యోతం బగు వేదవేద్యముఁ బర । బ్రహ్మంబుఁ బ్రార్థించెదన్.

గీ. అఘభయార్తివినాశంబు, । నతిపవిత్ర
చిత్తయోగీంద్రబృందసం । సేవితంబుఁ
గ్రమవిలంఘితవిపులజ । గత్త్రయంబు
హరిపదసరోజయుగ్మంబు । నాశ్రయింతు.

సీ. గట్టుమైఁ బుట్టియున్ । గరుణారసప్రవా
హంబుఁ గన్నుల జార్చు । నంబుజాక్షి
స్థాణుసంగతమునఁ । దనరియుండియు సాంద్ర
ఫలము లొసంగుశం । పాలతాంగిఁ

బత్రిశోభస్ఫూర్తి । వఱలి యపర్ణ నాఁ
గ ఖిరాజితెసుభక్త । కల్పలతికఁ
గాత్యాయనీసంజ్ఞఁ । గలిగియుఁ గడుపార
నచుఁగుబిడ్డలఁ గన్న । యట్టియార్య

గీ. వలువ లేకున్న, విసపుమే । పరియు నైనఁ
బాము తోడ నైన, వనచరుల్ । గాము లైన
శిరము జడ మైనదుమ్రిని । చేరనట్టి
సతినిఁ గానియూడఁ బోలదే । సంతతంబు.

సీ. కమనీయవిమలశృం । గారాంబుసంభూత
కమలమో యన ముఖ । కమల మమర
బ్రహ్మాండనేహాది । పంబు లనం గ్రాలు
తాటంకమణిరుచుల్ । తాండవింప
సంగీతసాహిత్య । సరసిజాతము లైన
కోరకంబు లనఁగఁ । గుచము లలర
సంపూర్ణపూర్ణిమా । చంద్రిక యనుభాతి
ధవళాంబరము ధగ । ద్ధగల నీన

గీ. దేవగజదంతతుల్య మై । దేహకాంతి
చంద్రికాంతపీఠంబున । సంగమింప
వివిధకవిపుంగవులమనో । వీథి మెలఁగు
వాణి నివసించుఁ గాక మ । త్స్వాంతమునను.

సుకవిస్తుతి

గీ. అమృతతుల్యంబుగా సంస్కృ । తాంధ్రములను
ఎంచఁ దగుగ్రంథమ్ముల లోక । హితముగా నకు

వ్రాసి చనినట్టిసత్కవి। వరుల కెలఁగి
సన్నుతించెద నూతన। సత్కవులను.

## కుకవినిరసనము.

గీ. కవివరప్రోక్తసత్కావ్య। కమలవిస్రు
తామలామృతాస్వాదనా। హ్లాదితాత్మ
పాఠకస్తుతి వినలేని బధిరు। లరయఁ
గాకవులు వారియుబు సేల। లోకమునకు ?.

## విజ్ఞాపనము.

మ. వినుఁ డో హో జనులార! పూర్వసుకవుల్। విస్తీర్ణసత్సాహితీ
ఘనభావార్థరసోపగుంభనములన్। గావ్యంబుల న్వ్రాయ, హీ
వినతాస్యంబున మిన్నకుండక కడున్। విభ్రాంతినిం బూని నే
నును గ్రంథంబు రచించెదన్న నను గవుల్। నో నాడినన్ దోసమే?.

ఉ. ఇమ్మను జేశ్వరాధముల। కిత్తునె యంచు వచించె నెవ్వఁ డా
బమ్మెరపోతరాజుఁ గవి। వర్యుని నెంచి నమస్కరించి, యొ
క్షుమ్మడిఁ గ్రిందు మీఁ దరయ। కోపియొ యోపక నా కాళికాపురా
ణమ్మనుగ్రంథ మాంధ్రపది। ణామముఁ జెంద రచింపఁ బూనితిన్.

గీ. సొంపుఁ బెంపొంద వీనుల। కింపు నింపు
సరసశబ్దార్థసంయోగ। సరణిఁ దప్పి
ముల్కఁ బోలినకఠినంపు। బల్కుఁ జొనుప
గూఢముగ నుండుభావంబు। మూఢునై నఁ
దెలిసి ముద మందుపక్కి నాం। ధ్రీకరింతు.

సీ. పండితాఖండల। పరిఖ్యాతిఁ గ్రాలు నా
రాయణభట్టుసా। హాయ్యమునను

పంచమామ్నాయ మన । భారతగ్రంథంబుఁ
బలుకఁడే నన్నయ।భట్టసుకవి
సత్కవీంద్రుని జన । సత్కీర్తిఁ గాంచిన
యాంధ్రకవిశ్రేష్ఠ।నార్యువలన
నుత్తరరామాయ।ణోత్తమకావ్యంబు
వ్రాయఁడే కంకంటి।పాపరాజు
గీ. అట్టియెడ లోక మెఱుఁగని । యల్పచేత
నుండు మూఢుఁడఁ గింకేమి।నుండు జడుఁడ
నితరసాహాయ్యముఁ దొలంగి । కృతి రచింప
నే ననఁగ నెంత నాదుసా।మేలెయు నెంత.
మ. గురువర్యాంబు మదీయబాంధవ్రజము నా।కుం జాల యిష్టుండు, భూ
సురలో కోన్నతుఁ, డార్యపూజితుఁడు, సు।శ్లోకుండు, దాంతుండు, స
చ్చరితుం, డూర్జితధీవిశారదుఁడు, సు।స్వాంతుండు, శాంతుండు స
తత్ణయ్యన్ వినుతింపఁగాఁ దగదె మ।ద్గ్రంథార్థసంధాయకున్.
స్వవిషయము
సీ. పండితస్తవనీయ।వైభవసారభవ
పాత్రులు శ్రీభాగ।వతులవారు
హృద్యానవద్యస।ద్విద్యామహోద్యాన
పాలకుల్ శ్రీభాగ।వతులవారు
వితతవితరణసం।ప్రీణితాశ్రితజన
ప్రణుతులు శ్రీభాగ।వతులవారు
సకలభూపాలక।ప్రకటితప్రఖ్యాతి
వైద్యులు శ్రీభాగ।వతులవారు
గీ. అతులసుమతులు శ్రీభాగ।వతులవార
లట్టి శ్రీభాగవతులవం।శాబ్ధిచంద్రు

డై జనించె శ్రీసూర్యనారాయణుండు
ద్రావిడోద్యానమునకు మాధవుఁ డనంగ.

గీ. సరస సంగీత సాహిత్య సంయుతుండు
అమృతహస్తుండు వైద్యవిద్యాన్వితుండు
మనుజవినుతుండు రాజసన్మానితుండు
ప్రథితసూర్యనారాయణపండితుండు.

చం. అతనికి సూరమాంబకును నాత్మజులై ముగు రుద్భవిల్లి రే
నతిజడుఁడన్ గనిష్ఠుఁడ; మదగ్రజు నాజ్ఞ వహించి నాయవ
జ్ఞతఁ బ్రకటింప సత్కవులగ్రంథము లున్నతి కెక్కు నిమ్మహా
కృతి విరచింపఁ బూనితిఁ, గవీంద్రుల నెంచి నమస్కరించితిన్.

చం. ఇరువురు మేనమామలు మహీసురవర్యులు కీర్తిధుర్యు లు
త్తరచరితుల్ మహాశయు లుదారులు ధీరులు ధర్మకర్మవి
స్ఫురితులు, పూడిపెద్దికులభూషణు లాశ్రితపోషణుల్ గణో
త్కరులు దలంప వేంకనచిదంబరశాస్త్రు లమోఘవర్తనుల్.

చం. కవిజనబాంధవుండు, రిపుగంధగజాంకుశవాగ్ధురంధరుం
డవిరళసాహితీవిభవుఁ డంచు నన్ను వినుతింతు రైన నా
యవగుణ మే నెఱుంగుదు జడాత్ముఁడ జ్ఞానము లేనివాఁడ, భా
గవతులనారసింహుఁ డనఁ గాఁ దనరారెడువాఁడ భూస్థలిన్.

గీ. ఆదిభట్లజోగయ్యమహాశయుండు
జ్యోతిషగ్రంథజలధిఘటోద్భవుండు
సకలవైదికమార్గనిష్ఠాగరిష్ఠుఁ
డతనిపుత్త్రుండు తిరిణయ్య యనుఘనుండు.

గీ. అతనిప్రోత్సాహమునను, సాహాయ్యమునను
ఇమ్మహాపురాణగ్రంథ మెట్టు లైన

సంతసింపంగఁ దలంచితి । సన్నుతించి
పండితులు నన్నుఁ గొనియాడ । వలయుఁ గాదె.

చం. మతిఁ దలపోసి మాటికిని । మాచరితంబు పురాణ మాపయిన్
కృతి కథనాయకుండు ఫణి । కంకణుఁ డింతకు నాంధ్రలోకస
మ్మతముగ మార్చఁ బెంపుఁ గవి । మండలి మే లనునట్లు, వెండియున్
కృతిపతి రామభూపతి; మ । హీస్థలిఁ గ్రాలెడి శాశ్వతంబుగన్.

ఉ. కావ్యము దివ్యలోకసుర । కన్యక; మర్త్యుఁడు భర్త యైన వై
ధవ్యము ప్రాప్త మయ్యెడిఁ గ । దా యని యించుక లోఁ దలంచి, క
ర్తవ్యము చాల లేనిరఘు । రాముని కిచ్చుట యంచు నెంచి యీ
నవ్యపురాణకన్యక ఘ । నంబుగ నాతని కే నొసంగితిన్.

ఉ. పంతముఁ బూని రాక్షసుల । వంశము ధ్వంసముఁ జేసి నిత్యమున్
శాంతమునన్ బ్రసన్నవద । నంబున సత్త్వగుణప్రధాని యై
యంతము లేనికీర్తి నెల । రారెడురాముని సన్నుతింప ప
ర్యంతము లేట కంచు విడ । నాడితిఁ బండితు లాదరింపరే.

ఉ. పండితు లైనవారలు ప్ర । బంధము లోలి నరాంకితంబు గా
కుండ రచించి నీకొసఁగి । యుండిరి వారల కుండునట్టిప
త్పాండితి లేకయుండిన భ । గవత్పదభక్తిసుధారసావృతా
త్ముండను గావునన్ బలుకఁ । బూనితి నీకృతి జానకీపతీ!.

కం. రామా, రఘుకులజలనిధి
సోమా, నిర్జితసురారి । శూరస్తోమా,
కామారివినుతపావన
నామా, సంగ్రామభీమ । నతసుత్రామా!

వ. అవధరింపుము భవన్నామాంకితంబుగ నేఁ బలుకం బూనిన శ్రీకాళికాపురాణాంతర్గత శృంగారసంధ్యాప్రబంధమునకుఁ బ్రారంభం బెట్టి దనిన:—

ప్రారంభము

సీ. వివిధరత్నములకు । వివిధౌషధములకు
స్థానభూతం బయి । ధాత్రిఁ దనరెఁ
బృథ్వినామముఁ బూను । వీరత్నగర్భకుఁ
క్షేమపాత్రం బయి । ప్రీతిఁ గాంచెఁ
భరతఖండోత్తర । భాగంబునం ద్రాలు
ప్రాకారమో యనఁ । బరిఢవిల్లెఁ
బరమపావన మైన । భాగీరథీనిర్మ
లాంబుసేచనమున । నలరుచుండె

గీ. నఖిలధాత్రీధరాధిప । త్యమున నెగడె
సమదకరిణీవిఘట్టిత । సరళభూరు
హస్రుతక్షీరగంధాగ । తాళినినద
భిన్నపన్నగం బగుహిమ । వన్నగంబు.

గీ. అమ్మహోన్నతనగమున । నలరు నామృ
కండునాత్మజునిఁ దపస్వి । ఘనయశస్వి
మహితతేజస్విఁ గాంచి న । మస్కరించి
యెలమిఁ గమఠాదిమునివర్యు । లిట్టు లనిరి.

గీ. సర్వవేదవేదాంగాది । శాస్త్రనిచయ
తత్త్వమంతయు సారభూతంబు గాఁగఁ
ద్రచ్చి గండూషితముఁ జేసి । తనరినట్టి
పండితుండవు విజ్ఞాన । భాస్కరుఁడవు.

చం. అనఘ సమస్తవేదముల । యందలి సంశయమేఘరాశి మా
మనములఁ బాసి నీముఖ । మారుత మించుక సోఁకినంతఁ, బా
వన మగునీదుపాదనఖ । భాతి కవిద్య యణంగ సర్వముం
ధినకరుతీవ్రతేజమున । దిక్కులఁ జీఁకటు లింకకుండునే?,

గీ. పృథ్విలోన జైవాతృకాగ్రేసరుండవు
నీ వెఱుంగనినీతి నిర్ణీతి గలదె?
సుకవివినుత, మార్కండేయ, సుగుణగణ్య,
మోక్షలక్ష్మీశరణ్య, సన్మునివరేణ్య!

గీ. భవ దమోఘవేదాంతతత్త్వప్రసంగ
సంగతంబున మాయంతరంగసంశ
యంబు తొలంగెఁ; జాంపేయగంధంబువలనఁ
గలఁగి తొలఁగెడుభృంగసంఘంబుఁ బోలి.

వ. సంపూర్ణపూర్ణిమాచంద్రికాప్రసారంబునఁ గైరవంబులు వికసిల్లు కరణి, మా కుల్లాసజనకం బగుభవన్మందహాసంబున, వాణీవిలాసంబు లగుసకలపురాణేతిహాసంబులు భాసురంబులై వికసిల్లుం గాదె? భవదాస్యంబున నెఱుఁగఁబడనిరహస్యంబు గలదె? మా కొండుసందేహంబు గలదు సస్నేహంబున నాకర్ణింపుము.

గీ. సంతతధ్యాననిలయుండు సంయమీంద్రుఁ
డాత్మచింతాపరుండు విశ్వాత్మకుండు
హరుఁడు సంసారవిముఖుండు యతివరుండు
మగువతగులంబుఁ గలిగి సంసారి యయ్యె.

సీ. ఆశ్చర్యముగ నుండె వార్యామహాదేవి
కాళి యై యెట్లు సంగరముఁ జేసె?
సతి దక్షునకు నెట్లు జన్మించె? సతిఁ గాంచి
మోహితుం డయ్యె నే పురహరుండు?
తనతనూజాతపై దక్షుఁ డేటికిఁ గోప
ముం జూపె? సతి యెట్లు ముక్తిఁ జెందె
హిమవన్నగంబున కేరీతి జన్మించెఁ
బార్వతీనామంబు పరిఢవిల్ల?

గీ. తల్లిదండ్రులయనుమతిఁ । దపముఁ జేసి
భవునిసామేను నెట్లు తాఁ । బడయఁ జాలె?
తెలియ శక్యంబు గానిసం।దేహ మిద్ది
ఆన తిమ్ము సర్వజ్ఞుఁడ । వగుదు వీవు.

గీ. సంశయంబు నివారింపఁ । జాలినట్టి
నీసమానునిఁ గానము । నిశ్చయముగ
సంశయ మణంగు నీతను।స్పర్శనమున
నగ్ని ఘృతము ద్రవీభూత । మగుట యరుదె?.

చం. అనవుడు వారిఁ గాంచి నయ।నాంబుజముల్ వికసింప సాదరా
ననమున నామృకండుముని।నందనుఁ డిట్లనెఁ:- గామదంబు, స
న్మునివినుతంబు జ్ఞానమయ।మున్ బరమంబును నైన యీపురా
తనచరితంబు బ్రహ్మకథి।తంబు వినుండు మునీంద్రు లెల్లరున్.

వ. మహత్తరకథావిధానముం గలయీపురాతనచరితంబు నాకుసహితము గుహ్యాద్గుహ్యతరం బై యవిదితం బై యుండె. పరబ్రహ్మస్వరూపంబునకు దర్పణమాత్రంబుగ రహించుచు బ్రహ్మజ్ఞం డై ప్రకాశించు నంభోజసంభవుండు తొలుత తన మానససంభవునకు నారదమహామునీంద్రున కెఱింగించె. నారదునివలన వాలఖిల్యమునీంద్రులును, వారిమూలమున యవక్రీతుండును, యవక్రీతునిచే నసితుండు నెఱింగిరి. అసితునికారుణ్యంబున నా కశ్రమంబుగ విశ్రుతం బయ్యె. ఇట్లనుక్రమంబున నీయత్యుత్తమపురాణంబు, మీవలన గంగానదీప్రవాహముం బోలి జగత్త్రయంబునఁ గథితం బై విదితం బగుం గాక. చక్రపాణి యై పరమాత్ముం డై, జగత్పతిత్వంబున నెగడి, వ్యక్తావ్యక్తస్వరూపంబున సదసద్వివేకజ్ఞులకు విదితుం డయ్యు నవిదితుం డై, స్థూలంబునకు స్థూలం బై సూక్ష్మంబునకు సూక్ష్మం బై, విద్యావిద్యాస్వరూపంబున నిర్వికారుం డై,

సృష్టిస్థిత్యంతములకు హేతుభూతుం డై, పరంజ్యోతి యై ప్రకాశించు వేదాంతవేద్యునకు నమస్కరించి, వక్కాణించెద నాకర్ణింపుఁడు. —

## సృష్టిక్రమము

ఉ. స్వప్రతిభావిశేషమున । సాత్త్వికబుద్ధిని సృష్టికర్త యై
విప్రుల వేదమూర్తులఁ బవిత్రచరిత్రుల, నాత్మరూపద
క్షప్రముఖప్రజాపతుల । సర్వసురాసురమానవాదిజం
తుప్రకరంబులన్ విధి మనోహరలీల సృజించె భూస్థలిన్.

వ. మఱియు,

గీ. క్రతు మరీచి వసిష్ఠాంగిరస పులస్త్య
పులహ భృగు నారదాదిసన్మునులు ఘనులు
తనదుమానసపుత్త్రు లై । తనరఁ జేసి
సంధ్య యనుదాని సృష్టించె । సరసమతిని.

## సంధ్యాభివర్ణనము

చం. జిలిబిలిరంగులన్ దొలుతఁ । జిత్రపటంబును జిత్రకారుఁ డు
జ్జ్వలముగ సొంపు పెంపెనయ । శ్రద్ధ వహించి రచింప నెంతయున్
బొలుపుగ నుండువైఖరి నపూర్వవిలాసవరాంగసౌష్ఠవం
బలర సృజించె సంధ్యను మహాంధ్య నవంధ్యఁ గుచాతివింధ్యనున్.

గీ. అతనిసృష్టి కాసౌందర్య । మాద్య మగుట
హృద్య మై యనవద్య మై । చోద్య మయ్యె
దాని కుపమానముగఁ జూపఁ । దగినవస్తు
నిచయ మేచాయఁ గానము । నిశ్చయముగ.

చం. విరసులు కొంద ఱావిధిని । వేదజడుఁ డని యండ్రు గాని, సు
స్థిరమతిమంతుఁ డై రమణిఁ । జిత్రముగా సృజియించి సంయమీ

శ్వరులకు వ్రేల్మిడిన్ హృదయసంచలనం బుదయింపఁ జేయునే
ర్వరి రసికుండు గాఁడె; స్తుతిపాత్రుఁడు గాఁడె మునీంద్రకోటికిన్.

వ. అవ్వారవర్ణి నభివర్ణించెద నాకర్ణింపుఁడు.

చం. అనుసృతసాంద్రసంతమస మై, యధరీకృతభృంగసంఘ మై
కనదురుశోభనీలమణిఖండసముద్గతకాంతిపుంజ మై
తనరియు వర్షకాలఘనదర్పనభిన్నమయూరపింఛ మై
వనితకచంబు భాసిలె నభంగుర మై మునిమోహజాల మై.

సీ. కాంత మై నీలాలకాంత మై శాంత మై
బాలచంద్రునిఁ బోలె ఫాలతలము
చకితమృగీనేత్రచంచలసదృశ మై
నీలాబ్జములఁ బోలె నేత్రయుగము
శ్రవణాంత మై పుష్పచాపునిచాప మై
ముసురుతేంట్లను బోలె భ్రూయుగంబు
చిత్తవశీకరశ్రీకారతుల్య మై
కమనీయముగ నుండెఁ గర్ణయుగము

గీ. కనుబొమలక్రింది నడిమిభాగంబునుండి
ఫాలఫలక లావణ్యద్రవంబుఁ గార్చు
చున్నచంద మూహింప నత్యున్నతముగ
నొప్పె నాసిక తిలపుష్పమో యనంగ.

గీ. భవ్యసౌందర్యలావణ్యనవ్య మగుచు
నరుణశశిరేఖ నొకలీల ననుకరించి
యమృతబిందునిష్యందనిం బాధరంబు
మండనం బయ్యెఁ బూర్ణాస్యమండలమున.

చం. వనరుహకుట్మలక్రమము వైఖరి మీఱి మృణాళసూత్రముల్
జొనుప నిరంతరం బయి, మనోహర మై కనకాద్రిశృంగ మై

కనుఁగొన ముద్దు లొల్కుచుబుకంబును ముద్దిడ నుద్యమించె, నా
వనితకుచద్వయంబు, మునివర్యులయుల్లము లెల్లఁ ద్రుళ్ళఁగన్.

గీ. భూరికాసారసంభూతపుండరీక
కుట్మలములఁ జేరిన తేఁటికొదమ లనఁగ
లలనసంపూర్ణకుచమండలములయందుఁ
జూడ సొంపుగఁ జెలువొందెఁ జూచుకములు.

మ. ధరణీచక్రిసమానపీనజఘనౌద్ధత్యంబు వీక్షించి, భూ
ధరశృంగోపమితోన్నతస్తనయుగస్థైర్యంబు లక్షించి, య
స్థిరమై సంచలియించి, శ్రీసుతునిముష్టిగ్రాహ్యపుష్పేషువై
కర మొప్పారియు, మధ్య మొందె, నతులక్షామం బనంతంబుగన్.

గీ. ఆనమద్ధస్తిహస్తసమాన మనుచుఁ
మృదులసప్తచ్ఛదస్తంభసదృశ మనుచు
గవులు గత్యంతరము లేని కారణమున
వదరుచుందురు గాని ధ్రువంబు వినుఁడు
ఉపమరహితంబు స్థూలోర్ధ్వ మూరుయుగము.

గీ. అంగుళీదళసంకీర్ణమై స్థలాంబు
జారుణం బయి, పార్ష్ణిభాగాధికమునఁ
దరుణిపాదయుగ్మంబు కెందమ్ము లనఁగఁ
గెంపులకు జన్మభూమియై సొంపు మీఱె.

ఉ. సారసగర్భచిత్త మనుసారస మీఁగతి మూర్తివంత మై
ధీరులచిత్తవృత్తుల మథింపఁ దలంచె ననంగఁ గ్రాలుసం
ధ్యారమణీమణీతనువునందలి కాంతి, మనోజ్ఞమై, కుసుం
భారుణవస్త్ర మంచు మును లాత్మఁ దలంచి భ్రమింప రాజిలెన్.

ఉ. సారససంభవాదిమునిసత్తము లెల్లరు దీను లై యష

స్మారమునకా మతిభ్రమను । సంచలియింపఁగఁ జేసినట్టిశృం
గారమణీయరూపము దృ।వం బయి మేన స్రవించుచుండె, శృం
గారరసప్రవాహమునఁ । గామిని స్నానముఁ జేసెనో యనన్.

సీ. తమకంబుఁ బుట్టించి । తనవానిఁగాఁ జేయు
శుకమహర్షిని నైనఁ । జూపుచేత
వలపులఁ జిలికించి । వలపించి మురిపించు
స్మరఘస్మరుని నైన । క్షణములోన
స్వాంతంబుఁ గరఁగించి । పంతంబునం గెల్చు
నారదు నైన గా।నంబువలన
నింగితం బెఱిఁగించి । యింటిబంటుగఁ జేయు
నలకూబరుని నైనఁ। జెలిమికలన

గీ. నధరమధురసుధారస।స్యందనమున
రతిని నోడించు నారతీ।పతిని నైనఁ
జెప్ప నేటికి నాఁటికిఁ । జిక్కె నౌర
ధాతఁ డెందంబు దానియం।దంబునందు

సీ. కౌఁగిలించినఁ జాలు । క్షణములో మ్రోడైనఁ
బులకరించినయట్లు । మొగ్గ తొడుగుఁ
బదము మోపినఁ జాలుఁ । బాషాణ మైనను
రంజింపఁబడినట్లు । ద్రవముఁ గార్చుఁ
బలుకరించినఁ జాలు । వాగ్దేవి యైనఁ దా
నోడినయట్లు మా। టాడకుండు
సరస కేగినఁ జాలు । శార్దూల మైనను
సఖ్య మైనట్లు ప్ర।సన్న మగును

గీ. పూచినట్టులఁ గను లెత్తి । చూచినంత
నస్త్రమశరునకు సమ్మోహ।నాస్త్ర మగును

చెప్ప నేటికి నాఁటికిఁ । జిక్కె నార
ధాతడెందంబు దానియం।దంబునందు.

సీ. చకితవీక్షణచాక। చక్యంబు గలదాని
సస్వేదవదనాంబు। జంబుదాని
మందహాసాంచిత। మధురాధరముదాని
తనురోమరాజివ్రం। తంబుదాని
చాంపేయసన్నిభ। చారునాసికదాని
రక్తప్రభాభాసు। రంబుదాని
సంకల్పసంభవా। స్థానవక్షముదాని
పద్మరాగారుణ। పదముదానిఁ

గీ. గాంచి ప్రేమించి కామించి । సంచలించి
సంభ్రమించుచు దక్షాది। సంయమీంద్రు
సంఘము మొక్కమ్మడిన్ మోహ। జలధి మునిఁగి
మానసము లంతరింప మై। మఱచి రార!.

సీ. అణువైన కణు వయి । యలరారుమధ్యంబు
కడఁజూడరానివస్తు। కసముఁ బోలఁ
గనినంత నుప్పొంగు। స్తనములు పూర్వప
శ్చిమపర్వతములశృం। గములఁ బోల
మోహాంధకారంబు । ముప్పిరిగొనఁ గేశ
పాశంబు తామిస్ర। పటలిఁ బోలఁ
బదములఁ గరముల । భాసిల్లునఖకోర
కంబులు నక్షత్ర। గణముఁ బోల

గీ. తనువు నరుణిమ యనురాగ। జనక మగుచుఁ
గడల వ్యాపించి సాంధ్యరా। గంబుఁ బోల

మునుల కెన లేనియనుమోద । మొనయఁ జేసె
నతులశృంగారపేటి సం।ధ్యావధూటి.

గీ. రత్నగర్భకు దీపాంకు।రంబుఁ బోలు
నామెఁ గనినంత ననురాగ । మంకురించి
జలజసంభవుస్వాంతంబు । సంచలించె
హస్తిహస్తవిన్యస్తారు।ణాబ్జ మనఁగ.

ఉ. ఇవ్వనజాయతాక్షిని, మ।హేంద్రులుసైతము విహ్వలింపఁగాఁ
నెవ్వనికై సృజించె? నతఁ। డెవ్వఁడొ? యెంతటిభాగ్యశాలియో?
ఎవ్వఁడు, గాంచినంతనె ప।యిఁ బడకుండుఁ? జణుండు బాపురే!
ఇవ్వనజోద్భవుం డనుచు । నెల్లరు నాతనిఁ జూచుచుండఁగన్.

వ. మునివర్యులారా! వినుండు. వా రిట్లు చిత్తవిభ్రాంతిని విహ్వలు లగుటకుం గారణము గల దది తెలిపెద నాకర్ణింపుఁడు. లోకపితామహుం డగునాధాత యిట్లు మనోవికారంబున సంభ్రమించి యుండునంత,

## మదనావిర్భావము

సీ. కాంత పై సర్వది।గంత పై విద్యుదు
ద్యత్తేజ మంతట । నలమికొనఁగ
ననురాగ మనునది । వ్యాపించెనో యన
నరుణప్రభాపుంజ । మావరింపఁ
గమలకషాయసు।గంధబంధురగంధ
వహ మెల్లకడలను । బరిఢవిల్ల
గాంగనిర్ఝరజల।కణముల కుపమ పై
హర్షసూచకపుష్ప।వర్ష మలర

గీ. నఖిలమునులకు నాశ్చర్య । మంకురింప
సంధ్య విహ్వల పై మది । సంచలింప

విధిమనోవీథి నప్పు డావిర్భవించెఁ
బురుషులకు మండనుం డగుపురుషుఁ డొకఁడు.

వ. తప్తకాంచనచూర్ణసన్నిభగాత్రుండును, పరిఫుల్లపద్మపత్రవిశాల నేత్రుండును, సువృత్తోరుకటీజంఘుండును, నీలాలకవేష్టితఫాలత లుండును, భ్రూయుగళాలంకృతసంపూర్ణవదనుండును, చారుకుంద రదనుండును, రోమరాజివిరాజితకవాటవక్షస్స్థలుండును, పీననిస్తుల బాహుతృణీకృతశుభ్రమాతంగకరుండును, పరిమత్తగజబంధనుం డును, కంబుకంధరుండును, కేశపాశధిక్కృతకంధరుండును, మీన కేతుండును, పంచపుష్పాయుధోపేతుండును, శృంగారరససేవితుం డును నగునప్పురుషవరుండు వినయానతకంధరుండై విధిఁ గని యి ట్లనియె.

శా. నానాజంతువితానసంయుతజగన్నాథుండ వాద్యుండ, వీ
షూనుల్ సేవకు నుండఁగా నను సృజింపం గారణం బేమియో?
యే నేకార్యముఁ జేయఁగావలయునో? యేకాంత నాభార్యయో
స్థానం బెయ్యదొ? నామ మెయ్యదియొ? యాజ్ఞాపింపుమబ్జోద్భవా!.

బ్రహ్మ మన్మథునకు లోకాధిపత్య మొసంగుట

మ. అని పల్కన్ విని ధాత యి ట్లనియె:- నో యంభోజపత్రేక్షణా!
నిను సృష్టించినకారణంబు వినుమా; నిన్నున్ జగత్సృష్టికిన్
వినియోగించితి; నీపరిభావమునఁ బృథ్విన్ సర్వజీవోత్కరం
బనుకూలంబుగ నుండు నేక మయి యన్యోన్యానురాగంబునన్.

మ. విరితూపుం గుఱి చేసి స్త్రీపురుషులన్ వేధించి బాధించుచున్
నరులన్ సిద్ధుల సాధ్యులన్ గరుడులన్ గంధర్వులన్ యక్షకి
న్నరవిద్యాధరరాక్షసాద్యమరులన్ సర్పాదిజీవంబులన్
బరిపాలింపుము, నీదుపాలనమునన్ వర్ధిల్లు ముల్లోకముల్.

మ. అరిషడ్వర్గము సేవలన్ గొనుము, భా। మాపాంగపుష్పంబులన్
శరముల్ చేయుము, నేఁడు నీ కొసఁగితిన్ । సర్వంసహాచక్రమున్
హరి యైనన్ హరుఁ డైన నీరజభవుం । డైనట్టి నే నైన, నీ
వరబాణంబులకున్ వశంవదుల మై । వర్తింతు మబ్జాంబకా!.

మ. సరసీజాంబక! జంతుసంయుతధరా । చక్రంబు సృష్టించి, నీ
పరముం జేసితి, సర్వజీవములలోఁ । బ్రచ్ఛన్నరూపంబునన్
జరియింపం గలశక్తి నీ కొసఁగితిన్; । సంధించుచున్ బాపుచున్
బరువంబుం గలకామినీపురుషులన్ । బాధించి సాధింపుమా.

ఉ. కాంచినయంత నీలమణి । ఖండసముద్గతకాంతిఁ బోలుమా
చంచలదృష్టికిన్ బరవ । శత్వమునన్ బురుషుండు దాసుఁ డై
నంచుఁ దలంచున ట్లతిశ । యంబు సృజింపుము చంచలాక్షులన్
జంచలు లైనపూరుషుల । స్వాంతము లెంతయు సంభ్రమింపఁగన్.

మరీచిప్రముఖులు మదనునకు బిరుదంబు లొసంగుట

వ. అని యిట్లంభోజసంభవుండు వచించి దక్షప్రముఖాదిమానసపుత్త్రుల నవలోకించుచు నిజపుండరీకాసనంబున నుపవిష్టుం డయ్యె. అమ్మహానుభావుని యవలోకనంబున నింగితం బెఱింగి దక్షాదు లప్పురుషసింహునకు స్థానంబును నెఱింగించి మనోహరలావణ్యాతిశయంబున నద్వితీయ యగుమగువ నొసంగిరి. సక్రమముగ సర్వ మెఱింగించెద. వినుండు. మరీచిప్రముఖు లాదివ్యపురుషుం గని,

సీ. మనముల మథియించి । మన్మథుం డన నీవు
ఖ్యాతి వహించెద । వఖిలభువిని
కామరూపమున నిన్ । సోమింపఁగా రాదు
కామాభిధానంబుఁ । గలిగి యుండు

మదనమ్ముం బోలియు । న్మత్తతఁ గలిగించి
మదననామంబునం । బొదలె దీప్తు
ఘాలాక్షునకు దర్ప।భంగంబుఁ గలిగించి
దర్పకాహ్వాయమునఁ । దనరె దీప్తు
గీ. బ్రహ్మ విష్ణు మహేశ్వరా।స్త్రంబు లైన
భవదమోఘనిశితపుష్ప।బాణములను
బోలఁజాలవు, ముల్లోక।ములును నీదు
నాటపట్టు లఖిలజగ।ద్వ్యాపకుఁడవు.
గీ. ఉర్వి నెప్పు డాబ్రహ్మాస।దోదయమున
సంభవించు జీవంబులు, । శాద్వలాది
తరుణవృక్షంబులుఁ భవ।త్స్థలము లయ్యె
నర్తనముఁ జేయు మిచ్ఛాను।వర్తనమున.
చం. అని వచియించి పిమ్మట మ।హర్షులు కట్టెదుటన్ గలట్టిసం
ధ్యను గని ధాత నిన్నుఁ దన।ధ్యానమునన్ జనియింపఁ జేసెఁ గా
వున భువి నీవు సంధ్య యనఁ । బొల్చెద వంచు నెఱుంగఁజేసి యా
ననముల నెత్తి బ్రహ్మవద।నంబులఁ గాంచిరి భక్తి పెంపునన్.

మదనగర్వాటోపము

మ. మునులారా! వినుఁ డాపయిన్ మరుఁడు సం।ఫుల్లాబ్జముం బోలునా
సన మొక్కించుక యెత్తి నేత్రముల నా।నందం బమందంబు గాన్
దనుసీమన్ బులకాంకురంబు లెసఁగన్ । దంభంబునన్ వారలన్
గని చింతింపఁగఁజొచ్చె మానసమునన్ । గర్వం బఖర్వంబు గాన్.
మ. భళిరా, నేనఁట మన్మథుండనఁట, మ।ద్బాణాళికిన్ బ్రాణు లు
త్కలికం జెంది చలించుచుండునఁట, నేఁ । గాముండ నై సర్వభూ
తలచక్రంబున ఖ్యాతిఁ గాంతునఁట, కో।దండంబు చే నంది సం
చలితస్వాంతులఁ జేసి వీరలకు నా । సామర్థ్యముం జూపెదన్.

మ. వల పొక్కింతయు నైన లో నెఱుఁగ రీ । బ్రహ్మాదిదేవర్షులున్
నలినీపత్త్రవిశాలనేత్రి యగుసం । ధ్యాకామినీరత్నమున్
ములికి న్మోహననామము న్దొడిగి । సంమోహించి కామింప సం
చలితస్వాంతులఁ జేసి స్వల్పముగ నా । సామర్థ్యముం జూపెదన్.

సీ. అఖిలజీవములకు । నమృతవర్షముఁ బోలు
హర్షంబుఁ బుట్టించు । హర్షణంబు
ప్రాణుల యౌవనం । బంకురింపఁగఁ జేసి
రోచకం బలరించు । రోచనంబు
కామినీరమణులు । కామించి ప్రేమింప
మోహంబుఁ గల్పించు । మోహనంబు
మానుల నైనను । దీనులం గావించి
శోషింపఁ గాఁ జేయు । శోషణంబు

గీ. మగల మగువల నెడఁబాపి । జగతి మరణ
కారణంబుగ నుండు నీ । మారణంబు
పంచబాణుఁడ, నఖిలప్ర । పంచములను
బాలనముఁ జేయ సృష్టింపఁ । బడితిఁ గాదె ?.

గీ. అబ్జభవు నైన హరి నైన । నభవు నైన
మత్సుమాస్త్రంబులకు వశం । వదులఁ జేయ
శక్తి నా కుండ మానులు । సంయమీంద్రు
లితరు లన నెంత నిశితపు । ష్పేషువులకు?.

మ. అని యిట్లాత్మగతంబునం దలఁచి ప । త్యాలీఢపాదస్థుఁ డై
మన ముప్పొంగఁగ వామహస్తమున ను । న్మాదాఖ్యకోదండమున్
గొని సంధ్య స్తుహినాదిసంయముల జం । తుం దక్క వీక్షించుచున్
గొనముం గూర్చి బిగించి నిల్చెను; కృత । ఘ్నుం డేమిగావించునో?.

చం. నిలిచినయట్లు నిల్చి తన । సేరుపుఁ గూరుపు నివ్వటిల్లఁ బూ
ములికిని నారికిం దొడిగి । పుష్పధనుస్సును మండలంబు గాఁ
బొలుపుగ లాఁగి పీనులకు; । ముష్టియు దృష్టియు సౌష్ఠవంబుగన్
నిలిపి త్యజించె; శిష్టజన । నిందితుఁ డామరుఁ డెంతమూఢుఁడో ?.

గీ. తల్లిపైఁ జల్లురావసం । తం బనంగఁ
దన్ను సృష్టించుధాతపై । ధ్వజము నెత్తి
గుణము సారించి చూపించె । గుణముఁ; గుక్క-
యఱచి పెంచినవానినిఁ । గఱచినట్టుల.

బ్రహ్మాదిదేవర్షులు చిత్తచాంచల్యము నొందుట

మ. అతఁ డట్లాసుమబాణము న్విడువఁగా । వ్యాపించుచున్ బుష్పవా
సితముల్ శీతలవాతపోతములు వీ । చెన్ మోద ముప్పొంగ; న
పరిణామానాంధ్యమునన్ విమోహమతులై । బ్రహ్మాదిదక్షప్రజా
పతు లాసంధ్యను జూచుచుండిరి మనో । భావంబులం దెల్పుచున్.

సీ. మరుఁ డంత విడువక । మగుడఁ బుష్పాస్త్రసం
ఘంబుఁ బుంఖానుపుం । ఖముగ విడిచె
మధురాధరంబున । మందహాసము దోఁపఁ
జంచల యై సంధ్య । గాంచుచుండె
సడలినయవయవ । స్థాను లై హీను లై
మాను లెల్లరు నతి । దీను లైరి
కామాతురుం డయి । రోమాంచలాంచిత
తనువున దక్షుఁ డ । దక్షుఁ డయ్యె

గీ. నింగితం బెఱిఁగించుని । రీక్షణములు.
సంధ్యనిడువాలుఁజూపుల । సంగమింప
స్వాంత మనునది యంతలో । సంతరించె
బ్రహ్మమనస్స్థితి నే మన । వచ్చు నౌర!,

మ. జలజాతోద్భవుఁ డిట్లు మైమఱపున । న్సంమోహముం జెందియ
న్నలినాక్షిం గని యాస్వరూపము నెదన్ । ధ్యానించుచుండ న్దలం
పు లసంఖ్యాతము లయ్యెఁ గన్నులరుణాం।భోజంబులం బోలె, మైఁ
బులకశ్రేణి జనించె హావములు బి।బ్బోకాదిభావంబులున్.

గీ. స్మరనిశాతాస్త్రపాతసం।జాతము లయి
సంధ్య నిసువాలుఁజూపుల । సరసగతిని
హావభావవిలాసంబు । లంకురించె
నందమున కందమై వన్నె । యతిశయింప.

చం. తనువు కవోష్ణఘర్మపరి।తాపమునన్ గృశియింప వింతసొం
పెనసి, లతాంగిఁ గాంచి, రమి।యింపఁ దలంచె విధాత; వారలున్
గనులను మాయఁజాలక మొ।గాదిగఁ జూచుచునుండి రామె; న
వ్వనితయు వారిఁ గాంచి రస।వంతముగా నెఱిఁగించె భావమున్.

గీ. ఇట్లు వారలు వైకారి।కేంద్రియమున
సంచలితచిత్తులై యుండ । స్మరుఁడు గాంచి
తనప్రతాపాతిశయమును । దలఁచుకొనుచు
మీసముల దువ్వుచుండె వి।లాసముగను.

విశ్వేశ్వరుని హేళనము

గీ. అంత విశ్వేశ్వరుండు వి।యద్గతుండు
వారిస్మరవికారంబుఁ గ।న్నారఁ గాంచి
నీరజోద్భవా యని పిల్చి । నిట్టనిల్చి
అట్టహాసంబుఁ గావించె । నిట్టలముగ.

వ. మఱియు మహానుభావుం డగు నాభవుండు దక్షాదిదేవర్షులం గని పునఃపునరట్టహాసంబునఁ బరిహాసముఁ జేసి యిట్లనియె.

గీ. నిగమనిగమాంగములనెల్ల । సుగమములుగ
నెఱిఁగి సదసద్వివేకంబు । నెఱిఁగి తుదకు

మాయకుం జిక్కరే స్త్రీవి।ధేయు లగుచు
సత్ఫలముఁ గాంచె నిగమవి।జ్ఞానమహిమ.

చం. చదివినదానికిన్ ఫలముఁ । జక్కఁగఁ గంటిరి చాలుఁ జాలు, నీ
మదనునిపుష్పబాణములు । మానసవీథిఁ జలింపఁ జేయునే ?
మదవతిఁ గాంచి యెల్లరు, న।మానుష మార! రమింప నెంచిరే?
వదనము లెత్త రాదు సరి।వారలలోన, హసింతు రెంతయున్.

ఉ. చిన్నతనంపుఁజెయ్వులకు । సిగ్గిలకుండిరె ? యార! జ్ఞానసం
పన్నుల రయ్యు శ్వానముల।వైఖరిఁ గొంకుచు జంకుఁ దక్క యీ
కన్నెను, పుష్పమార్గణవి।ఘట్టితచిత్తుల రై రమింపఁ గాఁ
జన్నె? విశేష మయ్యె మతి।జాడ్యము; మీఁచదు వేల గాల్పనే?.

ఉ. ఓర! విధాత! జ్ఞానమహి।మాఢ్యుఁడ వాద్యుఁడ వైన నేమి? యీ
తీరున బుద్ధిజాడ్యమునఁ । దెంపరి నొక్కని సృష్టిఁ జేసి వి
స్తారముగా వరంబుల నొ।సంగి సుమాస్త్రహతుండ వై యప
స్మారమునన్ గుమారి కయి । సంచలియించితి సంగమింపఁగన్.

గీ. తల్లి యెట్టిదో యట్టిదే । చెల్లియలును
అట్టిదే యగుఁ గూఁతురు । నని గదా భ
వన్ముఖోత్థితవేదంబు । పలుకుచుండు
మఱచితే కూఁతుఁ గాంచి మై।మఱచి యార!.

గీ. మనుజమాత్రుండ వైతివే । మతిఁ దొఱంగి
యీ వెవండవో మఱచితే । యిప్పు డైన
ధైర్యముం జిక్కఁబట్టుము । ధాత నీవు
ధైర్యమూల మీజగ మందురు । తత్త్వవిదులు.

గీ. దివ్యదర్శను లార్యు లీ।దేవమునులు
సాత్త్వికగుణంబు విడువని।స్రష్ట నీవు

దక్షుఁ డాదిప్రజాపతుల్ । త్వత్సమాను
లెట్టు లీక్షుద్రశరముల । కిట్టులైరి.

గీ. భాగ్య మంతయుఁ బుత్రుని । వశముఁ జేసి
వానివశమున వర్తించు । వానిపోల్కి
స్వల్పు నొక్కని సృష్టించి । వరము లొసఁగి
వానివలన నిశ్చైతి వజ్ఞానమునను.

గీ. చీ! యకాలజ్ఞుఁ డత్యల్ప । చేతనుండు
మరుఁడు; మృదుపుష్పములు వాని । మార్గణములు;
సూనశరలక్ష్యభూతులై । సొక్కి సోలి
బైసిమాలిరె? మీరు త । త్త్వజ్ఞు లయ్యు.

గీ. బాల్యమునఁ జిక్కి కాంతాల । లామపాద
దాసుఁడై మన్మథునిఁ బెద్ద । జేసి, తనదు
బీజమునఁ బుట్టి పెరిఁగిన । వృక్షఫలము
గాఁ దలంచెఁ గూఁతును గాంచి । కంజభవుఁడు.

బ్రహ్మాదిదేవర్షుల పశ్చాత్తాపము

కం. అని యుద్బోధించినహరుఁ
గని యాకమలోద్భవుండు । కామాతురుఁడై
యొనరించినచెయ్వుల కె
ల్లను సిగ్గార్పనఁ జెమర్చి । లజ్జితుఁ డయ్యెన్.

గీ. మానసులగు బ్రజాపతులు వి । జ్ఞానబోధ
కారణంబునఁ గామవి । కారదూరు
లై ప్రబోధితచిత్తులై । యలరి రపుడు
జలదనిర్ముక్తనక్షత్ర । సమితిఁ బోలి.

ఉ. సారససంభవుం డపుడు । స్థైర్యముఁ జెంది మదిన్ వికారముల్
దూరముఁ జేసి ప్రాఁచి రవి । దోఁచినభంగి వెలింగె నంతయున్
మారునిబాణవృష్టికిఁ బ్రమాదవశంబున సంచలించినన్
ధీరులయంతరంగములు । తేర్కొనుఁ బెద్దలజ్ఞానబోధకున్.

వ. అనంతర మమ్మన్మథుండు దూషితుం డై శంకరుం గాంచి.

శా. ఔరా యీశ్వరుఁడా యితండు ? తనవేదాంతోపదేశంబు మ
న్నారాచాగ్నిదహించునం చెఱుఁగఁడో? । నన్నల్పుగా నెంచునే
యీరీతిన్ ? గనుఁ గానఁ డస్ఖలితమౌనీంద్రుండొ ? వేదాంతసం
చారుండో? సమయంబుఁ జూచుకొని నాసామర్థ్యముం జూపెదన్.

గీ. ఇతఁడు ఫాలనేత్రుం డైన । నెవ్వఁ డైనఁ
గలఁతఁ గల్పింతు నాకశక్యంబు గలదె ?
తగినతఱిఁ గాంచి వీనిమదం బణంచి
మనసు మథియింపకున్న మన్మథుఁడఁ గాను.

## అగ్నిష్వాదుల యావిర్భావము

వ. అని దంభసంరంభమునఁ దనమనంబునఁ బ్రతిజ్ఞఁ గైకొనియె. సర్వజ్ఞుం డగుశంభుండు వాని డింభకునిగఁ దలంచి మందహాసముం జేసి మిన్నకుండె. బ్రహ్మయుఁ జిత్తస్వాస్థ్యముం జెంపె నని గాత్రం బెఱింగించుచుండె నన ఘర్మాంబుజాలం బుత్పన్నం బై భూమిం బడు నంత, సంసారవిముఖులును, ఫుల్లరాజీవనేత్రులును, నంజనసన్నిభగాత్రులు నగునగ్నిష్వాత్తు లఱువదినాలుగువేలకు మించి యుద్భవించిరి. ఎనుబదినాలుగువేలబర్హిష్వదులు నుదయించిరి. మఱియుఁ గామవికారసంజనితఘర్మాంబుజాలంబునుండి క్రతువునకు సోమపులును, వసిష్ఠునకు స్వకాలినులును, పులస్త్యునకు నాజ్యపులును, నంగిరసునకు హవిష్మంతులును జన్మించిరి. వీరల కెల్లరకు బ్రహ్మ పితామహుం డయ్యె. అనంతరమున,

### రతి జననము

గీ. చక్కఁదనమున కిక్కయై । సాటి లేని
చిన్నదానిని దక్షుఁడు । సృష్టిఁ జేసె
దాని వర్ణింపఁ దరమె యా। ధాత కైన
మానివరులార! వినుఁడు మీ। వీనులార.

ఉ. అంచితచిత్తశుద్ధినిపు। ణాతిశయంబున సృష్టికర్త సృ
ష్టించినదాని మవ్వమును । చెల్వముఁ గాంచి హసించి దానినిన్
మించినదాని, దాని కెల। మిన్ దిలకంబుగ నుండుదాని ని
ర్మించెను జిన్నదానిని వి। రించియుఁ గాంచి నుతించి యెంచఁగన్.

గీ. జఘనభారాలసగమన । చంద్రవదన
మందహాసవిభ్రాజిత । కుందరదన
సరసచాంపేయసుమసమ । చారునాస
తన్వి తనుమధ్య శ్యామ సౌం। దర్యసీమ.

గీ. మృదులతనురోమరాజిత । సదయహృదయ
చకితబాలమృగీనేత్ర । చాకచక్య
పక్వబింబాధరోష్ఠి శం। పాలతాంగి
లలితగుణశీల మదనలీ। లాకురంగి.

మ. మును పెంపెక్కినసత్కవీంద్రుకృతిలోఁ । బొల్పారుసారాంశముల్
గొని యుత్కృష్టఘనుండు పైపయి మెఱుం। గులొట్టి ప్రఖ్యాతిఁ గాం
చినచందంబున, బ్రహ్మ బుద్ధిగరిమన్ । సృష్టించుసంఖ్యాసతుల్
గని దక్షుండు సృజించె నీరమణి సౌం। దర్యోపమానంబుగన్.

### మన్మథుని బ్రహ్మ శపించుట

వ. అనంతరమునఁ గోపావిష్టుండయి బ్రహ్మ భ్రుకుటీకుటిలాననుం
డై ప్రళయకాలాభీలపావకజ్వాలలం బోలి నేత్రంబులు ప్రజ్వ
రిల్లఁ, గందర్పు శపింపఁ దలంచి శంభుఁ గాంచి యిట్లనియె.

గీ. ఎవఁడు మూఢుఁ డై నిశితపు। ష్పేషువులను
నన్నుఁ గామవికారసం। ఛన్నుఁ జేసె
భవదమోఘనేత్రానల। జ్వాలలందు
భస్మ మగుఁ గాక యాతఁడు । ఫాలనేత్ర!.

కం. వనజోద్భవుఁ డిట్లు శపిం
చెను గాని వధింపకుండెఁ । జిత్తజు నారా!
తనవిషభూమీజంబును
దనచేతులఁ బెల్లగింపఁ । దనకుం దగదో ?.

మన్మథుని పరితాపము

వ. వినుం డనంతర మమ్మన్మథుండు తనబాణంబుల నుపసంహరించి
భీతచేతస్కుం డగుచు,

కం. కన్నుల బాష్పము లొలుకఁగ
నన్నలినోద్భవునిఁ గాంచి । యతిదీనుం డై
నన్నిట్టుల శపియింపఁగఁ
జన్నె ? యిది నీదున్యాయ। సరణియె చెపుమా?.

కం. ఎందుకు శపియించితి వర
విందాసన నీపలుకుల । వినినందుకు మే
లొందుటకున్ మారుగఁ గీ
డొందితి నిది నీకుఁ దగునె ? । యొప్పిద మగునే ?.

కం. ఎలమిన్ ననుఁ గని పలికిన
పలుకుల గణియించి నేను । వర్తించితిఁ బూ
ములికినిఁ ద్యజియించితి నీ
పలుకునఁ గల్లకల్లనిజముఁ । బరిశోధింపన్.

కం. నాయెడఁ గలయపరాధము
నీయది యగుఁ గాదె నన్ను । నిందించెదవే

నీయాజ్ఞను బాలించితి
న్యాయాన్యాయంబు లెఱిఁగి నను బ్రోవఁ దగున్.

మ. అనుకూలంబుగ నెల్లజీవములు నన్యోన్యానురాగంబునన్
దనరన్, మోహవశంబునన్ జగతి సంతానంబునన్ వర్ధిలన్
నిను సృష్టించితి నంచుఁ బల్కితివి నే నీయాజ్ఞఁ బాలించితిన్
అనఘా! శాపముఁ గ్రమ్మరింపు మనుకంపాయత్తచిత్తంబునన్.

బ్రహ్మ ప్రసన్నుఁ డగుట

కం. అని యిట్లు పలుకుమారునిఁ
గని సర్వము విని విరించి కరుణాలోకం
బున శాంతభావమున ని
ట్లనియెన్ దక్షాదిమౌను లానందింపన్.

సీ. తనయుండ వయ్యు నీ తండ్రికిఁ దనయుపైఁ
దమకంబుఁ బుట్టింపఁ దగునె నీకు
నీలత్వ్యశుద్ధికి నేను గావలసెనే?
దండింపఁబడితివి తప్పుసేత
శాంతించెదం గాక శాపంబు దప్ప ద
పాయంబు లేనియుపాయ మొకటి
గల దది యాలింపు మలికనేత్రుని నేత్ర
వహ్నికీలల నీవు భస్మ మగుదు

గీ. వెండియు నతండు పార్వతిం బెండ్లియాడు
నప్పు డఖిలదేవతలసంప్రార్థనమున
నతనికృపను సజీవుండ వగుదు వీవు
తప్పొనర్చినఁ దప్పునే దండనంబు.

వ. అమ్మహానుభావుం డిట్లానతిచ్చి యెల్లరుఁ జూచుచుండ నత్యా
శ్చర్యకరముగ నంతర్హితుం డయ్యె. వియద్గతుం డగుశంభుండును

యభీష్టదేశగతుం డయ్యె. అనంతరము దక్షప్రజాపతి రతీపతిం గని యి ట్లనియె.

## రతీపాణిగ్రహణము

చం. వితతగుణంబులం గలవి। వేకిని, నీ కనుకూల మైనసం
గతమున నుండు, నీపదయు। గంబును దప్పదు ప్రాణ ముండఁ గాన్
రతి యని పేరొ్కనం దగిన। రామ, మదీయశరీరజాత యీ
సతినిఁ బరిగ్రహింపు సహ। చారిణి గా నవపుష్పసాయకా !.

వ అని తా సృజించిన యమ్మనోహరాంగి నతనికిం జూపి పలుక నప్పలుకుల నాలించి సంతోషాతిరేకంబున

కం. పతిభక్తితృణీకృతసతి,
గతిగర్హితసురపతికరి। గతి, మతిజితభా
రతి, ముఖజితరజనీపతి
రతిఁ గనియెన్ మన్మథుండు। రతితత్పరుఁ డై.

శా. ఆరామామణివాలుఁజూపులకు మో। హాయత్తుఁ డై మత్తుఁ డై
స్మేరాంకూరకలాకపోలముఖుఁ డై। చిత్తంబుఁ బ్రేమంబునన్
ధారాదత్తముఁ జేయ నెంచి యపుడే। తద్రూపలావణ్యశృం
గారాంభోధిని స్నాన మాడె నపురా। కాముండు విభ్రాంతుఁ డై.

శా. సాకాచారవిచారధీరు లగు నా। స్రష్టాదిదేవర్షులన్
నారాచంబుల నేఁచి సంచలితులన్। గావించితిన్ నేను శృం
గారాపాంగని శాతబాణముల నన్। గామింపఁ గాఁ జేసె నీ
నారీరత్నము జాణ యంచుఁ దలఁచెన్। మారుం డపస్మారుఁ డై.

సీ. వెలఁదిభ్రూయుగళంబు। వీక్షించి కాంక్షించి
మఱచెఁ బో తనదును। న్మాదధనువు
అబ్జాక్షి క్షితకర్ణ్య। కటాక్షయుగంబులఁ గాంచి
యూశింపకుండె నిజాశుగముల

గలికి శ్వాసంబు నాఘ్రాణించి సుంతయు
మలయానిలంబును దలఁపఁ డయ్యె
లలితాంగి భ్రూలతల్ మరలక్ష్మి తాస్యముఁ గాంచి
నిందు రేఖ వెన్నెల యంచు నిశ్చయించె

గీ. మధుపసేవితపద్మకుట్మలము లనఁగఁ
జూచుకాన్వితకుచముల సొబగుఁ గాంచి
తనదు కెందమ్మిముకిళికి పై నెనరు మానెఁ
దెలుప నేటికి మారుఁ డధీరుఁ డయ్యె.

గీ. సారు పై వారు తుమ్మెద బారు మీఱి
పొక్కిలిం దాఁటి మిక్కిలి పొలుపు నింపు
నారితనుకోమరాజిఁ గన్నారఁ గాంచి
తనదునారిఁ బుటుక్కనఁ దునిమె నౌర!.

సీ. ఉండియు లేనట్లు లుండుమధ్యముఁ గాంచి
యఖిలంబు శూన్య మం చాత్మఁ దలఁచెఁ
జక్రోపమితఘనజఘనంబులం గాంచి
రత్నవేదిక లంచుఁ బ్రస్తుతించె
నిరుపమానంబుగ నెగడునూరుయుగంబుఁ
గాంచి లోఁ గామించి సంచలించె
నారక్తపార్ష్ణి పాదాగ్రభాగముఁ గాంచి
యనురాగముం గ్రక్కు ననుచు నెంచె

గీ. శిఖరసూక్ష్మాగ్రములఁ దేరు నఖరములను
గ్రాలునంగుళీదళములఁ గలిగియుండు
హస్తములు నిజచిత్తంబు నపహరించె
ననుచు నూహించి మోహించి తనువు మఱచె.

గీ. కాంతితోయప్రవాహసం। క్రాంతబాహు
యుగళనిగళనిబద్ధుఁ డై । యొడలు మఱచె
ననఁగ నున్మత్తుఁ బోలి । యాతఁ డపుడు
మృదుమృణాళనాళంబులం । గ్రిందు పఱచె.

గీ. చమరమృగవాలముం బోలి । కొమరు మిగిలి
నీలనీరదసంకాశ । మై లతాంగి
కేశపాశంబు సంమోహపాశ మగుఁడు
నాళ మితి మీఱె నార పుష్పాంబకునకు.

సీ. లావణ్యతోయౌఘ, । లలితవక్త్రాంభోజ,
స్తనకోరకద్వయ, । తతనితంబ
సైకత, కచపాశ। శైవాల, నేత్రోత్ప
లాన్వితాపాంగభృం। గౌఘ, బాహు
యుగళమృణాళసం। యుత, వళిత్రయభంగ,
నిమ్ననాభిహ్రద, । నిరుపమాన
విభ్రమభ్రూలత, । విదళితస్థైర్యమ
నోద్రుమ, దక్షహి। మాద్రిజాత,

గీ. అని నుతింప గంగానది । ననుకరించు
రతినిఁ బొడగాంచి తమి మించి । మతిఁ జలించి
అతిశయించి మారుఁడు పెం। ద్లాడె మంద
హాసచంద్రిక దిక్కుల । నావరింప.

వ. ఇట్లాంతీదేవిం బెండ్లి యాడి యమందానందంబున నై మఱచి యి ట్లని తలంచె.

మ. మగువం గాంచి ప్రకాశమై వలచె బ్రహ్మం బోలి దక్షుండు నా
తుగముక్ నేమ్మ త్యజించినంత, విధి సంక్షోభించి శాపించె, నీ

సొగసుం బ్రోవు నితం డొసంగెఁ; దగునే । శోకింప మోదింప? నే
మిగతిన్ జూచిన వచ్చుఁ గాలముగతిన్ । మేలైనఁ గీడైననున్.

వ. అనంతర మతండు.

సీ. కనులకు మిఱుమిట్లు । గలిగించుమించుతోఁ
బొలుపారు మేఘునిఁ । బోలియుండె
సాగరోత్థితమగ్న । సాగరకన్యకా
సలరు కేశవుఁ బోలి । మెలఁగుచుండె
మనము నాకర్షించు । మధులక్ష్మిశోభతోఁ
గ్రాలువసంతుని కరణి వఱలె
విమలమానసమున । విద్యను సాధించు
యోగదర్శిం బోలి । యుల్లసిల్లె

గీ. అఖిలజీవహృదంతర । వ్యాప్తుఁ డగుచుఁ
బంచబాణుఁడై సర్వప్ర । పంచములను
సంచలింపఁగఁ జేయుచు । సంచరించె
వానిలీలల వర్ణింప । వశమె మనకు.

బ్రహ్మ ప్రతిజ్ఞఁ గైకొనుట.

వ. వినుం డట్లు జలజభవుం డంతర్హితుండై కొండొకరహస్యస్థలంబున.

సీ. హరునిచే నిందితుఁ । డై విషాదంబున
నెంతయుఁ జింతించె । స్వాంతమునను
తరుణులముఖమారు । తం బించుకంతయు
మేనిపైఁ సోఁకని । మానిఁ బోలి
కడునట్టహాసంబుఁ । గావించి ననుఁ గాంచి
మగువపైఁ దగులంబు । తగునె యనుచు
మునివర్యు లెల్లరు । వినుచుండ దూషించి
శ్రీరంగనీతులఁ । జెప్పె నౌర!

గీ. ఈతఁ డేరీతి నాతిం గ్రహింపఁ గలఁడో ?
ఏలతాంగి నిజాపాంగభృంగసమితి
నితనిహృదయాబ్జమధువు గ్రహింపఁ గలదో ?
ఎప్పు డీడేఱు నావంత యెపుడు దీఱు ?.

మ. జగతిన్ సృష్టి యొనర్చి ఖ్యాతిఁ గను నన్ స్వల్పజ్ఞుగా నెంచి, నా
మొగముం గాంచి మహాట్టహాసమున సంబోధించి బాధించి, చీ !
తగు నే యంచు వచించె నెవ్వఁ డతఁడున్ దంభూతవామాంగుఁ డై
సగమైనంగద నాదువంత తొలఁగున్ సంమోద ముప్పొంగఁగాన్.

మ. వనితానామము వీనులన్ వినఁడు తద్వక్త్రంబు నొక్కింతయున్
గనులన్ జూడఁడు గాలియున్ దగిలినన్ స్నానంబుఁ గావించు, నీ
తనిగర్వంబును యోగమార్గయును విధ్వంసంబుఁ గావింపఁజా
లినవాఁ డెవ్వఁడో?:- కాముఁ డోపు నితరుల్ వీక్షింపఁగా శక్తులే?.

ఉ. కొందఱు మేటివాల్మగలఁ గూల్పఁగ నోపును విష్ణు వాపయిన్
గొందఱ నీశ్వరుండు మఱి కొందఱ నేను వధింప నేర్తు మి
ట్లొందఱ నొక్కతూపునకు వ్యాకులచిత్తులఁ జేసి స్త్రీలకున్
గొందల మందఁ జేయఁ గలకోవిదుఁ డీసుమబాణుఁ డొక్కఁడే.

మరీచ్యాదిమహర్షులకు బ్రహ్మ పునర్దర్శన మిచ్చుట.

వ. అని యిట్లు లోకేశుండును లోకపితామహుండు నగు నప్పుండరీ
కాసనుండు నిండుమనంబునఁ జింతించి చింతాకులితస్వాంతుం డై
వెండియు వియత్తలంబు నుండి దక్షాదులకుఁ బునర్దర్శనం బిచ్చి
రతీద్వితీయుం డయి యద్వితీయుం డగు

కం. మదనున్ సంపూర్ణకలా
వదనున్ శృంగారరాజ్యవైభవలక్ష్మీ
సదనున్ వికసితసుమశర
కదనున్ వీక్షించెఁ గుండకలికారదనున్.

వ. అట్లు వీక్షించి విస్ఫారితనేత్రుం డై ప్రఫుల్లవదనుం డై యిట్లనియె.

### బ్రహ్మ మదనుని ప్రశంసించుట.

గీ. యామినీపూర్ణచంద్రుల ననుకరించి
కాంచనేంద్రనీలంబులకరణి మీఱి
మీఱ లిరువురుఁ గ్రాలుచున్నారు, మదన!
ఎవని నోడింపఁజాల వీసృష్టియందు.

గీ. దర్పమున రతిభ్రూలతాధన్వి వగుచు
నాపె నిడువాలుఁజూపు ల౯ దూపు లూని
వాఁడిఁ గలవాఁడ వై నీవ ఫాలనేత్రు
గెలువఁ జాలుదు వన్యులు గెలువఁ గలరె?.

గీ. నదనదీస్నిగ్ధవననిర్జనప్రదేశ
ములను, పర్వతోన్నతభాగముల నతండు
సారసంసారవిముఖుఁ డై సంచరించు
వాని వెన్నాడుచుండు మీ వనితతోడ.

గీ. నెలఁదిపే రైన వీనులఁ బెట్టఁ డెపుడు
చాన మైగాలి సోఁకిన స్నాన మాడు
వానిఁ గని లోక మారీతి వఱలు నేమొ?
అతని నోడింపవలె జగద్ధితముకొఱకు.

గీ. ఆవిరాగి మహాయోగి సానురాగిఁ
జేయఁ గలవాఁడ వన్యులు సేయఁ గలరె?
ఇమ్మహాకార్యభారంబు సమ్మతించి
చక్కఁ జేయుము శాపోపశాంతి కైన.

గీ. ఆతఁ డుద్వాహ మైనఁ దనంతఁ దానె
భామినీభోగసంతోషపారవశ్య

మున నవశ్యంబు గా నిన్నుఁ । బ్రోవఁ గలఁడు
సాహసింపుము శాపోప।శాంతి కైన.

ఉ. ఇచ్చ రవంతయుఁ జొనుప। నీయఁడు నెమ్మది మచ్చకంటిపై
మచ్చర మూని. మండిపడు; । మానివరేణ్యుల కగ్రగణ్యుఁడై
కచ్చ బిగించి కట్టె; మమ। కారమునుం దమకంబుఁ బాసె; నీ
చిచ్చుఱకంటిఁ జంచలిత। చిత్తునిఁ జేయుము పుష్పసాయకా!.

మన్మథప్రాగల్భ్యము

ఉ. ఆచతురాననుం డెలమి । నాడినపల్కుల నాలకించి సం
కోచముఁ బాసి మీసముల । గోముగ దువ్వుచు వాలుఁజూపులన్
జూచుచు, మందహాసమున । జోటియుఁ దన్గనుచుండఁ బుష్పనా
రాచములన్ ధనుస్సును గ।రంబునఁ బూని సుమాస్త్రుఁ డిట్లనున్.

ఉ. దేవ! మహానుభావుఁడవు । దివ్యచరిత్రుఁడ వీవు నీమనో
భావము సంగ్రహించితి, ధ్రు।వంబుగ నట్లొనరించువాఁడ, నా
పూవులు తూపులై యెవని । మోహితుఁ జేయవు; రూపురేఖలన్
దావల మైనదాని నొక।తన్వి సృజింపుము చారుసుందరిన్.

ఉ. ఎక్కడ కేగినన్ విడువ । నెమ్మెయి నీశ్వరు నీడఁ బోలి, నే
డక్కొనంగ నోపుదు, దృ।ఢవ్రతచిత్తుఁ డతండు గన్నులన్
జక్కగ విప్పునప్పటికి । సౌరభముల్ గడలన్ గుబుల్కొనన్
జక్కనిచుక్క నా నెదురఁ । జాన యొకర్తుక యుండఁ బోలదే ?.

గీ. తగుల మెఱుఁగనిమగవాని। మొగము నెదురఁ
జిన్నినగవులు మోమునఁ । జెంగలింప
జోటి నిడువాలుఁజూపులఁ । జూడకున్నఁ
గలదె నాపూవుఁదూపుల। వలనిఫలము?.

వ. ఇట్లు మదనుండు వలుక నాగాంభీర్యవాక్యంబుల నాలించి యవ్వి
రించి దీర్ఘముగ నాలోచించుచు దీర్ఘనిశ్శ్వాసము విడుచునంత,

## వసంతుని సంభవము

సీ. పల్లవోల్లాస మై । పల్లవవ్రాతంబు
చూతవృక్షంబుల । సొబగు నింప
బాలపల్లవపిక । స్వరసుస్వరంబునఁ
గోయిల కో యని । కూయుచుండ
సర్వపుష్పాసవా । స్వాదనసంభ్రమ
భ్రమరఝుంకారని । స్వనము లెసఁగఁ
బుష్టపుష్కరసరః । పుండరీకకషాయ
గంధంబుఁ దాలిచి । గాలి వీవఁ
గీ. బూలలోన మోదుగునకు । స్త్రీలలోన
రోవెలందికి వలపులు । లేవటంచుఁ
గింశుకంబుల శుకములు । గ్రేళ్ళు దాఁట
వింతగ వసంతుఁ డప్పు డా । విర్భవించె.

వ. శోణరాజీవసంకాశుండును, ఫుల్లతామరసేక్షణుండును, సంధ్యోదితాఖండశశిప్రతిమానాస్యుండును, సునాసికుండును, శంఖవచ్ఛవణావర్తుండును, శ్యామకుంచితమూర్ధజుండును, సంధ్యాంశుమాలిసదృశకుండలద్వయమండితుండును, ప్రమత్తమాతంగగమనుండును, విస్తీర్ణహృదయస్థలుండును, పీనస్థూలాయతభుజుండును, సువృత్తోరుకటీజంఘుండును, కంబుగ్రీవుండును, నున్నతాంసకుండును, సర్వలక్షణలక్షితుండును నగునవ్వసంతుఁ గాంచి సంతసించి యాహిరణ్యగర్భుండు మన్మథున కి ట్లనియె.

గీ. జలరుహాంబక! యితఁడు నీ । సహచరుండు
నీకు ననుకూలముగ నుండు । నీడఁ బోలి
యూఁతకోలగ నెప్పుడు । నుపచరించు
ననిల మనలంబుతో నుండు । నట్లు లుండు.

గీ. కాంతి దీపంబు విడువని।కరణి, సౌర
భంబు పుష్పంబుఁ బాయని।భంగిఁ, బ్రకృతిఁ
గాల మనుసరించువిధాన । గాఢమైత్రి
నమరియుండుఁడు మీర ల।న్యోన్యముగను.

కం. *బతకారణభూతుం డై
యితఁడు వసింపంగ నోపు । నెల్లప్పుడు న
క్కృతమున వసంతుఁ డనఁగను
గృతకృత్యుఁ డగు నిను ననుస।రించుచునుండున్.

మ. రతితోడన్ సఖుతోడ నీవు కపిక।వ్రాతంబుతోడన్ సమం
చితశృంగారవిలాసపూరుషుఁడ వై । చెల్వొందుచున్ గామసం
గతునిం జేయుము పాలనేత్రుఁ; నతనిన్ । గామించి ప్రేమించి స
మ్మతిపైఁ బెండ్లి యాడఁ గాఁ దగినభా।మన్ నేను సృష్టించెదన్.

వ. ఇట్లు పితామహునిచే నాజ్ఞాపితుం డై మన్మథుండు నమస్కరించి దక్షాదిమానసపుత్త్రుల దీవనలం బడసి మిత్త్రుం డగువసంతుం జేకొని రతిద్వితీయుం డై యథేచ్ఛం జనియె. అనంతర మాలోకేశుండు దక్షాదిమానసపుత్త్రులం గాంచి యి ట్లనియె.

బ్రహ్మ తప మొనరింప దక్షుని నియోగించుట

మ. మదిలోఁ జింతకు మేర లేదు, త్రిజగ।న్మాన్యుండు పాలాక్షుఁ డే
ముదితన్ జూడఁడు, నే సృజించినసతిన్ । మోహించి కామించినం
గద నాకార్యము సానుకూల మగుఁ; గం।కర్తవ్యతాసంశయా
స్పదచిత్తంబునఁ దల్లడిల్లియు మహో।పాయంబు యోజించితిన్,

గీ. విష్ణుమాయయె సదసద్వి।వేక మెల్లఁ
జూఱఁగొన నోపు; నామెవాల్।చూపులకును

* బతశబ్దము సంతోషదుఃఖాద్యర్థముల యం దుపయోగింపఁ దగియున్నది. "బతానుకంపా సన్తోష ఖేదా మంత్రణ విస్మయే"..అని నానార్థరత్నమాల.

జిక్కి శంభుండు మోహించి । సొక్కి సోలఁ
గరము వినుతింతు నామె నిక్కార్యమునకు.

గీ. యోగమాయ జగన్మాత । యోగనిద్ర
విశ్వరూపిణి శివుని మెప్పించి పెండ్లి
యాడ వలఁతి యగుఁ; దనయఁ గా । నామెఁ బడయఁ
దపముఁ గావింప దక్షుండు । దక్షుఁ డగును.

మ. అనునప్పలుకుల నాలకించి మది "నా।రా భాగ్య మిట్లుండునే?"
యని సంతోషముఁ జెంది బ్రహ్మఁ గని "యో।యబ్జోద్భవా! నీదునా
జ్ఞను బాలించెద, విష్ణుమాయ యభవున్ । జాయాస్వరూపంబునన్
తనస్వాధీనునిఁ జేయఁ జాలు నని ప్రో।త్సాహించె నాదక్షుఁడున్.

గీ. అదియ యుక్తంబుగా నుండు । నని మునీంద్రు
లెల్లరు వచింప నాదక్షుఁ । డుల్లసిల్లి
క్షీరవార్ధికి నుత్తర।తీరమునను
దనరు నావిష్ణుమాయ కై । తప మొనర్చె.

గీ. మారుతాశి యై సుష్కించి । నీర మాని
పర్ణములమాత్రము గొని । స్వాంత మెపుడు
విష్ణుమాయపై నిలిపి సహిష్ణుఁ డగుచు
మూఁడువేలేండ్లు జపతపం।బుల నొనర్చె.

వ. అట్లు దక్షుండు తపం బొనర్చుచుండ, జగత్పతి యగుబ్రహ్మయు మనోవేగంబున, హంసయానంబున, క్షీరోదంబు నతిక్రమించి యుత్తరపుదిక్కునకుఁ జని చని,

కం. ధరమున్ శృంగాశ్రితకం
ధరమున్ మృగఘూర్తకకృత।దరమున్ మణికం
దరమున్ ఝురసూదరమం
దరమున్ వీక్షించె నపుడు । దరహాసమునన్.

వ. అట్లు వీక్షించి సమీపించి తత్కందరమునం గలవిష్ణుమాయను సందర్శించి ప్రమోదితమానసుండై యాయంబను నిట్లు స్తుతించెః

బలిస్వీకృతవిష్ణుమాయాస్తుతి

మాలిని. జయతు జయతు మాతా । సద్గుణవ్రాతపూతా
జయతు జయతు మాయా । సన్మునిస్తోత్రగేయా
జయతు జయతు ధాత్రీ । సర్వలోకైకజైత్రీ
జయతు జయతు దుర్గా । సర్వజీవత్రివర్గా.

మ. అతులంబై, బహుభీకరంబయి, యవాచ్యంబై ప్రకాశించి, భూ
స్థితికిన్ సృష్టికి మూలబీజ మగునీ తేజంబు బ్రహ్మాదధీ
ధితి రై మోహన మై వశీకరణ మై । దీపించుచున్ ముక్తికిన్
గతిఁ జూపించును గాదె ? నీ కిదె నమస్కారంబు నారాయణీ!.

మ. నినుఁ గీర్తింప గ్రహింప శక్య మగునే ? । నీరూపభేదంబులై
వనితల్ విద్యలు నీమహామహిమచే । వర్ధిల్లి, యేవేళ నీ
యనుభావంబు వచించునీజగములన్ । వ్యాపించి యుండుం గదా
ఘనమాయావృతచిత్స్వరూపిణి ! నమస్కారంబు నారాయణీ!.

దండకము. శ్రీవిష్ణుమాయా, మహాయోగమాయా, మునిధ్యేయ, విజ్ఞానవిజ్ఞేయ, వేదాంతనిర్ణేయ, యోగీంద్రసన్మాననీయా, మహాయోగనిద్రాసమున్నిద్ర, యక్షుద్రవిజ్ఞానముద్రా, జగద్భద్ర, రౌద్రస్వరూపాహతారాతిరాట్దీర్ఘనిద్రా, యవిద్యాత్మికా, సర్వవిద్యాత్మికా, శుద్ధమాయానువిద్ధా, సువిజ్ఞానరుద్ధా, మహాకాళరాత్రీ, మహామోహరాత్రీ, జగద్ధాత్రి, కళ్యాణసంధాత్రి, దేదీప్యమానోరుగాత్రీ, యనిర్వాచ్యచారిత్రి, లోకైకజైత్రీ, నిరాలంబ, లోకాంబ, ఖేదాంత వేదాంత వీణాధరా, చారుసస్మేరశోణాధరా లోకదీపంబు నీదివ్యరూపంబు సృష్ట్యంతరవ్యాప్తమై దీప్తమై,

జ్ఞానసంప్రాప్తమై యుండఁగా నెన్న నే నెంతవాఁడఁ, బరంబై స్థిరంబైన నీదివ్యదృష్టిఁ మహాసృష్టిసంభూతమై పూతమై సర్వభూతాళికానీతమై యుండు, నాచేతకుఁ హేతుభూతంబుగా నుండు, నోతల్లి, దేవిమతల్లీ, సమత్కల్పవల్లీ, జగత్సర్వభూతాళికిఁ శక్తివై భుక్తివై రక్తివై ముక్తివై యుండు వోశక్తి, సద్భక్తి నీవాసిఁ గీర్తింపఁగాఁ జాల, నిఁ బాసి వర్తింపఁగాఁ జాల, నర్తింపు మేవేళ నాయంతరంగంబునఁ దమ్మిలోభృంగముం బోలి, మాన్యుండనై లోకధన్యుండనై సర్వపుణ్యుండ నౌదుఁ, వరేణ్యుండ నౌదుఁ, త్రిలోకాగ్రగణ్యుండ నౌదుఁ; బరంజ్యోతి వోనాతి నీనీతి విఖ్యాతి నేరీతి వర్ణింపఁగాఁ బోలు? సంసారికిఁ గల్పభూజంబు నీదివ్యతేజంబు; నీమందహాసంబు విద్యావిలాసంబు, మన్మానసోల్లాస, మీసృష్టికావాస, మేవేళ భక్తాళి కాశ్వాస, మైశ్వర్యవిన్యాస; మజ్ఞానరూపంబునఁ మేఘసంకాశమై యుండు నీకేశపాశంబు, సంమోహపాశంబుగా నుండు; నీసృష్టిరూపంబునఁ నీవు సంసారముఁ సారవంతంబుగాఁ జేయవే? యీయవే ముక్తి; శ్రీవిష్ణురూపంబునఁ లోకజాలంబుఁ బాలింపవే మేలు కీలింపవే కీడుఁ దూలింపవే; వేగ నాపల్కు లాలింపవే నన్నుఁ బాలింపవే పెంపు దీపింపఁగా నింపవే పేర్మి; మన్నింపవే నీదుభక్తుండ; లోకాంతరూపంబునఁ నీవు కోపంబునఁ ఘోరతాపంబు స్థాపించి, లోపంబు లేకుండ పాపంబునన్ నిండు లోకంబు నత్యంత మంతంబుఁ బొందింపవే నాకు సంధింపవే సృష్టిహేతుత్వముఁ; నీదుతత్వంబు సత్వంబు మాయాపటుత్వంబు నూహింప శక్యంబె? మోహింపఁగాఁ జేయు; మేధాస్వధామోహాలజ్జావషట్కారముల్ నీవ, స్వాహానమస్కారముల్ నీవ, శాస్త్రంబులుఁ నీవ, శస్త్రంబులుఁ నీవ, యస్త్రంబులుఁ

నీవ, వాదంబులుఁ నీవ, వేదంబులుఁ నీవ, మోదంబు ఖేదంబు నీరూపభేదంబులై యుండు, నీదివ్యలక్ష్మీస్వరూపంబునం గాదె వైశ్వర్య ముత్పన్నమై సర్వభూతంబులఁ బ్రోచుచుండుఁ మదంబా, యనిత్యంబుగా నుండియుఁ నిత్యమై యుందు వేవేళ సత్యంబునం దుండి లేనట్టులే సర్వసాహిత్యకృత్యంబులం జేయు దో శంఖినీ చాపినీ ఖడ్గినీ శూలినీ, చక్రిణీ, నిత్యకళ్యాణి, చిద్రూపిణీ వాణి నారాయణీ! శాశ్వతానందసంధాయినీ దేవతాధ్యాయినీ దామినీ కామినీ రూపమాయావినీ విశ్వసంజీవినీ మానినీ విశ్వయోనీ యయోనీ, మహానిద్ర సంమోహనిద్రా మహాయోగనిద్రా జగన్మాత నిర్మాత, మాం పాహి శ్రీవిష్ణుమాయా నమస్తే నమస్తే నమస్తే నమః.

వ. అని కీర్తించిన నమ్మహాదేవి యమ్మహానుభావుం గని మేఘగర్జనముం బోనిసుస్వరంబున నిట్లనియె.

ఉ. ఏటికి నిట్లు భీతిని న।నేకవిధంబుల సన్నుతింప నీ
నాఁటికిఁ గీడు వాటిలెనె? । నన్నుఁ గనుంగొనిరేని కార్యమే
పాటిది యైన సిద్ధి యగు । వత్స! వచింపుము సత్వరంబ, పె
న్గోట నొనర్చెదన్, శుభము। గూర్చెదఁ, బేర్చెద, వంతఁ దీర్చెదన్.

ఉ. జ్ఞానివి, సృష్టికర్తవు, జ।గన్నుతసద్గుణశాలి వక్కటా!
హాని ఘటిల్లె నేమొ? భవ।దాజ్ఞను లోక మతిక్రమించి స
న్మానముఁ జేయలేదొ? వన।మాలియు శూలియు సాదరంబునన్
గానరొ? యంశుమాలియును । గాలియుఁ గీలియు మేరఁ దప్పిరో?.

ఉ. ధాత్రి యథాప్రకారమును । దప్పక యున్నవె పంచభూతముల్?
పుత్రులు వేదమార్గమును । బూని చరింతురె? భార్య యైనసా
విత్రికి సేమమే? నిగమ। వేదులు, ధీవరు లాప్రజాపతుల్
మైత్రిని గల్గియుందురె? ప్ర।మాదము లేదు గదా వచింపుమా?.

## ⊰ బ్రహ్మ యీశ్వరుని గృహస్థుఁ జేయఁగోరుట ⊱

వ. ఇప్పలుకుల నాలించి ప్రమోదితమానసుం డై బ్రహ్మ యి ట్లనియె.

సీ. సర్వ మెఱుంగఁగఁ । జాలుదు వెఱుఁగని
భంగి భాషించెదు । పాడి యగునె
అద్వితీయుం డయి । యభవుండు చరియించుఁ
బొలఁతిపై నైన నె । వ్వలన వినఁడు
రామాభిలాషమా । త్రమునకు నిందించు
వరగృహస్థులఁ గాంచి । పరిహసించు
కామంబుఁ బ్రేమంబుఁ । గల నైన నెఱుఁగఁడు
గృహిణి యన్న పలుకున । కేవగించు

గీ. నాదిలక్ష్మి నై పూర్వము । హరి గృహస్థుఁ
జేసినట్టుల శంభునిం । జేయవలయు
సారసంసారవిముఖుఁ డై । సంచరించు
వాని గృహమేధిఁ గాఁ జేయ । వలదె చెపుమ?

గీ. ఆవిరాగి మహాయోగి । నని తలంచి
పరులసంసారులం గాంచి । పరిహసించు
ధిక్ ! గృహస్థాశ్రమం బంచు । ధిక్కరించు
నంబ! యాలింపు మాతని । యాగడంబు.

ఉ. స్నానముఁ జేయుచున్న యొక । చానఁ గనుంగొని "యాఁడుదాన వే?
జ్ఞాన వధూవిలాసవతి । వౌదువె; మానుల వాలుఁజూపులన్
దీనులఁ జేయఁజాలుదువె; । ధీవరుఁ డెవ్వఁడు నిన్నుఁ జూచునే?
జ్ఞానము లేదు గాని నెఱ । జాణవె" యంచు హసించె నెంతయున్.

ఉ. ధీరుఁడ వాడు వహ్నిఁ బరి । తృప్తునిఁ జేసినవాఁడ వాడు, కాం
తారము సేవగించువని । తాపదదాసుఁడ వీవ యాడు, వా

కార ! వివేకపాకమహి।మాతిశయాఢ్యుఁడ వౌదు వంచు సం
సారముఁ జేయునొక్క యజ।మానునిఁ గాంచి హసించె వింటివే ?.

ఉ. ముద్దులు గుల్కు మోముపయి । మో ఖిడి కౌఁగిటఁ జిక్కి కానలో
ముద్దియ యొత్తు ప్రాణవిభు । ముద్దిడి ముద్దులమూటఁ గట్టుచున్
సుద్దులఁ బల్కుచుండ మన।జోగి కనుంగొని సృష్టికారణం
బద్దిర! యిద్ది యంచుఁ బరి।హాసముఁ జేసెఁ దృణీకరించుచున్.

చం. ఇతఁడు గృహస్థులన్ బ్రదుక।నీయడు సృష్టికి మూల మైనసం
గతమును గ్రేణి సేయుఁ దమ।కంబుఁ ద్యజించినసంయమీంద్రులన్
యతులను జేరఁ దీయు ; జగ।దంబ! జగంబున కైన నీదృఢ
వ్రతుని, విరాగి, యోగి, నను।రాగినిఁ జేయుము సంతసించెదన్.

గీ. అతఁ డఖిలజగన్నుతుఁ । డైనయోగి
యివ్విధంబున నెల్లర । నొవ్వనాడు
నేని యెల్లరు యోగీంద్రు । లైనఁ దల్లి !
సృష్టి యనునది యెట్లు వ।ర్ధిల్లుఁ జెపుమ?.

ఉ. ఇట్టుల నేవగించెడుయ।తీంద్రు గృహస్థునిఁ జేయకుండినన్
జెట్ట పొసంగు నమ్మ! యిది । నిశ్చయ మాతనిచర్య నాతలన్
గొట్టినయట్టు లుండు, నినుఁ । గొల్చితి నెట్టుల నైనఁ జెట్టులన్
బుట్టల గట్టులన్ వెదకి । మోహితుఁ జేసి, వరింపఁగావలెన్.

గీ. నిన్ను శరణంబుఁ జొచ్చితి । నీవు దక్క
యితరు లతనిమోహించి మో।హింపఁ జేయఁ
జాల రోయంబ ! జగదంబ ! । జాల మేల?
ఇతని నోడింపవలె జగ।ద్ధితముకొఱకు.

వ. అప్పలుకుల కమ్మహాదేవి వెండియు నిట్లనియె.

శా. ఈమాత్రంబున కింతవంత తగునే ? । యే నుండఁగన్ సృష్టికిన్
క్షేమం బూఁడదె ? నే నెఱుంగుదును ము।న్నే వీని నె ట్లైనన్

భామాపాంగనిబద్ధుఁ జేయుటకునై । భావించితిన్ వత్స ! ని
ర్ధామున్ వాని గృహస్థుఁ జేసెద జగ। ద్ధర్మంబుఁ గాపాడెదన్.

గీ. ఆతఁ డగృహీతుఁ డైన నీ । వనినయట్లు
సృష్టి వర్ధిల్లనేరదు । శిష్టు లైన
నార్యజనమార్గపద్ధతి । ననుసరించి
మెలఁగుదురు పామరులఁ జెప్ప। వలెనె వత్స?.

గీ. పెద్ద లేజాడ నేగినఁ । బిన్న లైన
వారునైత మాపద్ధతిఁ । బట్టియుంద్రు
వారిసిరి వీర లొందసి। వార లైన
వారిచెసు గ్గెట్టు లైనను । వీరి కబ్బు.

బ్రహ్మవచనంబులకు విష్ణుమాయ సమ్మతించుట

ఉ. ఇంతకుమున్నె యీశ్వరుని । నెవ్విధి నైన గృహస్థుఁ జేయఁ గాఁ
బంతము గొంటి, నిప్పుడు భ। వద్వచనంబున నాతలంపు రెం
డింతలు హెచ్చె ; నీవు వచి। యించినయ ట్లొనరించుదాన న
త్యంతమనోహరాకృతిని । నాతనిచిత్తము నేఁ గరంచెదన్.

ఉ. అంతకుఁ జాలనోటు ? తన। యంత నెతాను వరించుభంగి నే
కాంతవనాంతరంబుల ల। తాంతనికుంజగృహాంతరంబులన్
గాంతలతో మెలంగుచు జ। గం బఖిలంబును సన్నుతింప న
త్యంతమనోహరాకృతిని । నాతనిచిత్తము నేఁ గరంచెదన్..

ఉ. దక్షుఁడు సంతసింపఁ దన। దారకుఁ బుత్త్రిక నై జనించి ప్ర
త్యక్షమనోహరాకృతి, సు। రాసురకిన్నరసిద్ధసాధ్యులున్
యక్షులు సన్నుతింప నిట। లాక్షుని఼ బెండిలి యాడెదన్ జగ
ద్రక్ష యొనర్చెదన్ వినుము పి। తామహ ! నీకు శుభంబుఁ గూర్చెదన్.

ఉ. స్థాణునిచెట్టపట్టి రిపు। సంఘము భీతి వహించి నన్ను రు
ద్రాణి యనంగ, శిష్టజన। తండ్రము శంకరి యా నుతింప, శ

ర్వాణి యనంగ లోకము; వి।రాజిలుదాన భవజ్జగజ్జన
తాళి మొనర్చుదాన నల।దక్షుని చక్కనిచిన్నదాన నై.

గీ. భువనముల నెల్లప్రాణులు । మోహమునకు
వశము లై యుండునట్టు లీ।పరమయోగి
రాగి యై నాకు వశ మాను । భోగి యగును
వంత యింత నీ కేటికి । వత్స? పొమ్ము.

వ. అని యిట్లు వచించి యమ్మహాదేవి యంతర్హిత యయ్యె. అనం
తరమున,

మ. కలయో నిక్కవమో వచింప నరు దై । కన్పట్టె; నాదేవి యు
మ్మలికన్ బాపుచుఁ బల్కుపల్కులు సుధా।మాధుర్యముం జిల్కుచున్
భళిరా! వీనుల మ్రోఁగుచున్నవి; స్మరిం।పంబోలు నశ్రాంతమున్
గలిమిం గాంచినపేద నైతి నతులా।నందః బసుందంబు గాన్.

మ. వనజాతోద్భవ చింత యేటి కని, నన్ । వాత్సల్య మేపారఁగన్
గని నాభావ మెఱింగి లోకము లెఱుం।గన్ శక్తిఁ బెండ్లాడెదన్
జను మంచు న్వచియించెఁ గాదె? యహహా! । సౌభాగ్య మిట్లుండునే
యని సంతోషము మీఱ నై మఱచి య।త్యాశ్చర్యమున్జెందు చున్.

వ. చని చని శతానందుం డమందానందంబు క్రందుకొను డెందంబున
సత్వరగమనంబున మన్మథుః డుండుస్థలంబున కేగి యాతని నమ
స్కృతు లంది హర్షోత్ఫుల్లలోచనుం డై యిట్లనియె.

బ్రహ్మ విష్ణుమాయాప్రభావంబు మన్మథునకు బోధించుట

గీ. క్షీరసాగరోత్తరతీర।సీమయందు
నందముగ నుండుమందర।కందరమున
విష్ణుమాయను గాంచితిఁ । దృష్ణ తీఱ
నామె దక్షునిపుత్త్రిక । యై జనించు.

ఉ. పూర్వము పల్కవే భువన। మోహిని యైనమనోహరాంగినిన్
శర్వుని కై సృజింపు మని; । సత్వర మేఁ జని విష్ణుమాయకున్
సర్వ మెఱుంగఁ జేసితిని । నావచనంబుల నాలకించి తా
నుర్వి జనింప నొప్పుకొనె । నొప్పరికింపకు మిప్పు డిప్పనిన్.

మ. అనునప్పల్కుల నాలకించి మదనుం । డాశ్చర్యముం జెంది యో
వనజాతోద్భవ! విష్ణుమాయ యనఁగాఁ । బ్రఖ్యాతిఁ గన్నట్టి యా
వనజాతాయతనేత్ర యెవ్వరిత ? యా। ఫాలాక్షు వంచింప నో
పినదే ? నేఁ జని ముచ్చటింప నగునే ? । వేగంబునన్ జెప్పవే ?.

గీ. ఆవిలాసిని చక్క నిదా ? కటాక్ష
పాతముల మత్కుసుమబాణ। పాతములను
మీఱఁ జాలినజాణయా ? । మెలఁతలందు
వన్నె కెక్కినకన్నెయా । వనజగర్భ ?.

వ. అని మదనుండు పలుకుపలుకుల నాలించి యుత్సాహపూరితుండై సంతోషపారవశ్యంబునఁ, జెప్ప నెంచియుఁ జెప్పఁ జాలక యవ్వనజగర్భుండు గమనాయాసంబుఁ దీఱ నిట్టూర్పు విడచుచునంత, నతిభయంకరాకారులును, తురంగవదనులును, గజముఖులును, సింహవ్యాఘ్రముఖులును, వరాహఖరాననులును, ఋక్షమార్జారవక్త్రులును, శరభాస్యులును, ప్లవగోమాయుముఖులును, సరీసృపాదివదనులును, మహాదీర్ఘులును, మహాహ్రస్వులును, మహాస్థూలదేహులును, మహాకృశులును, పింగాక్షులును, విరళాక్షులును, త్ర్యక్షులును, నేకాక్షులును, మహోదరులును, నేకకర్ణులును, త్రికర్ణులును, స్థూలకర్ణులును, మహాకర్ణులును, వికర్ణులును, చతుష్పాదులును, పంచపాదులును, హ్రస్వపాదులును, దీర్ఘపాదులును, స్థూలపాదులును, హీనపాదులును, నేకహస్తులు, త్రిహస్తులును, హస్తహీనులును, శింశుమారాకా

రులును, క్రౌంచాకారులును, బకాకారులును, హంససారసస్వ రూపులును, వివిధవిచిత్రవర్ణగాత్రులును, శూలహస్తులును, పాశహస్తులును, ఖడ్గహస్తులును, ధనుర్హస్తులు నగువార లుద్భ వించి మారయ ఛేదయ యని యధికకోలాహలమున మహాట్టహా సముఁ జేయుచు నుండ వారిసందడి నివారించి వారిజోద్భవుఁడు యోగనిద్రాప్రభావంబు మన్మథునకుం దెలియఁజేయ నుద్యమిం చుచుండ మదనుం డిట్లనియె.

చ. అనఘ! కనుంగొనన్ మిగుల నక్కజ మయ్యె వికారరూపు లీ
జనులు వసింపఁగాఁ దగినస్థానము లెయ్యవి? వీర లెవ్వ? రె
వ్వని కయి సృష్టిఁ జేసితివొ? వానికి వీరిసహాయ మెట్టిదో?
వినిమెద నానతి మ్మనిన వేధయు వారలఁ గాంచి యిట్లనెన్.

కం. మారయ ఛేదయ ఛేదయ
మారయ యని వీరు మాటిమాటికి ననుటన్
మారు లనంగను బొల్చెద
రారూఢిని నీయనుచరు లౌదురు మదనా!.

సీ. భవదీయపుష్పాస్త్రవశవర్తులకు సదా
చిత్తవిభ్రాంతి సృజించుచుండ్రు
జ్ఞానులజ్ఞానమార్గమునకు విఘ్నంబు
సతతంబు గావింపఁ జాలియుండ్రు
సర్వజంతువులసంసారకర్మం బవి
ఘ్నంబుగా నేవేళ నడుపుచుండ్రు
పంచయజ్ఞాంశముల్ భక్షించి మానుల
స్త్రీలకు దాసులం జేయుచుండ్రు

గీ. హృదయమున స్థైర్య మించుక యేని లేని
వానిఁ గాంతకుఁ బాదసేవకునిఁ జేసి

యాట లాడించుచుండ్రు, నిన్ననుసరించి
నీదునాజ్ఞను బాలించి నెగడుచుండ్రు.

వ. అని వచించి యనంతర మమ్మహానుభావుండు యోగనిద్రాప్రభావముం జెప్పందొణంగె. అవ్యక్తవ్యక్తరూపంబున సత్వరజస్తమోగుణములచే సర్వంబు విభజించి యంతట వ్యాపించి విష్ణుమాయ యనంగ వెలసె. నిమ్నాంతస్థలాంభస్థ యై యండకపాలంబులం బోలుజగంబు విభజించి యోగనిద్రారూపంబునం బురుషుం బొంది యోగనిద్ర యనంగఁ బ్రఖ్యాతిఁ గాంచె. మంత్రాంతర్భావనపర యై పరమానందరూపిణి యై పరాత్పర యై యోగులకు సత్త్వవిద్యం బ్రసాదించు నామె నెన్న శక్యంబె? గర్భాంతర్జ్ఞానసంపన్నప్రేరితం బయినజీవంబును సూతిమారుతాహతిఁ బుట్టించి యనంతరము నిరంతరంబుగ జ్ఞానరహితముం జేసి క్రమక్రమముగ సంస్కరింపఁ జేస క్రోధలోభాదులం జొనిపి మమత్వాజ్ఞానసంశయంబుల నంకురింపఁ జేసి కామచింతాపరత్వముం గల్పించి మహామాయయనంగఁ బెం పెక్కె. ఆమె జగదీశ్వరి యై యహంకారాదిసంసక్తిసృష్టిప్రభావభావిని యై యనంతరూపిణి యై లోకోత్పత్తికి హేతుభూత యై యూహింప నశక్యంబుగ నుండు నామె వర్ణింపం దరంబె? అఖిలరూపంబులకు జనని యై సృష్టికి నీశ్వరి యై క్షమకు క్షమ యై కరుణకుఁ గరుణ యై నిత్యంబునకు నిత్య యై జగద్గర్భంబునం బ్రకాశించుపరంజ్యోతి యై వ్యక్తావ్యక్తంబులం బ్రకటింపంజేయుచు, విద్యారూపంబున వైష్ణవి యై యోగులకు మోక్షలక్ష్మి యై సంసారికులకు సంసారబంధ యై రహించి లక్ష్మీస్వరూపంబున శ్రీవిష్ణు నలరించి ప్రియారూపంబున మర్త్యాంతస్థ యై సర్వజంతువులకు మనోహారి యై నిత్య యై విరాజిల్లుం జూవె.

ఉ. ఇంతకుఁబూర్వ మామెయు మ । హేశ్వరుఁ బెండిలి యాడ నెంచె; నీ
వెంతకుఁ జాల వంచు నతి । యుచితి దక్షున కుద్భవింప; నీ
వింతటినుండి భార్య యగు । నీరతిదేవి, సుగంధపుష్పభా
స్వంతుఁడు నీవసంతుఁ డని । శంబును గొల్వఁగ నుండు మంతటన్.

గీ. యోగమాయ దక్షునిభార్య । కుద్భవిల్లుఁ
దల్లడిల్లెదునాయుల్ల । ముల్లసిల్లఁ
గార్య మీడేఱు సృష్టియు । ఘనతఁ జెందు
మదన! ఖ్యాతి కెక్కుము జగ । న్మండలమున.

మన్మథుని ప్రగల్భవాక్యములు

ఉ. నావుడు మన్మథుండు వదనంబు ప్రఫుల్లము గాన్ హసించి యో
హో! విధి! యట్టు లైన మతి । యున్నదె? మాటల కేమి? యమ్మహా
దేవు వరింపఁ జాలినస । తీమణిఁ గానము నిశ్చయంబు; నా
పూవులు ఫాలనేత్రుని వి । మోహితచిత్తునిఁ జేయఁ జాలునే?.

ఉ. అంటివిఁ గందుబాణములు । హా త్తనిసన్ భయ మొంది, డేగ వె
న్నంటినభంగి నీశుకపి । కాదులు పర్విడు; వానికంటెపె
న్మంటల కేను మాధవుఁడు । మాడి నశింతుము; నీదుమాట కీ
కొంటెని గాక కార్య మొనఁ । గూడునె? స్థాణువు సంచలించునే?.

చం. జనులను యక్షరాక్షసుల । సాధ్యుల సిద్ధులఁ దక్కువారలన్
వనితలపాదదాసుల నొ । నర్పఁగఁ జాలుదు నొక్కతూపునన్
మునులను యోగులన్ భుజగ । భూషణుఁ డీషణశోషణుం డనన్
ఘనత వహించెఁ గార్య మతి । కష్టతరం బని నాకుఁ దోఁచెడిన్.

ఉ. ఆఁడుది పుట్టు లేడ? కుసు । మాప్తుఁ డైనసఖుండు మాధవుం
డేడ? రవంతసందడికి । నేడ్కొ నెగెడుపక్షు లేడ? నే
నేడ? మహేశ్వరుం గెలుచు । టేడ? యెఱుంగవొ మంచిచెడ్డలన్?
గీడు ఘటిల్లు నంచుఁ బరి । కింపవొ? వెంబరపత్తు వైతివో?.

ఉ. ఇంతకు నీవు నన్ను శపియించితి విప్పుడు జంక నేల ప్రా
ణాంతక మైనఁ? గార్య మెటు లైనను జేయక తప్పునోటు? లో
కాంతకుఁ డైనరుద్రునయనానలకీలకు భస్మ మాదు నీ
స్వాంతము సంతసించు నపు డంబుజగర్భ! విచార మేటికిన్.

చ. అన విని తెల్లఁబోయి యపు రా! మదనుండు ధృతిం దొలంగెఁ గా
యని కడుభీతిఁ జెంది యపు డాదట బ్రహ్మ వచించె నోయి! నా
నెనరున మేలు చేకుఱును, నీభుజదర్ప మమోఘ మీ వెఱుం
గనికత మట్లు పల్కితివి; కార్య మసాధ్యమె నేఁ దలంచినన్.

చ. జగము భవచ్ఛరంబునకు సాగరమో యన సంచలించు; నీ
యగణితబాహుదర్పము మహాత్తరశక్తియు నీ వెఱుంగ; వా
శుగము త్యజనంతనె వశుం డగు నిక్కము సాహసింపుమీ
భగ భగ మండునీదుశరవహ్నికి వహ్నియు శీతలం బగున్.

ఉ. ఆమెప్రభావ మీ వెఱుఁగ వంతట నిండిన విష్ణుమాయయే
నీమహనీయశక్తి గమనింపును మే లగు సాహసింపు మో
కామ! భవత్ప్రతాపము జగం బఖిలంబు నుతించుఁ జూవె; నీ
క్షేమమె యాత్మ నెంచితి, వచించితి నీ కనుకూలపద్ధతిన్.

ఉ. శాపము దప్ప దింతకు నొసంగితి లోకము లెల్ల నాపయిన్
జాప మొసంగినాఁడె శరజాల మొసంగినవాఁడఁ జూడ నే
లోపముఁ గాన రాదు; ధృతిలోపమునన్ భయ మొంది నాపయిన్
గోపముఁ జెంది కార్య మొనగూర్పక యుండిన లాభ ముండునే?

చం. అనవుడు మన్మథుండు పరిహాసముఁ జేసితి నాదుశక్తియున్
గనుఁగొన నట్లు పల్కితి, జగద్ధితకార్యముఁ జేయకున్న నీ
యనఘుఁడు కోప మూను, నితఁ డాత్మ నధైర్యముఁ జెందునేని శం
భుని గెలువంగ శక్యమె? ప్రబోధముఁ జేసెద నంచు నెంచుచున్.

చం. పక పక నవ్వి యిట్లనియె । బ్రహ్మఁ గనుంగొని దేవ! నీవు నా
తికమకపల్కులన్ బెగడి । తేఁకువఁ దప్పితె? నీదుచిత్తమున్
దకపిక లాడెనే? యకట । స్థాణువు నా కొకలెక్క యానె? నా
శుకపికముల్ చెలంగిన, వ।శుం డగు నింతవిచార మేటికిన్?.

ఉ. కర్పరధారి యైనశితి।కంఠుఁడు, క్రొన్నెలవేఁడివెన్నెలన్
గూర్పఁగఁ దాళునోటు? ధృతిఁ । గోల్పడి కీడ్పడి తల్లడిల్లఁడే?
దర్ప మణంచి వాని వని।తాపదదాసునిఁ జేయకున్నఁ గం
దర్పుఁ డనన్ రహించుబిరు।దంబు లభించునె లోకనాయకా?.

చం. చిలుకలుఁ గోకిలల్ చెవులు।చిల్లులు వోవఁగఁ గూయ మాధవుం
డలరు లలంకరింపఁగ ల।తాంతనికుంజగృహాంతరంబునన్
బాలఁతులతోడఁ గూడి సతి । ముద్దులఁ గుల్కఁగ వాసిచిత్తమున్
వలఁకలఁ బెట్టెదన్ జగతి । మన్మథనామము సార్థకంబు గాన్.

చం. అలరులతావిఁ బూని మల।యచ్యుతశీతలవాతపోతముల్
మలయఁగఁ, బుష్పవాటికల । మాధవుఁ డుజ్జ్వలపత్త్రపుష్పకాం
తుల వెదచల్లఁ గ్రొన్నెల మ।నోహరుఁడై నునుపండువెన్నెలన్
దళుకుల నీనుచుండఁ గని । తాళఁ గలండె చలింప కుండునే?.

ఉ. స్థాణువు స్థాణు వంచు సుర।సంఘము గొల్వఁగ గర్వి యయ్యె, దృ
క్కోణము లెఱ్ఱఁ జేసి యతి।కోటికిఁ దా నొకపెద్ద యయ్యె; మ
ద్బాణసుగంధవాతమున । ధ్యానము భంగముఁ జేసి యంబుజ
భ్రూణ! సతీకటాక్షపరి।భూతునిఁ జేసెద భూతనాథునిన్.

చం. నవ నవ లాడుకొమ్మలకొ।నం గలలేఁజిగురాకుఁగొల్మి మా
ధవుఁడు రగుల్పఁ జేయఁ బిక।తండము కోపముఁ జూప మత్సమే
షువులకుఁ జిక్కి తాపమునఁ।సోలి సతిం గని త్రాహి త్రాహిమామ్
భవదధరామృతేన యని । పైఁటచెఱంగును బట్ట కుండునే?.

ఉ. దుర్గమసీమ నైనఁ దన।తోఁ జనుదెంచెదనంది మచ్ఛరా
నర్గళధాటికిన్ దనమ।నంబున నెంతయు సంచలించుచున్
స్వర్గమునందు నందనవ।నంబునఁ బచ్చిక మేయుచుండు నా
స్వర్గవిసంగమంబునకుఁ । బర్విడఁగన్ హరుఁ డేమి సేయునో?.

ఉ. ముక్కు బిగించి భ్రూయుగళ।మున్ ముడి వైచి సమాధి నమ్మరు
ద్భుక్కుటకుండు కన్నుగవ । మోడ్చి యొకించుక విప్పునంతలో
తెక్కల విప్పి పూవుఁబొద।రింటను జక్కవజోడు గూడఁ దా
మక్కువ నుంచుకం తయిన । మానసమందునఁ బొందకుండునే?.

ఉ. బోయలు సాంద్రనీలవన।భూమిని కాంతల మోసపుచ్చుచున్
'రే యని, గూడువేళ, శబ।రీకబరీనిబిరీసనీలిమ
చ్ఛాయల కాలకాలఘన।సంచయ మో యన భ్రాంతిఁ గొల్పఁగన్
గ్రే యని కేకరించుచును । కేకియుగంబు మదీయ కేళికిన్
డాయుచు నుండ నాతనిదృ।ఢవ్రతదీక్ష నశింప కుండునే?.

ఉ. రాణఁ దలిర్చువల్లికల । మ్రాఁకులఁ బూఁబొదరిండ్ల నిత్యక
ల్యాణము పచ్చతోరణము । నై విలసిల్లెడు నొక్కకాననో
న్నేణయుగంబు చేరి రమి।యించుచు నుండ హరుండు గాంచి, పూఁ
బోణికి నై తడంబడునొ? । ముక్కు బిగించి సమాధి నుండునో?.

ఉ. సారసకైరవప్రకర।సంగతభృంగగణారవోత్సరత్
సారసచక్రవాకబక।సంచయభుక్తకుళీరమీనసా
సారసరోవిహారగత।మానసమానసరాజహంససం
సారవిలాసవైఖరుల । స్థాణువు గాంచి చలింప కుండునే?.

ఉ. నిర్జనభూమి నున్న, నవ।నీరుహవేష్టితపుష్పవల్లికో
త్సర్జితపుష్పకేసరర।జఃపటలాన్వితమారుతాహతిన్
జర్జరితాంగుఁ డై సరసి । స్నానముఁ జేయునొ? లేక కామి యై
నిర్జరకామినీమణుల । స్నేహముఁ జేయునొ? నేను చూచెదన్,

గీ. సూనవతి యైనలతకూన । కానలోన
తనదుమే నంట నం టయ్యె । నని తలంచి
తాన మాఱాకుముక్కంటి । చానయంటు
తగులకుండఁ దాఁ బాయునో । మగతనంబు?.

ఉ. వారణపీనకుంభముల।భంగి కుచంబులు డంబు మీఱ దో్ర
వారవిలాసినీగణము । వారిధితీరనికుంజసీమలన్
దాఁచుచునుండఁ గాంచి పరిచు।థప్రకరంబు మదీయ కేళికిన్
గేరుచునుండ నాతఁడు బిగించినకచ్చ సడల్చకుండునే?.

గీ. మేరువున కేగునో హిమ।మేదినీధ్రి
శిఖరి కేగునో డాఁగునో । సృష్టియందు
నాతఁ డెచ్చోట నుండిన । నచట నుందు
నెచటి కేగిన నచ్చటి । కేగుచుందు.

గీ. నాగకేసర కేసర।నాగరంగ
నాగరామ్రికురవకపు।న్నాగపూగ
వర్ణపర్ణాసపాటల।పర్ణధార
సాలబాలరసాలాది।సాలములను,

గీ. మల్లికామాధవీవల్లి।కోల్లసన్ని
కుంజపుంజసమావృత।కూలములను,
పుష్పితము లైనపుష్పస।మూహములను
మాధవునికీర్తిఁ బాడ భం।భరకులంబు;

గీ. సారసీరకాసారక।ల్హారకమల
జాతగంధబంధురశీత।వాతపోత
మెల్లెడల మెల్లమెల్లగ । నుల్ల సుల్ల
సిల్లఁ జల్లగఁ జలువులఁ । జల్లుచుండ,

గీ. చిలుకతేరెక్కి తేనెలం । జిలుకుధనువుఁ
బూని, నారి బిగించి స।మ్మోహన మను
ములికి సంధించి విడిచిన । నులికిపడఁడె?
ఎక్కడకు నేగఁ గలఁడు మ।హేశ్వరుండు.

ఉ. మానకబాణపాతమున । మానసముల్ విచలింప మీఁదు సం
ధ్యాముఖచుంబనక్రియకుఁ । దత్తర మొందుచునుండఁ గాంచి యీ
కాముని కిట్టు లైరె యని । గర్హణవాక్యము లాడెదె నెవ్వఁడా
పాములవానిఁ బుష్పశర।బాధితుఁ జేసెద నంబుజోద్భవా!.

గీ. సూదిమొన మోపుటకు నైనఁ । జోటు లేక
యెల్లెడల సంచరించు యో।గీశ్వరునకుఁ
బిలిచి భిక్ష నిచ్చిన నేమి।చులక నగునో?
తీపినిగదీయునో లేక । తెగులుగొనునో?.

ఉ. ఈతఁడు లోకనాయకుఁడొ? । యీశ్వరుఁడో నిగమాంతవేద్యుఁడో
భూతవిభుండొ? వ్యోమతల।మూర్ధుఁడొ? నిర్జరసేవితుండొ? యీ
ప్రేమను నొక్క సూపుపకు । వెంబరవిత్తునిఁ జేయకుండినన్
జేతుల మోడ్చి వోటనె త్యజించెదఁ జాపముఁ బుష్పరోపమున్.

చం. సురలు మహానుభావుఁ డనుచు న్వినుతింపఁగ, గంతుమీఁటె తా
గరువము తక్కనిక్క నెన । గానిగుడించుచునుండెఁ గాక య
వ్వరసఖిఁ గాంచె నేని వన।భాగమునందుఁ దనంతఁ దానె య
ప్పురుషుఁడు కౌఁగిలించుకొని । ముద్దిడు నెల్లరుఁ జూడకుండఁగన్.

గీ. సతికిఁ దనశీర్ష మిచ్చునో । సగము మే నొ
సంగునో? కౌఁగిలించుచు । సంగమించి
యుతులసంతోషముం బెంది । ప్రాణములను
బాయునో సూర ఘోటక।బ్రహ్మచారి?.

సీ. సరసిజోద్భవ ! నీకు సరసఁ బ్రిగల్భవా
క్యంబులఁ బల్కిన ఘనత లేదు
యమ మనంగ నియమ మనఁగఁ బ్రాణాయాము
మనఁగఁ బ్రిత్యాహార మనఁగ నాస
న మనంగ ధ్యాన మనంగ ధారణ యనఁ
గ సమాధి యనఁగఁ బెం పెసఁగు యోగ
మార్గపద్ధతి నుండు భర్గునిచిత్తంబు
సంభ్రిమింపఁగఁ జేయఁ జాలుజాణ

గీ. యమ్మహాయోగమాయ యా ; నామెయెదుర
మించుఁదీవియువలె సంచరించునేని
కార్య మీడేఱు ననుకూలకాలమునను
సృష్టికర్తవు నీకు నేఁ జెప్పవలెనె ?.

చ. అన విని బ్రిహ్మ వానిఁ గని యట్లయొనర్చెదఁ గాక నీవు నీ
పని యొనరించుచుండుము, ప్రిపంచము సర్వము నీయధీన మ
య్యెనుగద ; యోగి యైనహరుఁ డెచ్చటి కేగిన నేగఁ జాల వీ
వనయము వాని నీడవలె నంతట నుండుము పుష్పసాయకా !.

వ. అని వచియించి యవ్వనజగర్భుం డంతర్హితుం డయ్యె. మారగణ
పరివృతుండై మదనుండు యథేచ్ఛం జనియె.

ఆశ్వాసాంతము

క. రాజశిరోమణిపూజిత
రాజేంద్రి ! సురేంద్రిమకుటరత్నసమూహా
భ్రాజితపదరాజీవా!
రాజీవవిశాలనేత్రి ! రమ్యచరిత్రా !.

మాలిని. సరసిజదళనేత్రా । చారునీలాబ్దగాత్రా
సరసగుణచరిత్రా । సజ్జనస్తోత్రపాత్రా
తరణిసదృశతేజా । ధారుణీకల్పభూజా
ధరణివరబిడౌజా । దానవాంభోజరాజా.

గద్యము. ఇది శ్రీ భాగవతుల నరసింహాశర్మ ప్రణీత శ్రీకాళికాపురాణాంతర్గత శృంగారసంధ్యయందుఁ

ప్రథమాశ్వాసము.



శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శృంగారసంధ్య

(కాళికాపురాణాంతర్గతము.)

## ద్వితీయాశ్వాసము.




బృందారకబృందావన,
బృందావనవాస, నందితేంద్రమునీంద్రా,
స్యందితదరహాసామృత,
స్పందితలవణాబ్ధి, భువనవందితచరణా!.

వ. అవధరింపు మనంతర మమ్మార్కండేయమహామునీంద్రుండు కమఠాదిమునుల కిట్లు చెప్పందొడంగె.

### దక్షునకు విష్ణుమాయ ప్రత్యక్ష మగుట

శా. దక్షుం డట్లు తపంబు సేయునపు డేతద్ధ్యానమార్గంబు ఫా
లాక్షుండుం వినినంత మాఱుపడి యత్యాశ్చర్యముం జెందె నీ
శిక్షాప్రక్రియ యేడ నేర్చె ననుచుం; శీఘ్రంబుగం దేవి ప్ర
త్యక్షం బయ్యె మనోహరాకృతిని హర్యక్షాసనాసీన యై.

సీ. కాలాంబుదచ్ఛాయఁ గాలఁ ద్రొక్కఁగఁ జాలు
డాలు దిక్తటములఁ గ్రాలుచుండ

మదనలీలాస్పద। వదనంబు లక్ష్మికి
సదన మై చెలువంబు । జాలువాఱ
నాఁడు వేఁడినదోయి । నోడించుకనుదోయి
కరుణారసంబునఁ । గ్రందుకొనఁగఁ
జంద్రసూర్యులఁ బోలు। చందోయి 'కందోయి
విందోయి' యని తెల్పు। చంద మడర
గీ. జనుల ధర్మార్థకామమో। క్షంబు లగుచ
తుర్భుజంబుల నభయ మా। విర్భవింప
ముక్తకేశి యై భువనసం। మోహనముగ
దక్షునకు విష్ణుమాయ ప్ర। త్యక్ష మయ్యె.
మ. తనవంశంబున నుద్భవించుటకుఁ బ్ర। త్యక్షంబు గా నిల్చుదే
విని వీక్షించి నమస్కరించి వదనా। విర్భూతసంతోషముం
గనులన్ జూపుచు బాష్పరూపమున; మ। ద్గాత్రంబు జన్మంబుఁ బా
వన మయ్యె న్గృతకృత్య మయ్యెఁ; గులము । న్వర్ధిల్లు నంచెంచుచున్.

దక్షకృతయోగమాయాస్తుతి

క. వినయానతకంధరుఁ డై
కనులన్ వికసింపఁ జేసి । ఘన తేజంబున్
గని దండాపతితుం డై
వినుతింపఁగఁ జొచ్చె భక్తి। వివశుం డగుచున్.
సీ. ఆనందరూపిణీ! । ఆశ్రితస్వర్గవీ!
భార్గవీ! లోకత్రి। వర్గ! దుర్గ!
యోగమాయా! మహా। యోగమాయా! యోగ
నిద్రా! పరంజ్యోతి! । భద్రకాళి!
విశ్వశక్తివి నీవు । విశ్వేశ్వరివి నీవు
కాలరూపంబునఁ । గ్రాలు దీవు

పంచభూతములతో । వర్ధిల్లు నీజగ
జ్జాలంబు నీమోహ।జాలమునను

గీ. లోకములయందు నీశక్తి । లేకయున్న
స్థావరం బగు క్షణములో । జంగమంబు
జంగమం బగు క్షణములో । స్థావరంబు
నీదుశక్తి యొక్కించుక । నెగడు నేని.

చ. వెల వెలఁ బోవు వేకువను । వేగురుఁజుక్క వెలుంగుచుండ నీ
కల కల లాడు నెమ్మొగము।కాంతి యొకించుక చూడవచ్చుఁ, బ
క్షుల కలనాదమాధురికిఁ । జొక్కిన నీదుమహత్వతత్వముల్
దలఁపఁగవచ్చు; నీప్రకృతి।ధర్మముఁ గొల్చెదఁ జిత్స్వరూపిణీ!.

ఉ. పోలుప రానియందమునఁ । బూర్వపుదిక్కునఁ దోఁచునాయుషః
కాలము నీకపోలముల।కాంతియ యంచుఁ దలంచెదన్ దమో
జాలమొ లేక మోహ మను।సాగరమో యన దిక్తటంబులన్
గ్రాలుతమంబు నీకనుల । కజ్జల మౌ నని యెన్నెదన్ జగ
జ్జాలముఁ జూచుచుక్క లను।చక్కనినీకను లంచు నెంచెదన్.

చ. జిల జిల మంచు భూధరము । శీర్షమునుండి తొలంగి వచ్చి తే
నెల కెన యైననీ రొసఁగి । నిత్యము ప్రాణుల జీవనంబుగన్
నిలువున పాఱుచుండు నది । నీకరుణారసనిర్ఝరంబు గాఁ
దలఁచెద నీప్రభావమును । ధ్యానముఁ జేసెదఁ గాలరూపిణీ!.

చ. చలువలఁ జల్లుచుంతుతమ।చాయల కెల్లరఁ జేరి తియ్య నా
ఫలముల నిచ్చి కోకిలలు । పాడఁగ గంధవహుండు వీవఁగా
నలరులసెజ్జ. బాంధులను । హాయిగ నిద్దుర పుచ్చుమ్రాఁకులన్
దలఁచెద నీదుభక్తు లని । తల్లి పరాత్పర విశ్వరూపిణీ!.

చ. కని ప్రియమారఁ బెంచి యతి।కష్టములం బడి పెద్దఁ జేయునా
జనని; యొకానొకప్పు డతి।చంచలబుద్ధిని దప్పు సేయఁగన్

దనయునిఁ బట్టి ప్రేమమిశ్రి।తం బగుకోపముఁ జూపువేళ నీ
ఘన మగుతత్త్వముం దెలియఁ। గా నగు నో ప్రకృతిస్వరూపిణీ!.

సీ. భయదవర్షాకాల।పర్జన్యగర్జిత
గర్జనం బగునీదు।కంఠరవము
కామినీపురుషుల।కలయికలం గల
యనురాగ మగునీదు।నంతరాత్మ
మానినీమణినైజ।మండనంబుగ నుండు
లజ్జయే యగునీదు।లక్షణంబు
సకలచరాచర।జాలంబులం గల
చైతన్య మగునీదు।శక్తిమహిమ

గీ. యెవ్విధంబున నీతత్త్వ। మెఱుఁగ రాము?
జగతికిన్ మూల మగునీదు।శక్తిఁ గలిగి
పురుషుఁ డఖిలకార్యంబుల। నరయుచుండు
నఖిలగుణములు నీయంద। యాశ్రయించు.

సీ. కని పెంచి పెద్దఁ జే।సినతనబిడ్డపైఁ
దల్లి చూపించువా।త్సల్యమునకుఁ
బ్రేమించి రమణుపై। రామయు రాముపై
రమణుండు ప్రకటించు।రాగమునకుఁ
గష్టంబులకు నోర్చి। కాంచె నంచు సుతుండు
జననియెడలఁ జూపు।వినయమునకు
నిరుమేనులం గల।యేకాంతరాత్మ నా
స్నేహితులం గల।స్నేహమునకు

గీ. భేద మెట్టిదో యెఱుఁగువి।వేకి నీదు
సత్త్వముం దత్త్వము నెఱుఁగఁ। జాలియుండు

నన్యుల కెఱుంగఁ దరమె? । యాదిశక్తి!
తల్లి శ్రితకల్పవల్లి కాం । తామతల్లి!.

గీ. ప్రజలు తమకన్నబిడ్డ లన్ । భావమునను
సత్యపరిపాలనక్రియా । సరణిఁ గ్రాలు
రాజమార్తాండులం గల । రాజసమున
నీవు రాణించుచుందు వో । దేవి! జనని!.

గీ. రోషభాషణభీషణా । ఘోషణములఁ
బొదలు యుద్ధరంగంబునఁ । బోరుభటుల
ముఖములం దాండవించు త । మోగుణమున
నీవు రాణించుచుందు వో । దేవి! జనని!.

గీ. ఇతరు లుండుదేశంబున । కేగి యచటఁ
దనదురాజ్యంబు సృష్టింపఁ । దలఁచునృపుఁడు
సదయుఁడై తోఁత్తఁ బ్రకటించు । సాత్త్వికమున
నీవు రాణించుచుందు వో । దేవి! జనని!.

సీ. ఇంటఁ గల్పక ముండ । నెఱుఁగఁ జాలక పర
గృహముల యాచింప । నేగునట్లు
స్వర్గవి తనకుగో । సాలలో నుండఁగ
జల్లకై కడుఁ దల్ల । డిల్లుపగిది
వాకిట స్వర్ణది । ప్రవహించుచుండఁగ
బల్వలాంబువులకై । పఱచుకరణి
కలితవిద్యుద్దీప । కలిక రాజిలుచుండ
ఖద్యోతకాంతికిం । గవియుసరణి

గీ. కంధిగర్భస్థసన్మణి । కాంతిఁ బోలి
యంతరాత్మవై ప్రకృతి వై । యఖిలజగతి

నీవు తేజరిల్లుచు నుండ । నెఱుఁగలేక
ప్రాణి నీచాతినీచుల । నాశ్రయించు.

ఉ. ఈ వన నెట్టిదానవో ? గ్రహింపఁగఁ జాలినవాఁడె జ్ఞాని, నీ
తావు చరాచరప్రకృతి। తత్త్వమ యౌ నది తథ్య మైన నా
దేవరహస్యముం నరులు । దేవతలుం గ్రహియింపఁజాల రో
దేవి ! జగత్స్వరూపిణి ! నుతింపఁగఁ జాలను మూఢచిత్తుఁడన్.

దక్షునకు విష్ణుమాయ వర మొసంగుట

వ. ఇట్లనేకవిధంబుల వినుతించిన నమ్మహాదేవి సంతోషించి దక్షున
కి ట్లనియె.

ఉ. ఓయి ! మహామునీంద్రసుత । యోగివరేణ్యుఁడ వౌదు వీవు ; నా
మాయ నెఱుంగఁ జాలినయ। మానుషబుద్ధివి మత్పదాంబుజ
ధ్యాయివి జ్ఞాని వేకవద। నాబ్జభవుండవు, లోకసన్నుతా
మ్నాయమహాసముద్రగత। నౌక వొసంగెద వాంఛితార్థమున్.

ఉ. కోరినకోర్కులెల నొసఁ। గూర్చెద భక్తులవేల్పుటావు నాఁ
గీరితిఁ గాంచితిం జగతి। కిం గడుఁ గీడు ఘటింప నెంచిరో
క్రూరులు, వారలం జనుమఁ । గోరెదవో? యీజగదాధిపత్యముం
గోరెదవో? యేమి కోరెదవో?। కోరు మొసంగెదఁ గామితార్థమున్.

వ. అప్పలుకుల నాలించి కృతార్థుండ నైతి నని సంతోషాతిశయం
బున, నమందంబుగ నుప్పొంగుడెందంబునం గ్రందుకొను కోరిక
తీరిక లెత్త, బాష్పాంబువులం దొప్పం దోగి పునఃపునఃప్రణా
మంబులం గావించుచు దక్షుం డి ట్లనియె.

చ. ఎఱుఁగవె నీవు నన్నడుగ । నేటికి సర్వరహస్యవృత్తిలో
నెఱిఁగి యెఱుంగనట్లు నటి। యించెద వంబ ! జగత్స్వరూపిణీ !
అఱమర లేక నాకు సుత । వై జనియించి జగద్ధితార్థ మై
యఱపదిమోహ్నులం గల్గుహో। హానటుఁ బెండిలి యాడఁగోరెదన్.

చ. అనవుడు భక్తవర్యు వినయానతకంధరుఁ గాంచి దేవి యి
ట్లనియె: మహానుభావ! సుతనై జనియించి జగన్నుతంబుగన్
త్రినయను వేదవేద్యుని వరించెద నయ్యది నిశ్చయంబ మై
నను విను మీ వనాదరమునన్ ననుఁ జూచిన మేను బాసెదన్.

వ. అని వచించి యవ్విష్ణుమాయ యంతర్హిత యయ్యె. జన్మంబు పావన మయ్యె నని తలంచుచు నమ్మహాదేవివాక్యంబుల సంస్మరించు కొనుచు దక్షుండు నిజాశ్రమంబున కేగి,

దక్షుఁడు వీరణిని వివాహ మగుట

ఉ. వారిజగర్భునాజ్ఞను తపం బొనరించి విరాగి, నన్నిరా
హారుని, ఫాలనేత్రుని గృహస్థునిఁ జేయఁ దలంచు నేను సం
సారినిఁ గాక యుండినఁ బొసంగదు గా యని వీరణాత్మజన్
వీరణి నిర్జరీమణినిఁ బెండిలి యాడె జగత్ప్రసిద్ధిగాన్.

వ. అనంతరమున,

సీ. వలపులఁ వెదచల్లి జలజల మని రాలు
జిలిబిలియలరుల నలరుచోటఁ
గమలషండకషాయగంధగంధవహుండు
మెల్లగఁ జలువులఁ జల్లుచోటఁ
జిలుకపోటులఁ దేనెఁ జిలికెడుఫలముల
భసలముల్ జుమ్మని ముసురుచోటఁ
గలకంఠములు నీలకంఠము లుత్కంఠఁ
బంచమషడ్జముల్ పాడుచోటఁ

గీ. గమలరాగముల్ సాంధ్యరాగములలీలఁ
దైలహీనదీపంబులై క్రాలుచోట
జృంభకుచకుంభపరిరంభగుంభనముల
సాత్త్వికలగతుల రతులఁ దేలి రతుఁడు సతియు.

క. వీరణి, మధురసుధావా
గ్ధోరణి, వాణీకృతరతి । కూజితవీణా
సారణి, నుద్యానవనవి
హారిణి, రంజింపఁ జేసె । నతఁ డతులరతిన్.

దక్షునకు సతి యుద్భవించుట

మ. అతఁడున్ వీరణియున్ మనోహరసరో । హంసద్వయం బోలి లా
లిత కేళీవనవీథులన్ మదన కే । ళీలాలసోల్లాససం
యుతు లై రాజిలుచుండ వీరణికి స । ద్యోజాతగర్భంబునన్
సుత యై మాయ జనించి మోహలతికా । సూనంబు నా రాజిలెన్.

సీ. కుంభవృష్టిగ వాన । కురిసినపిమ్మటఁ
జల్లగఁ బుష్పవ । ర్షంబుఁ గురిసె
నజ్ఞాన మనునది । యణఁగినట్టుల నింగిఁ
ప్రబ్బిన మబ్బులు । యుబ్బణంగె
మునులసుజ్ఞానాస్య । ములఁ బోలి యఖిలది
క్తటములు విమలశాం । తమునఁ గ్రాలెఁ
దమ్మినెత్తమ్ముల । కమ్మతావిం బూని
కమ్మనితెమ్మెరల్ । కడల వీచె

గీ. నఖిలదివ్యాంగనామణు । లాడి పాడ
నంబరస్థలి దివ్యవా । ద్యములు మ్రోఁగె
మ్రోడు లై యున్నమ్రాఁకులు । మొగ్గ తొడిగె
విష్ణుమాయ వీరణికి నా । విర్భవింప.

గీ. విమలజలపూర్ణ నారికే । ళములఁ బోలి
అమితదుగ్ధోల్బణంబునఁ । గొమరు మిగులు
పీనకుచకుంభపానసం । ప్రీణనమున
దినదినంబును శిశువు వ । ర్ధిలుచునుండె.

వ. అట్లు క్రమక్రమాభివృద్ధి వర్ధిలుచుండు నాశిశువునకు,

క. పతిసేవయె సద్గతి యను
సతులకుఁ దలమానికంబు। సరణిం గ్రాలన్
క్షితి నెల్లరకుం దెలియఁగ
సతి యనఁగా నామ మిడిరి । జననీజనకుల్.

సతీయౌవనాభివర్ణనము

క. కలకల లాడెడుకలలన్
వెలిఁగెడి సంపూర్ణచంద్ర।బింబముకరణిన్
మిలమిల లాడెడు నవయువ
కలలన్ రాజిల్లె సతియుఁ । గడు నందముగన్.

కం. బాల్యంబును దొలఁగించుచు
తౌల్యంబు నయనయుగంబు । లాలింపంగన్
గళ్యాణాత్మకముగ సా
కల్యంబుగ జవ్వనంబు । కామద మయ్యెన్.

సీ. శాణఘర్షణమున । సంపూర్ణముగ మయూ
ఖములఁ గ్రాలెడుమాని।కంబుఁ బోలి
లాలిత్యముగ నూత్న।లావణ్యమున నొప్పి
దం బగుముక్తాఫ।లంబుఁ బోలి
మధుమాససమయసం।పర్కంబునన్ బుష్ప
వతి యైననూతన।లతికఁ బోలి
కోదమతుమ్మెదగుంపు । రోద సేయ విలసనం
బున వికసిల్లుకొ।త్తబూవుఁ బోలి

గీ. మవ్వమునఁ జెల్వమునఁ గ్రాలు।మావిచిగురుఁ
బోలి, నడయాడుపుత్తడి।బొమ్మఁ బోలి

పరువముం గలపైఁడితా। మరను బోలి
అందమున కందముగ నుండె। యౌవనంబు.

కం. ఈరీతి సతికి యౌవన
మారూఢము గాఁగ నంత। నంబుజభవుఁడున్
నారదుఁడుం జనుదెంచిరి
వీరణి కనుపారఁ గన్న। బిడ్డం జూడన్.

వ. అట్లేతెంచి,

క. సతిఁ గనుఁగొని దీవించిరి
మతిమంతుని సర్వలోక। మాన్యుని పరమ
వ్రతునిన్ యతివరునిన్ బశు
పతినిం బెండ్లాడు మతుల। వైభవయుక్తిన్.

వ. అట్లు దీవించి దక్షుని సంపూజనంబుల నలరి యథేచ్ఛం జనిరి.
అనంతరమున,

గీ. అతివమోహమైనఁ జూడని। యతివరుండు
అలికలోచనుం డమితభ। యంకరుండు
ఎట్లు పతి యగుఁ ? గార్య మి। కేటి దనుచు
సతియుఁ దలఁచు నశ్రాంతంబు। స్వాంతముననుు.

వ. వీరణియు దక్షుండు నట్ల తలంచిరి. క్రమక్రమముగఁ జింతాకులిత
స్వాంత యై సతి, జననియనుమతని పశుపతియ పతి గావలె నని
మతిం దలంచుచు నిష్ఠాగరిష్ఠ యై పరమతపంబుఁ గావించు
చుండె:—

బ్రహ్మా విష్ణు సమాగమము

మ. ఒకనాఁడంతట బ్రహ్మవిష్ణువులు కా। ర్యోద్యుక్తులై వాణితోఁ
వికచాబ్జేక్షణ లక్ష్మితోడ శివమప్ర। త్యర్థప్రస్థశాలాక్షునం

తిలకముం జేరి నమస్కరింపఁగ మహాదేవుండు వీక్షించి యు
త్సుకుఁడై వారల గౌరవించెఁ గడు సంతోషాంతరంగంబునన్.

గీ. జాయలం గూడి వచ్చిన జలజగర్భు
జలజనాభుని వీక్షించి సంతసించి
బ్రహ్మచారి నై తా నుండు వరుసఁ గాంచి
యించుకంత నెమ్మది విచారించె హరుఁడు.

గీ. పురుషుఁడం గాన వీరి నిప్పురుషవరుల
సత్కరించితి, వీరల సతులఁ గాంచి
గౌరవింప నెట్లగు బ్రహ్మచారి నేను
గృహిణి లేకున్న గౌరవ మెట్లు దక్కు ?.

వ. అని యించుక చింతించి వారలం గని యిట్లనియె.

ఉ. ఊరక రారు మీరలు మహోద్యమ మొండు దలంచివచ్చిన
ట్లారయుచుంటి ; లోకముల నందఱ నేలెడువిష్ణుమూర్తియున్
ధారుణి సృష్టిఁ జేసినవిధాతయు సర్వజగజ్జనాళికిన్
గౌరవనీయు లేపనికి నన్నుఁ గృతార్థునిఁ జేయ వచ్చిరో?.

కం. కరతలభిక్షయు నాపయిఁ
దరుతలవాసంబుఁ గలిగి ధ్యానంబున నా
పరతత్వముఁ జింతించెడి
నరునిన్ ననుఁ జూడఁ గారణం బెట్టిదియో ?.

మ. వనులన్ బ్రేతవనంబులన్ హిమగిరిప్రాంతంబులన్ బ్రహ్మచ
ర్యనిరూఢిన్ బరతత్వతత్పరుఁడనై యాహారహీనుండనై
మునివృత్తిం గలయోగినై మెలఁగు నన్ బుణ్యాత్మునిం జేయ స
జ్జనుఁ గావింపఁగ వచ్చిరో ? యెఱుఁగ నజ్ఞానంబు సైరింపుఁడీ.

## బ్రహ్మోపదేశము

ఉ. నావుడు శౌరిప్రేరణమునన్ విధి యిట్లనె:- దేవ! యోమహా
దేవ! యెఱుంగ వా కొక్క జగతిం గలధర్మము? నావులించినన్

చేరువల లెక్క పెట్టుదువు; సృష్టికిఁ గారణ మైనకార్యముల్
నీవు త్యజించి యుండఁ దగునే జనలోకము సమ్మతించునే?.

గీ. ఏ సృజించిన నద్దాని నేలు శౌరి
దాని నశియింపఁ జేయునంతకుఁడ వీవు
అందుచే మనకార్య మన్యోన్యసరణిఁ
జక్రపరివర్తనముఁ బోలి జరుగుఁ గాదె.

కం. కొందఱు నాచేతను మఱి
కొందఱు మాధవునిచేతఁ గొందఱు నీచేఁ
గొందఱు మనబిడ్డలచేఁ
గొందఱు మాయాకలనను గూలుదు రభవా!.

గీ. రాగముల్ ద్వేషముం బాసి యోగయుక్తి
సదయహృదయుండ వై యున్న జగతి నసుర
లోకముం జంప నెట్లగు, లోక మెట్లు
నిలుచు; సృష్టిహేతుత్వ మెవ్వాలనఁ గలుగు?.

గీ. ఏకరూపంబుఁ గలవార మిట్లు వృత్తి
భిన్న మయ్యె నయ్యది; రూపభేదమునను
కార్యములఁ జేయుచుంటిమి, కార్యసిద్ధి
లేకయుండిన లాభంబు లేదు గాదె?.

గీ. కార్యభేదంబునన్ మాయ కమల యయ్యె
సంధ్య యయ్యె భారతి యయ్యె సాయమీంద్ర!
రమణియే మూల మగు ననురాగమునకు
సృష్టికిన్ మూల మనురాగ మెఱుఁగ వొక్కొ?.

వ. మఱియు ననురాగంబునం గామక్రోధాదు లుద్భవిల్లు. కామక్రోధాదులవలన సృష్టి యభివృద్ధిఁ జెంది క్రమక్రమంబునఁ దమోగుణాచ్ఛాదితం బై నీవలన నంత మొందు. రాగవృక్షఫలంబు సంగ

మం బని యెఱుంగవె? సంగమంబునం గాదె కామం బుద్భవించు? అక్కామంబునం గ్రోధ మావిర్భవించు; నీ వెఱుంగని తత్వంబు గలదె?

సీ. స్వాభావికంబుగ । వైరాగ్యము, నివృత్తి,
దుఃఖంబునం గాదె । దోచుచుండు
సంసారవిముఖం బ సంగమంబునఁ దోఁచు,
దయయు నహింసయు । దాంతి శాంతి
జ్ఞానసహార్గమునకు । సాధనాబుల యైన
దూరంబు లగును సం।సారమునకు
లోకాంతకుండవు । లోకేశ! నీస్వభా
వంబున కియ్యవి । బాధకములు

గీ. చెప్పవలసిన దాతయుఁ । జెప్పినాడ
దేవ! సర్వజ్ఞుఁడవు నీకుఁ । దెలుపవలెనె?
విశ్వహితమున కైనను । బెండ్లి యాడ
వలయు మావలె నీ వుండ।వలయుఁ జూవె.

ఈశ్వరుని వివాహాంగీకారము.

మ. అని పల్కన్ విని మందహాసమున ఫాలాక్షుండు చింతించి యి
ట్లనియెన్; నీవు వచించువాక్యముల నే । నాలించితిం గాని నా
కనుకూలంబుగ నుండఁ గాఁ దగినయ।బ్జాక్షిన్ విలోకింపు మో
వనజాతాసన! పెండ్లి యాడెద భవ।ద్భావానుసారంబుగన్.

గీ. నాదు తేజంబు భరియించు।నాతి గలదె ?
కామినిం బోలవలయు నేఁ । గామి నైన
యోగినిం బోలవలయు నే । యోగి నైన
నట్టిదానిఁ జూపింపు మొం । డైనఁ గలదె?.

వ. జ్యోతిస్స్వరూపంబునం గ్రాలు నే పరబ్రహ్మంబున మనము సం
భూతుల మై కార్యభేదంబునఁ బ్రవర్తించుచుంటిమో యాబ్రహ్మం
బుఁ జింతింపఁ గూడ శక్యంబె? పరతత్త్వవిచారంబునకు బాధకం
బు లేకుండ వర్తింపఁ జాలిన కాంతామణి గలదేనిఁ జూపింపు మనవు
డు బ్రహ్మ యిట్లనియె.

గీ. విష్ణుమాయ వీరణికి నావిర్భవించి
దినదినాభివృద్ధిఁ గడుఁ । దేజరిల్లు
చుండె సతి యనుపేరిట । నో మహాత్మ!
నీకుఁ దగినయిల్లా లామె । నిశ్చయముగ.

వ. అమ్మాధవప్రముఖసహిత మహానది యుక్తంబుగ నుండు నని యామో
దింప హరుం డంగీకరించె. బ్రహ్మవిష్ణువులు యథేచ్ఛం జనిరి. అ
నంతరమున దక్షునిగృహంబున,

ఈశ్వరుఁడు సతీదేవికి సాక్షాత్కరించుట

ఉ. ఆరమణీలలామ పసి । పాడి యహర్నిశముల్ మనంబునన్
గూరినభక్తి నీశునుఁ । గొల్చుచునుండఁగఁ గోడెత్రాచులన్
బేరులఁ గాల్చిహేమమునుగఁ । బ్రేతకళాననుఁడై భయంకరా
కారమునన్ వరంబు లొసఁ । గన్ గనుపట్టెఁ ద్రినేత్రుఁ డానొకన్.

ఉ. ఆవనజాయతాక్షి నిట । లాక్షునిఁ గాంచి నమస్కరించి ల
జ్జావనతాస్యయై యనన । తాంగియునై పలుకాడలేక ని
ర్జీవముఁ బోలియుండఁ గని । చెంతకుఁ జేరి వచించె నమ్మహా
దేవుఁడు కామితార్థమును । జెల్పు మొసంగెదఁ గామినీమణీ!.

ఉ. చెంతకు వచ్చి కోరిక వ । చింపు మొసంగెద నన్నఁ బల్క వా
క్కాంతయు సిగ్గుచే వదన । మించుక యెత్తవు ముద్దరాలవే?
కాంత త్రినేత్రుఁడే మగఁడు । గావలె నంచుఁ దపం బొనర్పఁగన్
స్వాంతయు లేనిసి గ్గిపుడు । చూపఁగ నేటికి నేఁ బరుండనే?.

ఉ. మెచ్చితి నీతపంబున కమేయవరంబుల నిచ్చువాఁడ నీ
యిచ్చకువచ్చునట్లు నను నేలుము కొల్చెద మచ్చెకంటి! యీ
చిచ్చఱకంటి నీపదసేవకుఁ జాలఁడె? నాదుపల్కులన్
బొచ్చెము లేదు చూవె మొగముం బయికెత్తి వచింపు మిత్తఱిన్.

ఈశ్వరుఁడు సతికిఁ దనవలపుం దెలుపుట

ఉ. నిక్క మెఱుంగ వేమొ? నవనీరజపత్త్రవిశాలనేత్ర! నీ
మక్కువ నన్ను లోఁగొనియె మాటలకుం దగ నొక్కొ? యేరికిన్
జిక్కనివాఁడ నీకిపుడు చిక్కితి నీదుకటాక్షదృష్టికిన్
దక్కితి మారుతూపులకుఁ దక్కితిఁ దక్కితి యోగచింతయున్.

ఉ. తక్కువ యయ్యెనా వలపు దగ్గఱకుం జనుదెంచినంతనే ?
టెక్కులఁ జూపుచుంటివో ? కడిందిగ లజ్జను జూపుచుంటివో ?
అక్కట! నీవు నాదుభయదాకృతిఁ గాంచి భయంబుఁ గొంటివో?
చక్కనిదాన నంచు నను జాలనివానిఁగ నాత్మ నెంచితో?.

ఉ. క్రీడకు మేర లేదె? నను వెంగలిఁ జేయఁ దలంచి యిట్లు ప
ల్కాడక మిన్నకుంటి వబలా! సబలాత్మవు మెచ్చితిన్ బలా;
ఓడితి నీకు, మారునకు నోడితి, వీనుల కింపు నింపఁ బెం
డ్లాడెద నన్నుఁ దప్పె మగువా తగువా మగవానిఁ జూచినన్?.

సీ. అలికనేత్రము భీకరాగ్నిహోత్రము గాదు
తిలకనీ! సింధూరతిలక మగును
మారుతాహారంబుఁ గోరుపాములు గావు
రమణిరో! పుష్పహారంబు లగును
ప్రేతవనోద్ధూతభూతి యియ్యది గాదు
నాతిరో! ఘనసారభూతి యగును
లలితపల్లవజటాలతిక లియ్యవి గావు
లలితాంగి! యనురాగలతిక లగును

గీ. మనము నివసించునది ప్రేత। వనము గాదు
వనరుహాక్షిరో! యుద్యాన। వనము గాని
మనము మనముల ననిశంబు। నెనరు గలిగి
యేక మై యున్న నెయ్యవి। కాకయుండు?.

వ. ఇట్లీశ్వరుండు ముమ్మరం బగు ననురాగంబునఁ దల్లడిల్లుచుండ మన్మథుండు,

మ. అపురా! యోగివరుం డితండు తనవే।దాంతోపదేశంబు నేఁ
డెవనిన్ జ్ఞానినిఁ జేయ నెక్కడకుఁ బో।యెన్? బెద్ద యై నాఁడు నా
కవమానంబు ఘటించెఁ గాదె; రతి హా।యం బంచు దూషించెఁ గా
దె; విధం గాంచి హసించెఁ గాదె; యిపు డా।ధిక్కార మేమయ్యెనో?.

మ. అని చింతించి యహంకరించి ధనువున్। హస్తంబునం దాల్చి మో
హనమన్ ముష్టికి హర్షణం బనునమో।ఘాస్త్రంబు జోడించి, మో
హనహర్షాబ్ధితరంగరంగముల ఫా।లాక్షుండు మగ్నుండు గాన్
ఘనదోస్సారమునన్ ద్యజించె సతియు।న్గామించి ప్రేమింపఁగన్.

వ. మన్మథుం డట్లు పుష్పబాణంబులఁ ద్యజించుట నెఱింగి యమ్మహానుభావుండు మందహాసంబుఁ గావించి వెండియు నిట్లనియె.

ఉ. ఎక్కడ మన్మథుండు శివుఁ। డెక్కడ యాతఁడు పూలచేత నన్
డక్కఁగొనంగ నోపునె? దృ।ఢవ్రతదీక్షఁ గలట్టివాఁడ న
క్కెక్కడ దేవలోక మది। యెక్కడ నీ వొనరించునిష్ఠయున్
జిక్కితిఁ గాక యన్యులకుఁ। జిక్కెడువాఁడనె నీరజేక్షణా?.

ఉ. చెప్పఁగ నేల నీవు? ననుఁ। జెంతకు లాఁగిన నీదునిష్ఠ యే
చెప్పరె చెప్పుచుండె వలఁ।చెన్ సతి యంచు, మదీయచిత్తమున్
దెప్పర మైనమోహజల।ధిన్ మునిఁగెన్ రమణీలలామ! యో
యొప్పులకుప్ప! న న్వలచి। యొప్పరికింపకు మొల్లిదంబుగన్.

క. గెంటనివలపున నోవా
ల్గంటీ! నినుఁ జూడ యోగ। కాంక్షయుఁ దొలఁగెన్
గెంటసమున ననుఁ వ్రాసిన
రెంటికిఁ జెడి యుండినట్టి। రేవడ నౌదున్.

క. ఇంగితమును బూర్తిగ నీ
శృంగారాపాంగదృష్టి। యెఱిఁగించెడుఁ ద
న్వంగీ! నీమౌనం బ
ర్ధాంగీకారంబుఁ దెలుపు। నతిచిత్రముగన్.

వ. ఇట్లనేకవిధంబుల శంభుండు సంభాషింప నాయంభోజాక్షి,

గీ. క్రొన్నెలం బోలుమోమున। వెన్నెలవలెఁ
జిన్నినగవు లెన్నఁగ రాని। వన్నెలీన
వాలు జూపులఁ జూచుచు। వాలుఁగంటి
పలుకు పలుకునఁ దేనియ। లొలుకఁ బలికె.

ఉ. కన్నియ నేమనం దగు? జగంబుల మీఱినజాణ వీవు, నీ
మున్ను వచింప నోపుదునె?। పూనిక జవ్వన మెల్ల నీకు నై
యిన్నియగట్టు లెందులకొ। సర్వ మెఱింగిన నీ వెఱుంగవే?
నిన్నుఁ బరిగ్రహింపఁ గల। నే యతివర్యుఁడ వో మహేశ్వరా?.

ఉ. సారవిచారధీరుఁడవు। చానలలోఁ గలచిత్తవృత్తి నీ
వారయ లేవె? యేపనుల। కైన శుభంబులఁ గూర్పఁ బెద్దలు
న్నారు మహాత్మ! వా రెఱిఁగినం గద యంగద లేని మేలు చే
కూరును, సానుకూలముగఁ। గోరిక లీరిక లెత్తు, నిత్తఱిన్.

వ. అప్పలుకుల నాలించి భక్తసులభుం డగుశంభుం డట్ల యగు నని దీవించి యథేచ్ఛం జనియె. మన్మథుండు స్వప్రతాపంబుఁ దలంచుకొని కరం బుప్పొంగుచుండె.

ఉ. నాఁ డటు లాడి గర్వితమనంబున మీఱి యహర్నిశంబు వె
న్నాడుచు నుండెఁ గాని స్వబలాతిశయంబును జూపకుండెఁ బూఁ
బోఁడిసొబంగుహంగులకు మోహితుఁ డౌటఁ బురారి నేఁచె నేఁ
డాఁడుది లేకయుండిన సుమాస్త్రుఁడు సచ్చినయట్టు లుండఁడే ?

వ. వినుం డనంతరమున:—

శా. ఈశానుండు నిజాశ్రమంబునకుఁ బోయెన్ ; విప్రయోగంబుచే
నాశాపాశనిబద్ధుఁ డై యతులమోహాంభోధిలోఁ జొచ్చి లో
లో శుష్కించెఁ ; బరంబు యోగమున నాలోకించునే గాని యా
కాశంబట్టుల శూన్యమైనసరణిం గాన్పించె నానాఁటికిన్.

వ. అట్లయ్యోగివరుండు రాగియై యోగమార్గంబుఁ దొలంగి, విప్రయోగంబున వేఁగి, తాపంబునఁ గ్రాఁగి, భోగపరాయణుండై, నిజకార్యోద్యోగసాఫల్యంబునకు సంచలించుచుఁ, బుష్పబాణుపుష్పబాణప్రయోగంబులకుం దాళం జాలక, యన్నీలాలక జాలక సంతతంబు స్మరించుచు, నొండుదినంబునఁ బుండరీకాసను నేకాగ్రచిత్తంబునం దలంచె. అంత ననంతమార్గంబున,

### బ్రహ్మాగమము

సీ. పూతవేదనినాదభూతవాతాహతి
నజ్ఞానమేఘంబు లంతరింప
నాలుగుమోములన్ గ్రాలెడు దరహాస
కౌముది కడలను గడలుకొనఁగఁ
బూర్ణిమాచంద్రికం బోలినవామాక్షి
వామభాగంబున గోము మీఱ
నామ్నాయజలనిధి నవతరించెడు నావ
యనఁగ రాయంచ వాహనము గాఁగ

గీ. మోదవార్ధితరంగ మై । పొంగు నంత
రంగమునఁ బెక్కుతలఁపు లూ।రంగ, నిజమ
నోవ్యథ తొలంగ వాణీమ।నోహరుండు
శీఘ్రగమనంబునన్ వచ్చి । శివునిఁ గాంచె.

కం. వచ్చినధాతం గాంచి వి
యచ్చరవందితుఁ డగుశివుఁ । డతులామోదం
బచ్చుపడఁగ నర్ఘ్యాసన
మిచ్చి గతించినయుదంత । మిట్లు వచించెన్.

బ్రహ్మ కీశ్వరుఁడు నిజవిరహపరితాపముఁ దెలుపుట

ఉ. నీవు వచించినట్లు సతి । నిష్ఠకు నెంతయు సంతసించి నే
దీవన లిచ్చి వచ్చితి, మ।దిం గలకోరిక తెల్ల మయ్యె, మ
ద్భావ మెఱింగె నామె తలి।దండ్రు లయింగితమున్ గ్రహింప నా
తావున కేగి కార్యము య।థావిధిగా నొనరింపఁగావలెన్.

ఉ. పూనికఁ గాంచి భక్తసుల।భుండను గానఁ బవిత్రచిత్తమున్
మానిని కిచ్చివచ్చితి, నమానుష మైనమదీయబుద్ధి య
జ్ఞానతమోవిమోహభవ।సాగరవీచికలందుఁ జిక్కి నా
పైని వ్రతంబుఁ దక్కి వల।వంతయు నెంతయు హెచ్చెఁ గాంతకై.

గీ. విప్రయోగంబునం జిక్కి । సుప్రసిద్ధ
యోగమార్గంబుఁ దొఱఁగి ద।ర్యోగమునను
కడకు నీరీతి నాతికై । జడుఁడ నైతి
వ్రతము చెడుఁ గాక సుఖ మైనఁ । బడయవలదె.

శా. మాయావాగురఁ జిక్కినాఁడఁ దుదకున్ । మానంబు జ్ఞానంబు వ
మ్మాయెన్, నీవును విష్ణుమూర్తి సను న।న్యాయ్యంబుగా మోహన
చ్ఛాయాచ్ఛాదితుఁ జేసి రట్టు లకటా ! । సంసారముం గూర్పు, లే
దా యోగంబును దక్కనిమ్ము చెఱఁకన్ । ధర్మంబె రెండిఁటికిన్ ?.

చం. పరమతపోగరిష్ఠుఁ డనఁ । బ్రస్తుతిఁ గాంచితి సర్వసంయమీ
శ్వరులకు మేటి నైతి హిమ।వంతముపొంత వనాంతరంబులన్
బరమపథం బెఱుంగఁగ జ।పంబుఁ దపంబు నొనర్చుచుంటి, సం
సరణముఁ గోరి నీకతన । సర్వము బాసితిఁ దప్పుఁ జేసితిన్.

ఆ. జపము బోయెఁ దపము । సర్వనాశన మాయె
పరమ మెఱుఁగుచింత । చరమ మొందె
సారహీన మైన।సంసారముం గోరి
యోగిఁ గాక విప్ర।యోగి నైతి.

ఉ. ధాతవు నీవు, శీఘ్రముగ । దక్షునియింగితమున్ గ్రహించి యే
రీతిని నైనఁ గార్య మొన।రింపుము, లోకహితంబుఁ గోరి నాఁ
డాతరుణిన్ వరింపు మని । యంటివి; నాదుహితంబుఁ గోరి నా
కీతగులంబుఁ గూర్చు మిది।యే పరమం బని యాత్మ నెంచెదన్.

చం. అన విని చిక్కి నేఁడు నిట।లాక్షుఁడు దక్షునిచిన్నదానికిన్
ఘన మగువిప్రయోగమునఁ । గామునిబారికిఁ జిక్కి యోగచిం
తనయుఁ దొఱంగె నుల్లమునఁ । దల్లడ మొందుచునుండె సంగమం
బున కని సంతసించుచుఁ బ్ర।ఫుల్లముఖుం డయి బ్రహ్మ యిట్లనెన్.

బ్రహ్మ యీశ్వరు ననునయించుట

చం. సతియును నీవియోగమునఁ । జాల తపించుచునుండె నాప్రజా
పతియును భార్యయుం దగిన।భర్త లభించునె యంచు నన్ను సం
తతము స్మరించుచుందు రిది । తథ్య మెఱుంగుము వారియింటి కే
గి, తెలియఁజేయఁగా నిచటి।కిం జనుదెంచితి ఫాలలోచనా!.

ఉ. ఈపని నేను చేయుటకు । నేమియు లే దిఁకఁ జెప్ప నేమి మా
యాపరికల్పితాంగి యగు । నాసతి నీకొఱకై జనించెఁ గా
దే? పరితాప మేల? భవ।దీప్సిత మెట్టులొ యట్ల యౌను, నే
నోప్పుడుఁ బెండ్లిఁ జేయుఁగ ము।హూర్తము నిశ్చయ మైన వెంట నే.

చం. అఖిల మెఱుంగు దీ వెఱుఁగ | నట్లు నటించెదు, పూర్ణసత్కలా
ముఖి యగునాలతాంగి నినుఁ | బొందఁగఁ గాదె జనించె; దక్షుఁడు
న్ముఖుఁడయి విష్ణుమాయ కయి | మున్ను తపం బొనరింప లేదె?
నీసుఖమును గోరి కార్యమును | జొప్పడఁ జేసితిఁ జెప్ప నేటికిన్.

గీ. దక్షుఁ డిప్పుడు కన్యాప్ర | దాత యగును
గృహివి నీ వౌదు వాసతి | గృహిణి యగును
లోకముల కెల్ల హిత మౌను; | శోకరహిత
మైనయికార్యమున సౌఖ్య | మతిశయిల్లు.

వ. అప్పలుకుల నాలకించి ఈశ్వరుం డిట్లనియె.

సీ. అజ్ఞానజనితమో | హాంధకారంబుచే
బుద్ధిసంచలనంబుఁ | బొంద లేదు
అందచందంబుల | నతిశయిల్లెడు నామె
హావభావంబుల | కలర లేదు
సాంద్రమదంబున | నింద్రియాళికిఁ జిక్కి
గృహమేధివృత్తిఁ గాం | క్షింప లేదు
అంతట వ్యాపించి | ప్రాణుల బాధించు
చిత్తజ ఘాటికిం | జిక్క లేదు

గీ. భక్తసులభుండఁ గావున | భక్తి కలరి
సతిని బెండ్లాడ నెంచితి | శౌరి నీవుఁ
జెప్పుటం బట్టి సమ్మతిం | చితిని, తగిన
తతికి నిశ్చయింపుము ముహూ | ర్తంబు నసఘ!.

-- శివోద్వాహము --

వ. ఇట్లు,

మ. చలితస్వాంతుఁడు ఫాలలోచనుఁడు సం | సారంబుఁ గాంక్షింప నా
ఖిలజాతోద్భవుఁ డట్ల యౌ ననుచు సు | స్వాంతంబునం దత్తఱి

దలఁచెఁ మానసపుత్త్రులన్ మునుల నా। నందాతిరేకంబునన్
గొలువ న్వచ్చిరి వార లాశశికలా। కోటీరు నబ్జాసనున్.

వ. అనంతరమున,

మ. జనులో హో యని సంతసింప గణముల్। శంఖాళిఁ బూరింప, స
న్మును లెల్లన్ నిగమంబులం జదువ సం। మోదంబునన్ దేవతుల్
ఘనవాద్యంబుల మంగళారవములన్। గావింప శీఘ్రంబునన్
జని వీక్షించిరి మున్ను యోగిజనశ్రే। ష్ఠోదితునిన్ దక్షునిన్.

వ. శివోద్వాహోత్సాహంబున నెల్లరు నేతెంచి రని యెఱింగి,

చం. ఎదురుగ వచ్చి దక్షుఁడు మహేశ్వరు నెంతయు గౌరవించి య
భ్యుదయముఁ గోరి, బ్రహ్మపద। యుగ్మమునం బడి మ్రొక్కి మానులన్
గదిసి బహూకరించి రతి। కాంతుని క్షేమ మెఱింగి యక్షులన్
త్రిదశుల సిద్ధసాధ్యుల మహర్షుల నెల్లర నాదరించుచున్.

ఉ. పావనమయ్యె నాగృహము। బ్రహ్మమహేశ్వరులు న్మునీంద్రులున్
దేవతలున్ మహాత్ము లగు। దివ్యచరిత్రులు వచ్చి రింటికిన్
దీవన లిచ్చి శూలికి సతీమణి నీయ వివాహకార్యమున్
ధీవరులార! వేగమె విధించి ముహూర్తము నిశ్చయింపుఁడీ.

వ. అనిన బ్రహ్మ యిట్లనియె.

చం. వలపు ఘటించినప్పుడె వి। వాహముహూర్తము నిశ్చయించెఁ బూ
విలుతుఁడు, శూలి పెద్దలకుఁ। బెద్ద జగంబుల కెల్లఁ దాత యో
గులకును సన్మునీంద్రులకుఁ। గొంగుపసిండి యెఱుంగవే మదిం
దలఁచినయప్పుడే యగును। తాతకు పెండ్లిముహూర్త మేటికిన్.

వ. నిమిత్తమాత్రంబుగ నీ వుండుము. సర్వము నేన యొనర్చెద నని
చెప్పి యతండు వివాహకార్యారంభంబునకుం బూనుకొనియె.

సీ. వాల్లార్థ్యఁగానగోష్ఠి। వల్లకిన్ మోగించి
భారతి పెండిలి। పాట పాడఁ

ధైతకధిమ్ధిమీ । తకతథై యని దేవ
తాస్త్రీలు భరతశా।స్త్రము నటింపఁ
బటహడిండిమశంఖ।వంశకాహళతూర్య
భేరీనినాదముల్ । పిక్కటిల్ల
మానసపుత్త్రు ల।నూనంబుగా సామ
గానంబునం దమ।గరిమఁ జూప

గీ. ధాత యుద్వాహకార్యతం।త్రంబు నడుప
నలికనేత్రాగ్ని ప్రత్యక్ష।సాక్షి గాఁగ
వైభవప్రాభవంబున । భర్గుఁ డప్పు
డేమ దైవార సతినిఁ బ।రిగ్రహించె.

వ. అంత గరుడవాహనుం డగులక్ష్మీపతి పత్నీసహితుండై యచ్చ
టికేతెంచి సతీపతిం గని యిట్లనియె.

గీ. స్నిగ్ధనీలాంజనశ్యాము।ముగ్ధఁ గూడి
మాసతికి నాకుఁ బ్రీతిలో।మముగ నీవు
తనరుచుంటివి; సంసార।ధర్మసరణి
సౌఖ్యములఁ బొంది దస్యులం । జంపఁ గలవు.

వ. అని యిట్లు శౌరి పలుకుచుండుసమయంబున,

సతీసందర్శనంబున బ్రహ్మ నిస్తేజుం డగుట శివుండు
పరికోపించుట.

గీ. చారు మందహాసమున శృం।గారదీప
కలికఁ బోలినయాసతిం । గాంచి బ్రహ్మ
యుందిరియవికారమున మేన । నెఱుకఁ దప్పి
దృష్టి మఱలింపలేక ని।స్తేజుఁ డయ్యె.

వ. ఆతనిమనోంగితం బెఱింగి యత్యుగ్రుండై,

ఉ. కూళవు దుర్మదాంధుఁడవు । క్రూరుఁడ వంచుఁ దృణీకృతారిబా
ణాలము, భక్తలోకసుర।పాలము, దానవజీవమారుత

వ్యాళము, గాలమృత్యుఫణి। వాలము, నిత్యజయాలవాలముఀ
శూలము నెత్తె నత్తతిని। శూలి, జగంబులు తల్లడిల్లఁగన్.

శా. ఓహో! యెంతటిదారుణం బవుర! యా। యుగ్రాత్ముఁ డత్యుగ్రుఁడై
మోహాంధ్యాంబునఁ గన్నుఁ గానవిధిఀ। బోకార్ప జృంభించె, ను
ద్వాహోత్సాహము నేఁడు భీకరరణో। త్సాహంబుగా మాఱె నం
చాహాకారముఁ జేసి రెల్లరును స। త్ప్రాంభోధు లల్లాడఁగన్.

ఉ. అంతట లేచి దక్షుఁడు కు। మార్త్యుఁడ వంచుఁ గరంబుఁ బట్టి నీ
కింతటితామసంబు తగు। నే? విధిఁ జంపిన సృష్టి యుండునే?
శాంతముఁ బూని కార్యము న। సంగఁగఁ జేయు మనుగ్రహించి, లో
కాంతకశూల మెత్తిన ల। యం బగుఁ గోపము సంహరింపుమా.

వ. అన విని యీశ్వరుం డిట్లనియె.

ఉ. ఏను వరించినట్టిసతి। నీతఁడు చూడఁగ హేతు వేమి? య
జ్ఞానవశంబునఀ మదవి। కారమునఀ మతిఁ దప్పి ధర్మముం
గానఁడు మూఢచిత్తుఁడు, ప। రకామి, జడుండు, గతేంద్రియుండు, నే
నీని వధించి ధర్మపద। విఀ బృథివిం దగఁ బాదుకొల్పెదన్.

-:- విష్ణుప్రబోధము -:-

మ. అని పల్కఀ హరి మందహాసమున ఫా। లాక్షుఀ విలోకించి యి
ట్లనియెఀ, గోపము సంహరింపఁ దగు లో। కాభీలశూలంబునఀ .
దునుమం బోలునె? లోకసృష్టి కయి ప్రా। దుర్భూతుఁ డయ్యెన్విరిం
చనుఁ, డాతండు నశించినఀ జగతి నా। శం బొందదే నక్షమ్మౌడిన్

ఉ. ఏను సృజించెదఀ జగతి। నీతఁడు చచ్చిన నష్ట మేమి? లే
దా నయశాలి యైనచతు। రాననునొక్కని నే సృజింతు, నా
యానతి నాతఁ డీజగతి। నంతయు సృష్టి యొనర్చు నంచు లో
లోనఁ దలంచె దేమొ? మన। లో మన కెన్నఁగ భిన్న మున్న దే?

ఉ. ఎవ్వఁడ వీవు? నే నెవఁడ? । సృష్టి యొనర్చెడునీవిరించనుం
డెవ్వఁడు? నీదు భార్య సతి । యెవ్వతె? నాదుమనోహరాంగి శ్రీ
యెవ్వతె? బ్రాహ్మ్యమైనసతి । యెవ్వతె? యించుక లోఁ దలంపు మే
నెవ్వఁడఁ జెప్ప నీ వెఱుఁగ । వే పరతత్త్వము ఫాలలోచనా!.

ఉ. ఎయ్యది జ్యోతిరూపమున । నీప్రకృతిన్ స్వపరప్రకాశ మౌ,
నెయ్యది నిత్య మయ్యె గుణ । హీనమునన్ సగుణాత్మకంబుగా
నెయ్యది కారణాంతమున । దృష్టికి గోచర మౌఁ బరాత్పరం
బెయ్యది యయ్యె? నయ్యదియ । యీవును నేనును సృష్టికర్తయున్.

వ. అస్పష్టంబుగ నుండియు స్పష్టంబుగ దృష్టికి గోచరించుచున్న యీ సృష్టి యొకప్పుడు సర్వము తమోమయ మై భువనవర్జిత మై ప్రసుప్త మై, దివారాత్రివిభేదహీనం బై, జ్యోతిహీనం బై, జలహీనం బై, వాయుహీనం బై యుండె. అతీంద్రియం బై, నిత్యం బై, సూక్ష్మం బై, యవ్యక్తం బై పరబ్రహ్మంబ యుండె. ఆబ్రహ్మంబ పురుషుం డని యెఱుంగునది. తమోమయం బైన యీప్రకృతి పురుషు ననుసరించి యుండుం జూవె. జగత్కారణం బేకం బగుపరబ్రహ్మంబ. ఈబ్రహ్మంబ యప్పుడు నిప్పుడు నెప్పుడు భాస్వదూపంబున స్వప్రకాశంబున నిరవకాశంబుగఁ బ్రకాశించు. అట్టి యీపురుషుండు సృష్ట్యర్థ మీప్రకృతిని క్షోభింపఁ జేయ ననిర్వాచ్యం బైనమహత్తత్త్వ మొం డుద్భవిల్లె. ఆమహత్తత్త్వంబున నహంకారంబు జనించె. అహంకారంబున శబ్దగుణంబు దోఁచె. అనంతర మవిష్ణుపు మూర్తివర్జితంబు ననంతంబు నగునాకాశంబును సృజించె. రసతన్మాత్రంబున జలంబు సృజించె. నిరాధారం బైనసకలంబును మాయచే భరించె. త్రిగుణసామ్యంబున సంస్థితం బైనయీప్రకృతిని వెండియు సృష్ట్యర్థము సంక్షోభింపఁ జేయ నాప్రకృతి త్రిగుణాత్మకంబును నిరాకులంబును నగుబీజంబును

జలంబున విసర్జించె. ఆబీజంబు, క్రమక్రమంబుగ హైమాండరూపంబున వర్ధిల్లె. ఈయండంబు సమస్తజలంబును దనలోఁ నిమిడ్చికొనియె. తదండగర్భంబున నప్పురుషుండు విష్ణువై పంచభూతంబుల సృజించె. ఈపంచభూతంబు లీయండంబు నాచ్ఛాదించి పార్శ్వగతంబు లై యుండె. క్రమక్రమాభివృద్ధి నాయండంబు భిన్నంబగుడు మేరువు జనించె. అండమధ్యస్థజలసముదాయంబున సప్తసముద్రంబు లుత్పన్నంబు లయ్యె. పర్వతంబు లున్ముఖంబు లయ్యె. అండమధ్యంబునం గల గంధతన్మాత్రంబున భూభాగము దృగ్గోచరంబయ్యె. రూపతన్మాత్రంబునఁ దేజఃపుంజ మావిర్భవించె. స్పర్శతన్మాత్రంబున వాయు వుద్భవించి వ్యాపించి ప్రాణభూతం బయ్యె. ఈయండంబున కూర్ధ్వభాగంబునఁ జతుర్వక్త్రుండును, చతుర్భుజుండును, పద్మకేసరగౌరాంగుండును నగుబ్రహ్మ సంజాతుం డయ్యె. మధ్యభాగంబున నీలాంగుండును, నేకవక్త్రుండును, చతుర్భుజుండును, శంఖచక్రగదాద్యాయుధపాణియు నగువిష్ణువు విరాజిల్లె. అధోభాగంబునఁ బంచవక్త్రుండును, స్ఫటికసన్నిభకాయుండును నగు చంద్రశేఖరుండు ప్రభవించె. సత్వరజస్తమోగుణంబు లీమువ్వురనాశ్రయించె. అప్పరబ్రహ్మంబు మన యీమూర్తిత్రయంబున విభాగింపం బడియెఁ జూవె. అక్కతంబున మనకు ద్వైతభావంబు శూన్యం బని యెఱుంగునది.

మ. అని యిబ్బంగి నుపన్యసింప విని ఫాలాక్షుండు శ్రీవిష్ణువుం
గని బ్రహ్మంబు విభేద మైనయపు డేకం బెట్టులోఁ జెప్పుమా
యనఘా! కాలము మాయయుం బ్రకృతి యెట్లావిర్భవించె న్వనం
గనఁ గాంక్షించెద నాన తిమ్మనిన నాకం జేకుఱుం డిట్లనున్.

గీ. అస్మదీయమాయామోహితాత్ముఁడ వయి
కోపయుక్తుండ వై మనస్తాపమునను

విస్మృతిం జెందితివి నీవు । విశ్వనాథ
ధ్యానయోగంబునఁ సర్వ । మరసె దీవు.

చ. అన విని యాత్మలోనఁ బర । మాత్మను ధ్యానమునం దలంచుచున్
గనులను మోడ్చినంత శితి । కంఠుఁడు; వెంటనె జ్యోతిఁ బోలి యా
తనిహృదయంబుఁ జొచ్చి పర । తత్త్వము, సర్గము, మాయఁ గాలము
న్గనుఁగొనఁ జేసె శౌరి క్షణ । కాలములోన జగద్ధితార్థి యై.

వ. అట్లు నిమీలితాక్షుం డగుఫాలాక్షునకుఁ బద్మాక్షుండు సమస్తం బెఱింగించె. ఆశంభుండుఁ దొలుత, నిత్యానందంబును, నిరాతంకంబును, నేకంబును, నిర్గుణంబును, జగత్కారణకారణంబును నగు పరబ్రహ్మంబు నెఱింగె. మఱియు నాబ్రహ్మంబు సృష్ట్యర్థము ప్రకృతి యై భిన్నం బగుటయుఁ గాలరూపంబున ననిర్వాచ్యంబుగఁ బ్రకాశించుటయు, సంసారార్థము ప్రాణులశరీరంబున మోహరూపంబున మాయ యై మెలంగుటయు, నామాయయే స్త్రీరూపంబున లక్ష్మి సతీ రతీ సంధ్యాచండిక లై యుండుటయు, గ్రహించె. మఱియు నప్పరబ్రహ్మంబు మూర్తిత్రయంబున భిన్నం బయ్యు నేకం బగుటయుఁ గాంచె. అనంతరము పరబ్రహ్మం బనుజ్యోతిస్స్వరూపంబునకు ఛాయఁ బోలినమాయచే నాచ్ఛాదితం బైనబ్రహ్మాండసంస్థానం బాతనిహృదయంబునఁ గనుపట్టె. ఆసంస్థానంబునఁ జరాచరజాలంబును సర్వంబు విలోకించె. ఆబ్రహ్మాండ మంతం బొందుటయు, సర్వము నశించుటయు, మూర్తిత్రయంబుమాత్రంబ యుండుటయు, ననంతరంబున, బ్రహ్మయుఁ బినాకియు విష్ణుశరీరంబున లీనం బగుటయుఁ, దుదకు నేకంబుగ నవ్యక్తంబుగ విష్ణుతేజంబు గోచరించుటయు, నెఱింగి యాతం డంతరంగంబునఁ బరమానందంబుఁ బొందె. శ్రీవిష్ణు వాతనిశరీరంబునుండి మగుడ బయలు వెడలినఁ దత్క్షణంబ మాయ యీశ్వరునిశరీరంబునఁ బ్రవే

శించె. మహానుభావుం డగునాభవుం డంత విస్మితుం డై వికసితనేత్రుం డై, మనోహరంబుగఁ బ్రబుద్ధకమలాకరంబుఁ బోలుసౌందర్యంబునం గ్రాలుసతిం గని విమోహితుం డై, దక్షాదుల వీక్షించి యి ట్లనియె.

ఉ. శాంత మనంత మచ్యుతము । సత్యము నిత్యము బ్రహ్మ మొండు మ
త్యంతమునందుఁ దోఁచె నిజ । తత్త్వ మెఱింగితి, ద్వైతభావ మె
క్కింతయుఁ గాన మీప్రకృతి । దృశ్యము నశ్యము; కాలరూప మే
కాంతము, బ్రహ్మలీనము, చ । రాచరసృష్టికిఁ గారణంబు; వి
భ్రాంతియె మాయ యై పురుషు । భావముఁ బట్టి మెలంగు నెప్పుడున్

వ. ఆవాక్యంబు లాలించి శ్రీమన్నారాయణుండు శంభున కి ట్లనియె.

గీ. జ్ఞానమయ మైనతత్త్వంబు । సర్వ మరసి
తీవు; మనముమువ్వురకు భేద । మెన్నఁ దగునె?
బ్రహ్మ హంతవ్యుఁడే? ద్వైత । భావహతులు
ప్రాకృతులు; వారిభావ మ । భాజనంబు.

వ. ఇట్లు శ్రీకాంతునిపలుకుల నాలించి యనంతర మాసతీకాంతుండు శాంతుం డై భారతీకాంతుని మన్నించి, కృపారతి నెల్లర ననునయవాక్యంబుల సంతోషితులం గావించి, దక్షప్రభృతుల వీడ్కొని,

### వసంతఋతువర్ణనము.

గీ. సతిని నామోదశాలిని । శారదాభ్ర
తుల్యవృషమున నెక్కించి । తుంగశృంగ
సంగతహిమవత్ప్రస్థ । స్థానములకు
వెడలినంత వసంతునిం । బిలిచి మరుఁడు.

వ. ఇ ట్లనియె.

చం. తెలియ వచించెదన్ వినుము। ధీరవరుం డగుఫాలనేత్రుఁ డా
చిలుకలకొల్కి-యున్ గలసి। శీఘ్రగతిన్ వృషవాహనంబునన్
జలిమల కేగుచుండిరి; వి। శాలవనాంతరముల్ లతాగృహం
బులు వికసింపఁ జేయవలెఁ। బొమ్ముఁ పికమ్ములు సంతసింపఁగన్.

చం. అన విని యవ్వసంతుఁ డపు। డట్ల యొనర్చెద నంచు నీశ్వరున్
మునుకొని కొండఁ జేరెఁ బిక। ముల్ శుకముల్ కడు నింపు నింపఁబ
ల్కి-నపలుకుల్ జగంబులను। క్లీబును నాశముఁ జేయుచుండె; నే
మనఁ దగుఁ జిత్తసంభవుని, మానవతి మీఱు వశంబె యేరికిన్?.

ఉ. శాంతము కంతుమార్గణని। శాంతము, సారససారభావృతా
శాంతసముద్గతానిలని। శాంతము, సాంద్రనికుంజకాంత మ
త్యాంతవనాంతరోత్థితల। తాంతదళాంతరుదన్మదాళిసం
క్రాంతము, చూతపల్లవవి। కస్వరసుస్వరపైకతోషిత
స్వాంతము, సర్వవృక్షఫల। వాతము, కాముకమందహాసభా
స్వంతము, దోఁచె నొంతయు వ। సంత మనంతవియోగకుంత మై.

కం. ఆమనిశోభావైభవ
మే మని వచియింపవచ్చు। నెల్లెడఁ దానై
కామునిరాజ్యప్రతినిధి
యై మోదముఁ గూర్చుచుండె। యతి మోహనుఁడై.

గీ. వృక్షములు నికుంజములు పు। ష్పితము లయ్యె
ఫుల్లపద్మంబులన్ జలం। బులు రహించె
భ్రమరసంకులం బెల్లెడఁ। బాదుకొనియె
గంధములఁ జల్లె మెల్లగ। గంధవహుఁడు.

గీ. మునులచిత్తంబులం దైన। మోహ మనెడు
బీజ మంకురించుచునుండఁ। బృథ్వి నితర

జనులబుద్ధు లెట్లుండునో । మన మెఱుంగ
శక్య మగునె యోగమునివతం।సంబులార!.

గీ. సాంధ్యరాగార్ద్రచంద్రుని। సామ్య మొంది
కింశుకంబులు రాజిల్లెఁ । గేసరముల
రాల్చి నాగకేసరములుఁ । గ్రాలె స్వర్ణ
వర్ణపుష్పంబు లెల్లెడఁ । బరిఢవిల్లె.

గీ. పాటలారుణరాగంబు । వనములం ద
కాలసాంధ్యరాగం బనఁ । గడలఁ దోఁచె
వనదేవత సుముఖి యై । యతులమోహ
రాగములఁ జూపుచుండె వి।యోగతతికి.

గీ. మృదులవంగవల్లీగంధ । మెనసి మారు
తంబు వీచె నఖిలదిగం।తంబులందు
నఖిలజనులకుఁ గామాగ్ని । యన రహించి
చూతశాఖలఁ బల్లవ।వ్రాత మలరె.

గీ. వ్యక్తరాగోద్గమంబున । నతిశయించు
పద్మినీసక్తసరసుల। వైభవంబు
సమదభృంగఝంకారవా।చారవముల
జనుల కెన లేనిమోదంబు । సంఘటించె.

గీ. అవ్వసంతాగమం బట్టు । లతిశయింపఁ
బ్రియునిసంగమంబునకు నెం।తయు రహించు
కామినిం బోలి యామిని । కలువవిందుఁ
గూడి హిమబాష్పహీన యై । కొమరు మిగిలె.

గీ. ఇట్టితరుణంబునకు నమ్మ।హేశ్వరుండు
చలిమలం జేరి నిజసతీ।సంగమమున

నసుదినంబు సుఖించుచు । నలరుచుండెడి
వానితమకంబు నే మన।వచ్చు నార!.

—— శివవిలాసము. ——

కం. నల్లనిధమ్మిల్లంబునఁ
దెల్లనియీపూలదండ । తెల్లంబుగ రా
జిల్లెడు నని తులకించుచు సతి
యుల్లము రంజిల్లఁ జేయు।చుండును నొకతఱిన్.

కం. నిద్దపుటద్దముఁ జేఁ గొని
ముద్దియ ముద్దుగ మొగమున । బొట్టిడ దిద్దన్,
ఒద్దకుఁ జని యను "వద్దీ
యద్దంబిదె నాదు చెక్కు।టద్దముఁ గనుమా".

కం. ఒప్పులకుప్ప రమ్మా
చెప్పెద నొకమాట నీదు।చిత్తం బలరన్
ఒప్పుగఁ గొప్పున్ ముడిచినఁ
దప్పు యని కొప్పు ముడుచుఁ । దద్దయుఁ బ్రేమన్.

కం. సైకతఘనజఘన నదీ
సైకతమున గాలికొలఁ । జాఁగి పరుండన్
ఏకతమునఁ జని ముద్దిడి
యేకతమున వచ్చి తనుచు । నిట్లనుఁ బ్రీతిన్.

కం. కందమ్ములు కెందమ్ముల
కందమ్ములనంగ నొప్పుఁ । గాంతా వినుమీ
చెందమ్ముల కందము లగుఁ
జందమ్ములఁ బొందు ... । చందమ్ము లెందున్.

కం. నైజం బగురాగంబున
రాజిల్లెడు పాదపద్మ।రాగంబుల కున్

రాజానన యీాయాపక
మోజస్సుఁ దొలంగె ననుచు । నూడం దీయున్.

కం. ఏకాంతముఁ జెప్పెద నో
రాకాచంద్రానన యిటు । రమ్మని నీయా
లోకాలోకం బీను
శ్లోకంబులఁ గప్పుచుండె । లోలాక్షి యనున్.

కం. దగ దగ మనునీచెక్కిలి
మృగమదప త్రాంకితమున । మిసిమిం దప్పెన్
మగువా తుడిచెద రమ్మని
మొగమున మొగ మిడి యొకపతి । ముద్దిడుచుండున్.

గీ. వెలఁది యేమఱికూర్చుండ । వెనుకనుండి
కన్నుఁగవఁ గప్పి వెంటనె । కానరాక
యుండ; నామె భీతిలి చూచు।చుండ వచ్చి
ముద్దిడుచుఁ గౌఁగిటం జేర్చి । బుజ్జగించు.

చం. చెలు వలరారుహారముల।చిక్కు సడల్చెద రమ్ము రమ్ము నన్
జెలిమిని నీవ మెచ్చెదవు । చిల్కలకొల్కిరొ యంచుఁ జేరి, పే
రులసడలించునట్టుల నురోజయుగంబు స్పృశించి చేలవే
తెలియవు ముద్దరాలవు గదే యని కౌఁగిటఁ జేర్చు నవ్విభున్.

ఉ. ఎన్నఁడు నేర్చెనో యెఱుఁగ । మీాసరసమ్ము ప్రిలోచనుండు; లో
నెన్నఁడు యోగనష్టము; గ।తేంద్రియుఁ డయ్యె జితేంద్రియుండు; తా
నెన్నఁగ రాని మోహమున । నిట్లు మనోహరకుంజసీమలం
దన్నులమిన్నతోడను వి।హారము సేయుచు నుండె భోగి యై.

గీ. గాంగసైకతస్థలుల శృం।గారవనవి
తానముల మణికందరాం।తరములందు

నెల్ల సతితోడ రతిఁ దేలె నెవ్వఁ డెఱుఁగు
గాముఁ డొక్కండు దక్క నొక్కండు వినుఁడు.

గీ. హావభావవిలాసచేష్టాధికమున
సతియుఁ బ్రియునిశృంగారరసంబు నెల్ల
పానముం జేసి యాతనిభావమునకు
సానుకూలంబు గా నుండె నతులగతుల.

గీ. చారుహాసవిలాసశృంగారములకు
సరసమధురిమవాచాప్రసంగములకుఁ
బ్రమదముం జెంది శంభుఁడు బద్ధుఁ డయ్యె
గుణములన్ బద్ధ మగుమదకుంభిఁ బోలి.

వ. అంతఁ గ్రమక్రమంబునఁ గాలచక్రపరివర్తనంబున భీష్మం బగు గ్రీష్మంబు జగంబు నాక్రమించె.

## గ్రీష్మఋతువర్ణనము

చం. ఇనుఁడు ప్రజానురాగమునఁ దృప్తిగఁ బూర్వము భూతలంబుపా
లన మొనరించి యిప్పు డతిలాభముఁ గోరి కరాళి నప్పులన్
గొనియెఁ బ్రచండతాపమును గూర్చె విషాదము సంఘటించె జీ
వనముల నెల్ల లోఁ గొనియెఁ బాంధుల మేల్గనకుండెఁ గ్రూరుఁడై.

చం. సల సల కాఁగె నీరములు; తొన్మస్థలి బీటలు వాఱె; వృక్షముల్
మల మల మాడె; భూతలము మంగలమై కడు వేండ్ర మొంద లా
జలవలె నుండె జీవములు; చాకలి పంకగతంబులైనచేఁ
పలఁ గొని తృప్తిఁ జెందె; మిను వాఁకయుఁ బెంపఱె నీరు లేమికిన్.

మ. మృగతృష్ణల్ గనుపట్టఁగన్ వనములన్ దృష్టాతిరేకంబునన్
మృగము భ్రాంతికిఁ జిక్కె; భూమినడుమ న్స్వంపాందునీరింకెఁ; బ
న్నగముల్ పుట్టలనుండి పైకి వెడలన్; నాశిల్లె జీవాళి; ము
జ్జగ మెవ్వేళను గోరుచుండె నెలమిన్ శైత్యోపచారంబులన్.

గీ. తడఁబడుచు నుండె లోక మట్టుడుకునట్టు
లినునకుం దక్కకుండ లోఁ గొని నిగూఢ
సరణిఁ గాపాడి తనకృతజ్ఞతను జూప
నారికేళంబు జనులకు నీరొసంగె.

సీ. పల్వలంబునఁ గలపంకంబునం దుండి
క్రోడ మీవలకు రా నోడియుండె
సల సల తెరలిన సరసిబొబ్బలు వోలె
లోనుండి బేడిసల్ తుళ్లుచుండె
మ్రాఁకుక్రీనీడ నాలోకించి మృగశాబ
మూవాలజలముగ నాత్మఁ దలఁచె
నెండ వేఁడ్రిము తాఁకకుండ మయూరంబు
సడలిచి పింఛంబు గొడుగుఁ జేసె

గీ. జఠరమున నిల్వఁ జేసినజలము నెల్ల
నొంటె యించుకంతయు త్రాగుచుండె నెలమి
రొంపిఁ గోరాడి మహిషంబు రోఁజుకొనియె
వాడి వత్తైన వ్యాళంబు వత్తిఁ బోలె.

గీ. భూరిమృగతృష్ణఁ గ్రాలునేడారి యనెడు
కడలిలో నీఁదులాడుచుఁ బడవఁ బోలి
యొంటె బేహారులం బ్రోచుచుండె; దాని
ఋణముఁ దీర్పఁ గలండె యాసృష్టికర్త.

వ. అంత,

వర్షాకాలవర్ణనము

చ. శరముల నెల్ల లోఁ గొనుచుఁ జంచల యగ్ధ్వజ మెత్తి నిర్జరే
శ్వరుధనువుఁ ధరించి ఘనసైన్యము లెల్లెడఁ బాదుకొల్పి, దు

స్తరముగ వజ్రినామకశ।తఘ్నులఁ జేర్చి రణాభిలాష భీ
కరుఁ డగుమేఘరాజు తటిఁ । గాంచుచు నుండె నినుండు భీతిలన్.

చం. ఇనుఁ డనురాగముం విడిచి । యెల్లజనంబుల నేఁచుచుండఁగన్
గని తటి యంచు మించి గగ।నంబును దిక్కుల నాక్రమింప నె
మ్మనమున నెంచి ము న్నినుని।మండలముం వడి ముట్టడించి యా
ఘనుఁ డగు మేఘరాజు లయ।కాలునిఁ బోలి పరాక్రమింపఁగన్.

ఉ. రాణువతోడ మేఘుఁ డను।రాజు దినేంద్రుని ముట్టడించె నా
ప్రాణము లుండ మిత్రునకు । హాని ఘటిల్లునె యార! నే జగ
త్ప్రాణుఁడ లోకబాంధవుఁ డ।తం డని వాయువు రేఁగి యంబుద
శ్రేణి హుటాహుటిన్ గలఁచెఁ । జిందఱవందఱ గాఁగ నెంతయున్.

సీ. బ్రహ్మాండభాండంబు । పగిలె నాఁ గుహారకం
దరములు ఘూర్ణిల్లి । ధ్వనుల నీనఁ
గందరాంతరసుప్త।కంఠీరవము లేచి
డంబుగఁ బ్రత్యుత్త।రం బొసంగఁ
గుంజాంతరోన్నిద్ర।ఘోరదర్శనము శ
తఘ్ని యన్ భయమునఁ । దల్లడిల్ల
నాతపంబునకుఁ బ।కావశిష్టం బగు
హ్రదమున మహిషంబు । బెదరి పాఱ

గీ. నాదమఱచినయజగరం । బదరిపడఁగఁ
బాలకడలిని వెన్నుండు । మేలుకొనఁగఁ
బ్రళయపర్జన్యగర్జాను।బంధ మనఁగఁ
గడల నడరె ఘనాఘనగర్జనంబు.

ఉ. పుడమి సగంబు కుంగ జన।ముల్ కడుఁ భీతిల మేఘుఁ డుగ్రుఁడై
క్షీణగుణం బుఱుప్పుచుఁ జెవులు । వ్రీలఁగ గర్జిలుచుండఁగన్ వడం

బడి తనయుయ్యాలం గలకుమారుఁడు జ్ఞప్తికి రాఁగ "అమ్మ నా
కొడ" కని యార్చి పర్విడియెఁ గోమలి యోర్తుక భీతచిత్తయై.

మ. వలు వైనం గొనియీయ విట్టురక సంభాషింపఁగా నేటికిన్
వల పొక్కింతయు లేసిభర్త వని కోపం బూని పల్కాడ కా
నలకు నోమ్మును ద్రిప్పి సందుకొనియున్ బర్జన్య మాలించి వి
హ్వాల యై దగ్గఱి కౌఁగిలించుకొనె నిల్లాలొర్తు ప్రాణేశునిన్.

గీ. అట్టివేళను బెదరి రాయంచఁ బోలి
భీతహరిణాక్షి సతి తనప్రియునిఁ గాంచి
మందహాసముం జేయుచు మందగతిని
చెంతకుం జేరి యిట్లు వచించె నపుడు.

గీ. కాలమేఘాగమం బెల్లకడలఁ దోఁచెఁ
బరమదుస్సహకాలంబు ప్రాప్త మయ్యె
దిగులు జనియింప హృదయంబు పగులఁ బాఱ
నంతటన్ వీచుచుండె ఝంఝానిలంబు.

గీ. అహహా పవనేరితంబులై యంబుదంబు
లాకసంబున నెల్లెడ నాక్రమించి,
ఒయ్యనొయ్యన వ్రేలాడుచున్న వదిగో
అందుకొనవచ్చుఁ జేతితో నిందుమాళి!.

సీ. ఆశాంబరస్థగితానేకవర్ణమే
ఘాఘుంబుఁ జూచితే యలికనేత్రి!
అమితధారాసార మాశాంతములనుండి
వెడలె భూతలము కన్పడకయుండె
వెఱపించుచున్నట్లు మెఱపులు కనులకు
మిఱుమిట్లు గొలుపుచు మెఱయుచుండె

జలదసంఛన్ను లై । చంద్రసూర్యులు నిత్య
పూర్ణగ్రహణములఁ । బొంది రేమొ?

గీ. విగహులకు మనోబాధ యా।విర్భవింపఁ
బట్టపగ లైనఁ జీఁకటి । పాదుకొనియె
ధ్వనుల నీనుచుఁ బవనేరి।తమున మేఘుఁ
డౌదలం బడునట్లు వ్రే।లాడుచుండె.

గీ. మారుతాహతాఖిలదీర్ఘ।భూరుహములు
అంబరస్థలి నల్లల।నాడుచుండె
శిఖరిశాఖలఁ బూని సి।శ్లేషముగను
ఉపరి మేఘుండు జాడించు।చుండె ననఁగ.

గీ. స్నిగ్ధనీలాంజనముఁ బోలి । చెలు వడరుజ
లధరుపృష్ఠభాగమున బ।లాకరాజి
కానఁబడె యమునాఘృష్ట।ఫేన మనఁగ
నల్లదిగొ చూడు మానంద । మతిశయిల్లు.

సీ. జలనిధిసందీప్త।బడబానలముఁ బోలి
చంచల గనుపట్టె । క్షణము క్షణము
మందిరప్రాంగణ।మం దంకురము లొప్ప
క్షేత్రసీమలచొప్పు । చెప్పవలెనె
వృష్టిలాభంబును । స్పష్టీకరించుచుఁ
గేంకారమునఁ గేకి । నృత్య మాడెఁ
జాతకవితతికి । జాతకయోగంబు
వర్షరూపంబున । బయలుపడియె

గీ. నఖిలగగనంబు దిక్కుల । నాక్రమించి
శక్రచాపంబు ధరియించి । జలధరుండు

కేసరిం బోలి గర్జించి కినుకఁ బూని
ధరణి పగుల శరాసారధాటిఁ జూపె.

గీ. కింశుకశ్రీసమృద్ధి నిస్సంశయముగఁ
గుటజకుసుమంబులం జేరి కొమరు మిగిలెఁ
గలియుగంబున లక్ష్మి నిష్కపటజనులఁ
బాసి కపటోన్నతులఁ జేరుపగిది నాథ!.

ఉ. అప్పుల నిచ్చి నిస్పృహత నయ్యెవి కోరకయుండ స్వల్పమం
చొప్పరికించి చాతకమయూరము లర్థిజనంబులట్ల తా
మొప్పమిఁ జూప నంతఁ గరకోపలసంచయ మూని యుగ్రుఁడై
యుప్పుచునుండె నాజలధరుండు; త్రిలోచన! పాపమోచనా!.

గీ. మానసము దవ్వయిన భీతమానసమున
హంససంఘంబు మేఘునిహింస కడలి
పక్షవిక్షేపసంజాతవాతధూత
జలదసంఘమై నెవ్వడిం జనుచునుండె.

గీ. జలధరుండు జగన్నుతసరసుఁ డయ్యు
వర్షధరుఁ డౌటఁ గాదె శంపాలతాంగి
యస్థిరంబుగఁ జంచల యగుచునుండెఁ
గంటివే నాథ! కన్నులకఱవు దీఱు.

గీ. కాకములుఁ గోకములును బలాకములును
నీడములఁ గట్టుచుండెఁ గంటివె మహాత్మ!
కడలి, లోఁగొను నీహారకాలమునను
గృహము లేకుండ సౌఖ్య మెట్లైనయనగును ?.

ఉ. భూసతికిన్ మనోహరవిభూషణమో యనఁ గ్రాలుఖేచరో
ల్లాసము సర్వపర్వతవిలాసము లోకవికాస మైనకై

లాసముఁ జూడ లేదె? నిట|లస్థగితాధికనేత్రి! దాని నా
వాసము గాఁగఁ గైకొసన|వారికి నుంతయు లోప ముండునే?.

వ. మఱియు,

ఉ. ఎంతయుఁ జెప్ప నొప్పదె క|రీంద్రికరోజ్ఝితగాంగశీకర
ప్రాంతచరద్వనేచరక|రచ్యుతబాణహతోగ్రసింహర
క్తాంతముఁ, బుష్పవాసితది|గంతము, సభ్యమునీభ్యసంచయా
క్రాంతముఁ, జంద్రకాంతమణి|కాంతము నాహిమసానుమంతమున్.

గీ. తోషమున కిర వైనకై|లాసముననొ?
భద్రిముల కిర వగుహిమ|భూధ్రముననొ?
వాసయోగ్యంబు గా నుంచు|వాస మొందు
ప్రాణనాయక! పరికింప|వలయుఁ జూవె.

చం. అని సతి వానకాలమున | కాత్మఁ గడుంగడు జంకి యాఘనా
ఘనఘనగర్జనంబులకుఁ | గాళ్ళు తడంబడఁ గంప మొంది యే
వనమును జూచినన్ వనధి|వైఖరిఁ దోఁపఁగ భీతిఁ జెంది ప
ల్కినపలుకుల్ శివుండు విని | క్లేశముఁ బాపఁగ నామె కిట్లనున్.

గీ. జలధరుండు చొచ్చుటకు న|శక్య మైన
స్థలమునకు నిన్నుఁ గొనిపోదు | సారసాక్షి!
వర్షకాలంబునం దైన | వారిధరము
ఈనితంబపర్యంతము | నెనసియుండు.

## హిమవత్పర్వతవర్ణనము.

గీ. స్త్రీ లధస్సానువుల సంచ|రించునపుడు
వర్షధారలు పైఁబడ | త్వరితగతిని
సాతపాక్రాంతహిమపర్వ|తాంతమునకుఁ
బోవుచుండు రసజ్ఞశే| బూఁబోణి! వినుము.

గీ. అతివ! యతిమేఘమండల । మై రహించు
నట్టికైలాసశిఖరిపై । నంచపిండు
సలిలధరున కధోగతి । సంభవించె
ననుచు నెన లేనిమోదంబు । నాత్మ నెనయు.

ఉ. కాంచనగాత్రి! యీగిరియు। గంబు యుగంబులనాఁటినుండి వీ
క్షించు చునుంటి నేను పరికింపనితావులు లేవు, నీవు కాం
క్షించినదానిపైని నివ।సించి సుఖింపఁగవచ్చు నీ కెఱిం
గించెద నాలకించి యెఱిఁ।గింపుము వెండియు నీయభీష్టమున్.

గీ. పసిఁడితెక్కలు దిక్కుల । మిసిమి నింప
చలిమలం గలకొనల స్వే।చ్ఛావిహార
రతిని నెగడుచుఁ గిలకిలా।రావముల నో
నర్చెడుశకుంతముల వెల్మి । నచ్చు నీకు.

గీ. నాగకన్యలు దేవక।న్యలును మఱియు
శైలకన్య లెల్లరు నీకు । సంతతంబుఁ
బ్రేమ దైవార ననుమోద।విభ్రమములఁ
దోడునీడ లై యుందురు । తోయజాక్షి!.

ఉ. స్తోకము గానిరూపమునఁ, । జుట్టఱికంబున, శీలమందు, లో
కైకగుణంబునందు నహా।హా యని లోకములందు నెల్లరుఁ
మేకొని మెచ్చఁ గీర్తిఁగొను । మేనక యుఁ గిరిరాజుభార్యయుఁ
నీకు మనోనుమోదమును ।నిత్యముఁ గూర్చుచునుండుఁ బ్రేయసీ!.

వ. విచిత్రకోకిలాలాపంబును, నికుంజపుంజావృతంబును, సదా వసం
తప్రభవంబును, నానాస్వచ్ఛజలపూర్ణసరశ్శతసమావృతంబును,
సర్వకామప్రదవృక్షచ్ఛాదితంబును, శాద్వలాలంకృతంబును, ప్ర
శాంతశ్వాపదగణసంయుతంబును, మునిసేవితంబును, స్ఫటికస్వర్ణ
ప్రభావిభ్రాజితంబును, హిరణ్మయరత్ననాళసరోజమ్ములకుళ విరాజి

తంబును, కాదంబసారసమత్తచక్రాంగసంఘసంగతమానసాదిసరో వర్గపరిశోభితంబును, పుష్పవిభ్రమద్భ్రమరఝుంకారరుతంబును, రంభా శచీ మేనకాదిరంభోరుగణసేవితంబును నగుహిమవంతంబును వాసయోగ్యంబని యభిలషించెదో, విత్తేశపురీపరివిరాజితంబును, గంగాజలౌఘప్రయుతంబును, పూర్ణచంద్రసమప్రభాభాసితంబును, యక్షకన్యాకుచకుంభావలిప్తనిస్తుల కస్తూరీవాసితదిగంతంబును నగుకైలాసంబు నివాసంబుగఁ గాంక్షించెదో? యొతింగింపు మనవుడు సతి పశుపతి కిట్లనియె;

సీ. బాలార్కకిరణవి।భ్రాజితశృంగంబు
కనకరజతరత్న।కర్బురంబు
శాద్వలబింబిత।స్ఫటికాభ్రకయుతంబు
ముకురసన్నిభసాను।భూషితంబు
కంజాతకైరవ।కల్హారగంధంబు
సంభ్రమద్భ్రమరసం।చయరవంబు
చక్రవాకబలాక।సారసక్రౌంచంబు
కోకిలకులకల।కూజితంబు

గీ. కల్పవృక్షసమానవృ।క్షవ్రజంబు
నిర్ఝరీకిన్నరీసమ।న్వితవనంబు
సర్వపర్వంబు ప్రాలేయ।పర్వతంబు
వాసయోగ్యంబు గా నుండుఁ। బ్రాణనాథ!.

గీ. అట్ల యౌఁ గాక యని యప్పు। డలికనేత్రుఁ
డధికరయమున నప్పర్వ।తాగ్రమునకుఁ
బోయి మణికందరాంతరం।బుల, వనాంత
రంబుల వసించి సుఖియించె। రమణితోడ.

ఆశ్వాసాంతము.

శా. దంభోళ్యత్యధికాస్త్ర, శస్త్రకలితోద్దంచద్యశఃక్షీర, క్షీ
రాంభోరాశిగభీర, భీరహితవీరాత్యుగ్ర, యుగ్రస్తుతా
రంభోదగ్రరణప్రచారదళితక్రవ్యాదసంరంభ, రం
భాంభోజాక్ష్యధరప్రమోదితసమస్తారాతివంశాంతకా!

మాలిని సుగుణమణికలాపా । స్తూయమానప్రతాపా
విగతకుజనపాపా । భీతదైత్యప్రలాపా
విగళితజనతాపా । భిన్నఫాలాక్షుచాపా
జగదవనకలాపా । జానకీపుష్పరోపా.

గద్యము. ఇది శ్రీభాగవతుల నరసింహశర్మప్రణీత. శ్రీకాళికానామ
పురాణాంతర్గత శృంగారసంధ్యయందు
ద్వితీయాశ్వాసము.



శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శృంగారసంధ్య

(కాళికాపురాణాంతర్గతము.)

## తృతీయాశ్వాసము.




డీశవినుత ఖండన
ఖండీకృతదనుజకాండ । కాండోద్దండా
పండితజనకథిత యశో
మండిత లోకాతివీర । మహితవిచారా!.

వ. అవధరింపు మనంతర మామృకండునందనుం డిట్లు కమఠాదిమును లకుం జెప్పం దొడంగె. కన్యాప్రదాత యగునాప్రజాపతి యొక నాం డేకాంతంబునం గూర్చుండి యనేకాంశంబులం దలంచుచు,

### దక్షాధ్వరప్రారంభము.

శా. కన్యాదానముం జేసినాడ విధిసంకల్పంబు సిద్ధించె, న
న్యోన్యప్రేమ వహించి రిర్వురును; నా । కావంత యావంత లే
దన్యల్ మేలన విష్ణుమూర్తి యలరన్ । నాకౌకసుల్ మెచ్చ సౌ
జన్యశ్రీ విలసిల్ల లోకనుతయజ్ఞం బొందు గావించెదన్.

వ. అట్లు తలంచి, శూలిం గూర్చి యనేకభంగుల విచారించి,

ఉ. శౌచము లేనివాఁడు బుధసంఘవిగర్హితవర్తనుండు పై
శాచగుణానుభావుఁడు, శ్మశానవిహారరతుండు, సాత్త్వికా
లోచన లేనివాఁ డలికలోచనుఁ డధ్వరగౌరవార్హుఁడే
నీచుఁ డనంగఁ బోలు నని నెమ్మది నెంచె వివేకశూన్యుఁడై.

వ. ఇట్లు కృతనిశ్చయుండై సర్వప్రయత్నంబులం గావించి కపాలిం దక్క నెల్లర నాహ్వానించె. అనంతరమున,

చం. ఘనులు, మహానుభావులు, జగన్నుతవిప్రులు, నారదాదిస
న్మునులు, మహర్షులుం గొలువ భూతలమంతయు వేదిగాఁగఁ దా
నెనుబదివేలకున్ మిగులు ఋత్విజులున్ దనరారునధ్వరం
బొనరిచె నగ్నిహోత్రుఁడును హోతృనకుండై తనయాహుతిన్ గొనన్.

ఉ. హోతలు నారదాదిసుజనోత్తము లర్వదినాల్గువేల యు
ద్గాతలు దేవదానవులుఁ దాపసులున్ జనలోకవంద్యులున్;
ధాత ఘనత్రయీవిధినిదర్శకుఁ డాయమరేశ్వరాదిది
క్పాలకు లెల్ల ద్వారపాలకులు, కింకరు లెల్లరు; లోప మున్నదే ?.

గీ. సకలసద్గుణి హరి యధిష్ఠాత యయ్యె
నాకృతిం దాల్చి యేతెంచె నగ్నిహోత్రుఁ
డఖిలసురసిద్ధసాధ్యవిద్యాధరాది
గగనచరులు సేవకు లైరి కార్యమునకు.

గీ. వారు వీ రన నేల విశ్వంబునందుఁ
బుట్టి జంగమం బయి యుండునట్టి ప్రాణి
లోక మేతెంచె, లోకసుశ్లోకుఁ డైన
యాకపాలి రాకుండె నాయాగమునకు.

వ. దక్షుండు మూఢుండై, సదసద్వివేకహీనుండై,

ఉ. అల్లుఁడు శంకరుండు నిగమాన్యుఁ డకుంఠితసద్యశోలతా
పల్లవితసర్వలోకమునిబృందమనస్సరసీజభాస్కరుం

జెల్లరఁ బోవుచువేలు పని । యించుక యైనఁ దలంపకుండఁ దా
నుల్లమునన్ గపాలి యని । యొప్పరికించె నగౌరవంబుగన్.

గీ. దక్షుఁ డప్పుడు సర్వస్వదక్షిణాధ్వ
రంబుఁ గావించి యఖిలని। ర్జరుల ప్రీతిఁ
బడసె విశ్వేశ్వరప్రీతిఁ । బడయకుండె
రాసభప్రాప్తి కలరి స్వర్గవిని విడిచె.

ఉ. విప్రవరుండు దక్షుఁ డవి। వేకమునన్ మతిఁ దప్పె సర్వలో
కప్రణుతాప్రమేయు లయి। కాలుఁ గపాలిఁ దృణీకరించె నీ
యప్రియవార్త దిక్కుల దవానలమో యన నాక్రమించుచున్
క్షిప్రగతిన్ సతీసుతులఁ । జేరెఁ బ్రమాదము లేకయుండునే?,

## సతి పరితాపము.

వ. అంత నాసతీదేవియు,

ఉ. పాములివాఁడు రుద్రుఁడు క। పాలి మహాధ్వరగౌరవార్హుఁడే ?
ఏ మని పిల్వనంపుదు మ। హేశ్వరు; నాతనిభార్య యైనకాం
తామణి నాదుకూఁతు రంచునన్ బిలువందగ దంచుఁ దండ్రి యా
రా ! మరియాదఁ దప్పె నిఁక । ప్రాణవిభుం దిలకింప నెట్లగున్.

చం. జనకుఁడు నే జనించుటకుఁ । జాల తపించినవాఁడు, మస్తుగాఁ
బెనిచినవాఁడు, నాదుమురి। పెంబులఁ దీర్చినవాఁడు; నేఁడు నా
జననము వమ్ముఁజేసె ననుఁ । జచ్చినయట్లు తలంచె నల్లునిన్
ఘనుని నగౌరవించె నిఁకఁ । గాల్పనె నాదుశరీర మేటికిన్.

చం. ఇతనికి నే జనించుటయ । యొంతయుఁ గీడు పొసంగె నార! నా
కతమునఁ గాదె భర్తకు న। గౌరవ మిప్పుడు సంభవించె నే
సతి పతి కిట్లగౌరవము । సంఘటియించునొ యామె నావలెన్
బ్రతుకుఁ దృజింఘుఁ గాక బుధ। వర్గము ఛీ లని సన్నుతింపఁగన్.

ఉ. మానవతీశిరోమణికి । మానము మూలధనంబు; తండ్రిచే
న్యూనతఁ జెందె నాథుఁడు న।నుం గనఁజాలునె? ప్రాణభర్తస
న్మానము లేనికాంత కవ।మానము దప్పునె బంధుకోటిలో ?
మానము లేనిజీవనము । మానినికిం దగ దింతయేటికిన్.

చం. వరుసగ లెక్క లేని మగ।వాండ్రకు వల్లభ యైనకాంతయుం
బరువును గోరి మాన మప।మానము ప్రాణము లేటి కంచుఁ దా
గరువముఁ జూపు చుండు; నొక।కాంతునకుం బ్రియకాంత యైనయే
వరసతి ప్రాణవాయువులఁ । బాయక మానముఁ గోలుపోవునో?.

గీ. ఈవు నన్నవమానించె। దేని తత్క్ష
ణంబ నేఁ బాయుదానఁ బ్రా।ణముల ననుచు
దక్షునకు మున్ను జెప్పి వ్ర।తంబుఁ గొంటి
సమయ మిదె వచ్చె నాఁటినా।సమయమునకు.

చం. జనకునిదేహ మీక్షణమ । శాపదవాగ్ని దహింపవచ్చు, నై
నను సమయంబుఁ గైకొనిన।నాకు శపింపఁగ నేల? దుఃఖభా
జన మగుమేను బాసెద య।శంబును గొందు; నగౌరవంబునన్
దనుజను జంపె నన్పలుకు । దక్షునిఁ జంపక చంపు నెప్పుడున్.

గీ. దేవతారాధ్యుఁ డేకప।త్నీవ్రతుండు
నాఁటి నాతపంబునకు సం।తసముఁ జెంది
నన్నుఁ బెండ్లాడి మన్నించి । కన్నుఁగవకు
ఱెప్పవలె నుండె శివున కే । నప్పువడితి.

గీ. కడకు సుతు నైనఁ గడుపారఁ । గాంచియున్న
నప్పుఁ దీర్చినదాన నై । యలరియుందు
దేవతల కైన నెన లేని । తృప్తి దీఱు
మర్త్య నై ప్రాణములఁ బాయ।వలసివచ్చె.

గీ. భార్యయున్ భర్తయున్ బర।స్పరముఁ బ్రేమఁ
గలిగి మెలఁగుటయ మనది । గగనసుమము
అట్టిప్రేమంబు సంప్రాప్త । మైన నేమి ?
క్షణమువలె నంతరించె నా।కాఁపురంబు.

సీ. అన్యోన్య మనురాగ । మందియుంటిమి మేము
ననుఁ బాసి మఱియొండు।నాతి గనఁడు
ఆతనిచిత్తంబు । హర్షింపఁ జేసితి
నేనుఁ బాయుదునంటి । నతని నిపుడు
మఱియొండుచాన య।మ్మహనీయుచిత్తంబుఁ
గరఁగింపఁ జాలదు; । కరుణఁ గలిగి
మేనక నాయెడ । సానురాగముఁ జూపి
సంతోషముం గూర్చె । జననిఁ బోలి

గీ. ఆమెకూఁతు నై జన్మించి । యలరఁ జేసి
శైశవక్రీడలం దేలి । జగతికాఁతు
శంభునకు బాయ నగుదు; వి।చార మేల ?
చక్రపరివర్తనముఁ బోలు।జన్మమునకు.

మ. అని చింతించి ప్రకోపచిత్త యయి యా।యజ్ఞాంశి కొందమ్ములో
యనఁ గుందోయి యకాలసంజనితసం।ధ్యాకాలముం బోల, నా
నన మాభీలసూర్యబింబ మనఁగన్ । రాజిల్ల, నత్యుగ్ర నై
తనువుం బాయఁదలంచె; నేరమును గాం।తల్ సైఁప రొక్కింతయున్.

ఉ. కాంతునిదుష్ప్రవృత్తులకు । గాసిలి చావఁగ వింటి, నత్తయొ
క్కింతయవజ్ఞ సేసిన సహింపక చావఁగ వింటిఁ, దండ్రి య
త్యంత మగౌరవించె నని । యాత్మఁ ద్యజింపఁగ నున్న వింటిమే ?
ఇంతటిస్వాభిమానము వహించినకాంతను శాంత ముండునే?

ఉ. తెంపు వహించెఁ గాక కడఁ। దేరనికోపముఁ బూని చచ్చి సా
ధింపఁ దలంచె నాసతి, మఱిదిం దలపెట్టినయంత నెంతయుఁ గ
గ్గింపము పుట్టుచుండె భయ। కారణ మయ్యె, దురాత్ముఁ డైన నా
లింపనియాత్మహత్యకుఁ జ। లింపక పూనె నెమిచెప్పుదున్.

గీ. తండ్రి వద్దాదు వారెర। దక్షు యనుచు
దశదిశలఁ గాంచి తనదుదు। ర్దశఁ దలంచి
యవయవంబుల భేదించి। యూలతాంగి
యోగమార్గానుపద్ధతి। నుసురు విడిచె.

గీ. కాంచినట్టితండ్రి యగౌర। వించె ననుచుఁ
దనయ యీరీతి మృతిఁ జెందఁ। దగునె హేతు
వరయ నవకాశ మించుకం। తైనఁ గలదె?
కారణం బల్ప మతిఘోర। కార్యమునకు.

విజయవిలాపము.

వ. అంత,

గీ. ప్రాణములఁ బాసి నేలపైఁ। బడినసతికి
భగినిసుత యైన విజయ యన్। పంకజాక్షి
అచ్చటికి నామె వీక్షింప। వచ్చుసరికిఁ
జచ్చి పడియుండ ప్రాన్పడి। యిచ్చవడియె.

గీ. హా! హతోస్మి మాతృష్వసా। యనుచు రావి
యాకువలె మేను కంపింప। నాననమున
దుఃఖ ముప్పొంగ వెడఁదకం। దోయినీరు
జాలువాఱఁగ నిలువున। నేలఁ గూలె.

గీ. పండుకొనియున్నదో లేక। వ్యాధివలన
మూర్ఛఁ జెందెనో? చచ్చెనో?। ము న్నెఱుంగ

కుండఁ జూచినయంతనే । యొఱవఁబడియె
నాత్మ కాత్మయె తారాఖ్య । మగును గాదె?.

వ. అవ్విజయ యట్లపారదుఃఖంబున నేలం గూలి సతీశిరముఁ దొడపై నిడి, స్తంభీభూతయై, నిర్జీవప్రతిమం బోలి చేష్ట లుడిగి యెట్టకేలకు,

సీ. మాటిమాటికి మోము । మూర్జించుచున్ మోము
నెత్తినిఁ గేల్దోయి । మొత్తుకొనుచుఁ
కన్నీరు మున్నీరు । గా విలపించుచు
ఱొమ్ముపైఁ జేతుల । ఱిమ్ముకొనుచుఁ
బాహియుగంబునఁ । బదములఁ బుడుకుచు
గోలు గోలున నేలఁ । గొట్టుకొనుచుఁ
కేశంబు నిమురుచు । నాశలం జూచుచు
దిక్కు లేదని వెక్కి । వెక్కుకొనుచుఁ

గీ. తనయనే తల్లి కాంతామ।తల్లి యనుచు
నన్నుఁ జూడవే యన్నుల।మిన్న యనుచు
మృత్యుదేవత నిన్నిట్లు । మ్రింగె ననుచు
నేడ్చుచుండె శోకాంబుధి । నీఁదుకొనుచు.

గీ. శోక మనుకాలమేఘ మ।స్తోకముగను
ఆస్య మనుచంద్రబింబంబు । నాక్రమించి
బాష్పరూపంబునన్ బెను।వాన గురిసెఁ
జన్నుఁగొండల పైనుండి । జాలువాఱ.

వ. అట్లు విజయ యమితవ్యాకులచిత్తయై సతిం గాంచి,

గీ. తండ్రియవమానకృత్యంబుఁ । దలఁచి, యలిగి,
ప్రాణములఁ బాసి తీవ్ర, శం।పాలతాంగి !

నీదుమృతదేహముం గాంచి । నేను బ్రదికి
యుండ నగునె ? డెందము బ్రీల।కుండె నహహా!.

గీ. నీదుమరణంబు వినినంత । నీదుజనని
బ్రదుకఁజాలునె జీవముం । బాయకుండ
శోకకర్షితచిత్తయై । లోకములను
జుట్టముల నెచ్చెలుల నెట్లు । చూడఁగలదు ?.

మ. కుటిలాత్ముం, డవివేకి, పాపి, నిరను।క్రోశుండు, నీతండ్రి; యి
చ్చటి యీవార్తను వీనులార విని యజ్ఞం । బెట్లు గావించు ? న
క్కట జీవించునె ? యాత్మసంజనితశో।కవ్యాకులప్రాప్తికిన్
జటులాగ్నిం బడకుండునే యకట ప।శ్చాత్తాపసంతప్తుఁడై?.

గీ. బాలవలె నేను కుందుచు । జాలిఁదూలఁ
బచ్చి తేనియ లొలుకఁగఁ । బలుక వేల ?
నిన్ను నీదుమనోహరు । నెన్నఁడైనఁ
బలికియుందునె దూషణ।భాషణములు?.

చం. కల కల లాడునీదుముఖ।కాంతి భయంకరకాలమృత్యు వన్
జలదమునం దణంగె ; నయ।నంబుల నించుక యెత్తి చూడవో
యలికులవేణి! నీదుదర।హాసవిహీనముఖంబుఁ గాంచినన్
వల వల యేడ్చి ప్రాణముల।బాయకయుందునెయెట్టిప్రాణియున్ ?.

గీ. బాంధవులయందు సఖులందు । భర్తయందు
భావముం బట్టిమెలఁగెదు । పంకజాక్షి !
ఇంటి కేతెంచునప్పటి । కీవు పలుక
కున్న హరుఁ డెట్లు సహియింప।నోపుఁ జెపుమ?.

చం. పరువముఁ దప్పె మేను, నిడు।వాలుఁగనుంగవసొం పణంగె, సుం
దరవదనాంబుజంబుపయిఁ । దాండవ మాడుచునుండె మృత్యు, వీ

కరచరణంబులుం గలువ।కాడలకైవడి నొప్పె; నక్కటా!
హరుఁడు సహింప నోపునె? దు।రాత్ముని దక్షునిఁ జంపకుండునే?.

గీ. విజయ యీరీతి వల వల । వెక్కి వెక్కి
కుందుచుఁ నేల విల విలఁ । గొట్టుకొనుచు
నుండ నంతట నమ్మంచు।కొండచఱుల
దేవతాక్రందనంబు ప్ర।తిధ్వనించె.

వ. అనంతరమున,

సీ. అరుణాబ్జకాండంబు । లన నొప్పుజడ లెల్ల
విద్రుమద్రుమలతా।వితతిఁ బోలఁ
బుండరీకనిరూఢిఁ । బోలు పొందువదనంబు
క్షాళితముకురంబు।కరణిఁ గ్రాలఁ
గ్రొన్నెలవెన్నెల।వన్నె లీనెడుమేను
స్ఫటికశిలాఖండ।సరణి మీఱఁ
బల్లవంబులఁ బోలు।పదములు పథమునఁ
గెంపులఁ జొనిపిన।సొంపు నింప
గీ. స్నానముం జేసి, భూతి నె।మ్మేన నలఁది
కాంత సంతోషముం జెం:ఁ । గాండసహిత
కమలకల్హారనీలోత్ప।లములఁ బూని
వచ్చె హరుఁడు మానససరో।వరమునుండి.

ఉ. కొండొకచింత నెక్కొనియెఁ । గొందల మందుచునుండె డెంద మా
యండజయాన నాదువిర।హంబున జాలము సైఁపఁ జాల దీ
కొండ నతిక్రమింపవలె । గొబ్బున నం చరుదెంచి త్రోవలో
నుండియె యాలకించె శివుఁ । డున్నతగద్గదికార్తనాదమున్.

విజయఁ గాంచి యీశ్వరుఁడు సతిఁగూర్చి ప్రశ్నించుట

ఉ. ఉక్కును డిగ్గి భార్య పడియుండఁగ దూరమునుండి చూచి ప
ద్మాక్షియవేళఁ బండుకొనె నారకతం బది యేమొ యంచు ఫా
లాక్షుఁడు చెంత కేగి విజయం గని యేడ్చెద వేల బేల ? వ్యా
ధిక్షుభితాత్మ వైతివొ ? సతిం గని మేల్కొన దంచుఁ గుందెదో?.

ఉ. ఇచ్చపలాక్షి జాణ, నను నెంతయుఁ గాఁ గికురింప నెంచి, నే
వచ్చెడు వేళ యయ్యో యని భావమునం దలపెట్టి, వంచనం
బచ్చుపడంగఁ బండుకొనినట్లు నటించుచునుండె ; నిప్పుడే
పొచ్చెము తేటతెల్ల మగుఁ బో యని లేపుట కుద్యమింపఁగన్.

ఉ. హా ! రమణీలలామ తన ప్రాణముఁ బాసి గతించె నంచు లో
నారయఁ జాలకుండె ; హృదయంబున నమ్మక మూనెఁ జెప్పఁగన్
నో రెటు లాడునంచును గనుంగవ బాష్పములన్ ద్యజించుచున్
భోరున నేడ్చె నా విజయ భూగగనంబులు మారు మ్రోఁగఁగన్.

చం. వెల వెలఁ బోయి యీశ్వరుఁడు వెంగలి వైతివె యోసి గోల? ని
ద్రిలుసతిఁ గాంచి యేడ్చెదు; మదిం దలపోయఁగ మీర లిర్వురున్
గలసి యొనర్చినట్టినటనంబుగఁ దోఁచెడు ; దుఃఖహేతువున్
దెలుపక ముజ్జగంబులు మునింగిన కైవడిఁ గుంద నేటికిన్.

చం. అన విని సేదఁ దేఱి, హృదయంబున స్థైర్యముఁ బాదుకొల్పి, మో
మును బయికెత్తి, యీశ్వరుని మోమును జూచి, శరీరమున్ ద్యజిం
చినసతి మోముఁ జూచి, తన చేలచెఱంగునఁ గేలుదోయి శోఁ
గనులను దుడ్చుకొంచు, మృతికారణమున్వచియించె వెక్కుచున్.

ఉ. ఒప్పనివాఁడు తాత, వినియుందువు నీవును యజ్ఞవార్త; యో
యప్ప! జగంబునన్ మెలఁగు నందఱ రాఁ బిలిపించి నిన్ సభన్
దెప్పి యగౌరవించియు సతిం బిలిపింపక మిన్నకుండె, నీ
ఘుప్పు ఘటిల్లె ; దెప్పుటికి ముం గలయీమె త్యజించె జీవమున్.

వ. అని వచించిన న మ్మహానుభావుం డాత్మవిశ్వాసాతిశయంబున నసహిష్ణుం డై మతిఁ దప్పి యి ట్లనియె.

ఉ. చెప్పుము బాగుగాఁ దెలియఁ । జేయుము, చచ్చుటయేమి? యన్న నా
యొప్పులకుప్ప యిట్లనియె ; । నోర్మి వహింపుము, నీదుమామ నిన్
దెప్పెఁ గపాలి యంచు ; విని । నీసతి ప్రాణములన్ త్యజించె ; హా
చెప్పఁగఁరానికారణము । జెప్పక తప్పనె ? యేమిసేయుదున్.

వ. అప్పలుకుల నాకర్ణించి శివుండు.

పరమేశ్వరుని కోపోద్రేకము

ఉ. హా యని యార్చి మిన్నొరిగి । యయ్యెది పైఁ బడినట్లు ; హా రమా
హా యనినేలకున్ జతికి లంబడి, చచ్చెనె మూర్ఛఁ బొందెనే
మో యని, లేదు లేదు మృతిఁ । బొందె నిజం బని, ఘోర మార నా
జాయ గతించునే యని, య । సహ్యవిషాదగతాంతరాత్ముఁ డై.

గీ. శూలముం గొని కేల నా । భీలముగను
కాలునిం బోలి యుగ్రుఁ డై । కాలగళుఁడు
భయదసంవర్తపావక । జ్వాల యనఁగ
భగ్గునన్ మండె బ్రహ్మాండ । భాండ మదర.

సీ. చెట్టురాపునఁ బుట్టి । చిటచిటార్భటిఁ గానఁ
గాల్చెడుదావాగ్ని । కణము లనఁగ
రవలిచే నెంతయుఁ । జెవులు చిల్లులువోవఁ
బుడమిపైఁ బడియెడు । పిడుగు లనఁగఁ
బురములు నశియింప । భూస్థలిఁ గంపింపఁ
గాఁ జేయు నుజ్జ్వల । కం ల్లనంగఁ
బ్రళయకాలమునందు । ప్రాణాంతకంబుగ
నుపరినుండి తొలంగు । నుల్క లనఁగ

గీ. విలయకాలమార్తాండ। మండలముఁ బోలు
హరునియత్యుగ్రవదన। గహ్వరమునుండి
బయలువెడలె భీషణరోష। భాషణులు
ధారుణీచక్ర మల్లాడి। తల్లడిల్ల.

చ. గ్రహములు సూర్యుపైనిఁ దిరు। గంబడెనో ప్రళయాంతకంబొ నాఁ
గహాకహాకంఠనాదమునఁ। గాలగళుందు త్రిశూల మూని యా
గ్రహమున ముజ్జగంబులు న। గంబు లగంబులు గూల నుగ్రవి
గ్రహుఁ డయి రేఁగి మిమఱచెఁ। గంజభవాద్యమరుల్ వణంకఁగన్.

సీ. ఔదలఁ బై కెత్తి। హా కూర్ర యనిపల్క
నంబరం బెల్ల శూ। న్యంబ యయ్యె
నక్కటా సతి యని। దిక్కుల వీక్షింప
దిగ్గజంబులుమ్రగ్గి। మొగ్గియుండెఁ
గహాకహా నాదంబుఁ। గావించి జృంభింప
బ్రహ్మాండభాండంబు। వణకఁజొచ్చె
శూలంబుఁ గేల ను। ద్వేలంబునఁ ద్రిప్పఁ
బాతాళలోకంబు। భయముఁ గొనియె

గీ. దక్షిణంబునఁ గాలుఁ డు। త్తరమునందు
ధనవిభుండు పశ్చిమమున। వనధివిభుఁడు
ప్రక్కటంబున నిందు్రండు। రక్త మింక
మ్రానుపడి తెల్విఁ దప్పిరి। మాట లేక.

వ. ఇట్లుదగ్రమహాగ్రహవిగ్రహాంగుం డై దక్షయజ్ఞంబు ధ్వంసంబుఁ గావించెదం గాక యని పంచాననాటోపంబునఁ గోపంబున మనస్తాపంబున.

ఈశ్వరుఁడు దక్షాధ్వరముఁ జూడఁబోవుట

మ. చని యుగ్రాక్షుఁడు తేఱిచూచె జ్వలనజ్వాలావళీజావేగముఁ
జనుషాంధప్రదహోమధూమలతికాసంఛన్నభూభాగముఁ
మనుజాశ్వాస్యసురాసురప్రముఖనానాసేవకాభోగముఁ
వనజాతోద్భవమాత్రితంత్రిహతసర్వచ్ఛాగముఁ యాగమున్.

సీ. ఆజ్యాహుతిసముద్గతాత్యుగ్రధూమంబు
నుజ్జ్వలజ్వలనకీలోజ్జ్వలంబు
సర్వదిక్పాలహస్తన్యస్తశస్త్రంబు
ద్వాదశార్కవిరాజితస్థలంబు
గౌతమాత్రేయభార్గవగాలవయుతంబు
శిష్టయోగీంద్రసంసేవితంబు
రాజీవనేత్రవిభ్రాజితమధ్యంబు
వనజాతగర్భవ్యవస్థితంబు

గీ. విధుకరోజ్ఝితచంద్రికావేష్టితంబు
నఖిలఖగయుతవనితాసుతావృతంబు
సర్వకవ్యవాహాదికసంచయంబు
నమ్మహాధ్వరంబును గాంచె నాహరుండు.

వీరభద్రుని యావిర్భావము

వ. వీక్షించి దక్షవంశమహారణ్యమూలచ్ఛేదకుఠార మనంగ నిటలక్రోడంబున భ్రుకుటి నటింపఁ, బలుతరకోపసంతాపసంతప్తస్వాంతుండై చటులాగ్నిజ్వాలలం గ్రక్కుచు, నిటలతటంబు నుండి ఛిటచిటార్భటి నగ్నికణపటలంబు రాల్చి, భూతలంబు భస్మీభూతముం జేయుచుఁ, జుక్కలు రాల దిక్కులుఁ గూల, సప్తార్ణవంబులు వర్ణనాతీతంబుగ ఘూర్ణిల్ల, బ్రహ్మాండకర్పరంబు ప్రతి

ధ్వని యొసంగఁ, గహకహానాదంబున రోదసీకుహరంబుఁ బూరించి, పాతాళంబును, భూగోళంబును, నంతరాళంబునుఁ బాదఘట్టనమాత్రంబునఁ దల్లడిల్లం జేయుచు, వీనియజ్ఞాంశంబు వంశంబు ధ్వంసంబుఁ జేయుదుం గాక యని కృతనిశ్చయుం డై, లలాటతటసంభవం బగు నేకస్వేదపయోబిన్దుమాత్రంబున, ననేకలోకఘస్మరవిగ్రహునిఁ, గాలాగ్నిదీప్తాంగుని, బద్ధభ్రుకుటీనిటలుని, దీప్తోర్ధ్వకేశుని, స్వపత్రికాశుని, నిటలనేత్రసంకాశుని, దీర్ఘకాయుని, విధేయుని, నజేయుని, వీరభద్రనామధేయుని సృజింప నతం డష్టాంగస్పృష్టభూతలుం డై చండీశునకు నమస్కరించి యి ట్లనియె.

సీ. నీ వానతిచ్చిన । నిమిషమాత్రంబునఁ
గంపింపఁ జేయుదు । క్ష్మాతలంబు
మృదుపుష్పకందుక।క్రీడల కైవడి
నేడుకొండల గోర । నెగుర వైతు
నేకసంద్రంబుల । నేఁడు చూచుచునుండ
రెండుగుక్కలఁ దావి । తేర్చివత్తు
ముజ్జగంబుల మూఁడు।ముద్దలం గావించి
చంగుచంగునఁ బోయి । మ్రింగివత్తు

గీ. నీపరిభావ మొక్కించుక । నెగడు నేనిఁ
గార్య మెట్టిది యైన దుష్కరము గాదు
నీదుభ్రూవల్లిసంజ్ఞ కై । నిలిచియుంటి
దేవదేవ! జగన్నాథ! । దివ్యచరిత!.

వ. అన విని క్రోధశాలి యగుశూలి, దురభిమానియు, దూషణతత్పరుండు నగుదక్షుని యజ్ఞంబు విధ్వంసంబుఁ గావింపు మనవుడు జగద్భద్రుం డగువీరభద్రుం డక్షుద్రుం డై, యపరరుద్రుం డై

మనోవేగంబునం జని యాకాశమార్గంబునుండి యధ్వరశాలం బ్రవేశించి,

దక్షాధ్వరవిధ్వంసనము

ఉ. దక్షుని, యాగకర్మచయ। దక్షుని, వందితసర్వదేవతా
ధ్యక్షునిఁ, గల్పితోరుసవ। నాగ్నిసముద్గతధూమశోభితో
గ్రాక్షుని, యక్షకిన్నరసు। రాసురగర్హితవాక్యదూషిత
త్ర్యక్షునిఁ, బూజితాంబుజద। ళాక్షునిఁ, బీనవిశాలవక్షునిన్.

మ. కని కల్పాంతమహాగ్నిహోత్రుఁ డన ను। గ్రజ్వాలలం గ్రక్కుచుఁ
గనులన్ నిప్పుల రాల్చుచున్ విబుధులం। గారించి, యయ్యధ్వరం
బును విధ్వంసముఁ జేయుచుండఁ గని యం। భోజాక్షుఁడున్ జక్రముం
గొని శిక్షింబుగ వీరభద్రు గవిసెన్। గోపంబు దీపింపఁగన్.

ఉ. చూచుచునుంటి రేమి యిది। చోద్యముగాఁ గనుపట్టె నేమొ? సం
కోచముఁ దక్కి శిక్షిముగఁ। గ్రొల్చులిఁ బోలినవీరభద్రునిన్
లాఁచివధింపు డాయుధము। లం గొనిరం డని దక్షుఁ డుగ్రుఁడై
లేచి మహాసురాదుల నిలింపుల నెల్లరఁ బంపె నాజికిన్.

వ. అంత వీరభద్రుండు వీరావేశంబున,

ఉ. కార్యము మించివచ్చె నని। కన్నులు మిక్కిలి జేవురింపఁగన్
గ్రౌర్యమునం జెలంగి వద। నంబున రౌద్రము తాండవింపఁగన్
స్థైర్యముఁ బాదుకొల్పి సుర। సంఘము భీతిలి విచ్చి పర్విడన్
శౌర్యముఁ జూప శౌరి రథ। సంబునఁ బట్టెఁ జతుర్భుజంబులన్.

వ. అట్లు వీరభద్రుం బట్టినకంజాక్షుని ఫాలాక్షుండు నీక్షించి, శిక్షిం చెదం గాక యని క్రోధసంరక్తాక్షుం డై, యఃక్షుద్రరౌద్రగసోద్రేకం బున నై మఱచి ముఖమండలంబున సమర్షంబు వర్షింప, ఘోర విస్ఫారోష్ణా తిశయమునఁ బ్రస్ఫోటితం బగునగ్నిపర్వతంబుం బోలి,

మ. ప్రళయార్కోదయకాల మై వెలుఁగ నేత్రజ్వాల, లాస్యంబు ప్ర
జ్వలితం బై బహుభీకరం బయి యవాచ్యం బై ప్రకాశింప, దృ
క్కులు నల్దిక్కుల నాక్రమింపఁగ, వడిన్ ఘోరాకృతిన్ యోగభూ
తలముం జొచ్చి పరాక్రమించె రిపుదుర్ధర్షప్రతాపోన్నతిన్.

సీ. రిపుభీకరక్రోధవృక్షమూలము లన
జీబుగ జడలెల్ల జీరులాడ
నాత్మసంజనితకోపాగ్నిహోత్రము మీఁది
నిగుడన మైబూది నేల రాల
ఫాలాగ్నిహోత్రంబు ప్రజ్వలింపఁగఁ జేయు
పవన మై నిట్టూర్పు బయలు వెడల
సిందూరముం బోలి జేవురించిన మోము
దిక్కులఁ గెంజాయఁ బుక్కిలింప

గీ. భుస్సు రని త్రాఁచు లాభోగభోగములను
విప్పి ఘోరవిషాగ్నులం గుప్పుచుండ
భీషణుం డయి వాసుకిభూషణుండు
చండతాండవపాండిత్యసరణిఁ జూపె.

వ. అంత దక్షుండు పత్నీసమేతుం డై యదృశ్యుం డయ్యె. వాణీ
సహితుం డై బ్రహ్మ యగోచరుం డయ్యె. కార్యంబు విషమించె
నని శ్రీవిష్ణు వంతర్హితుం డయ్యె. పంచాననముం గాంచినమృగ
బృందంబు చందంబున యక్ష కిన్నర గంధర్వ సిద్ధ సాధ్య విద్యా
ధరాదిపరిజనంబు పంచబంగాళ మయ్యె. సురసమూహంబు
మాత్రంబ, సవనాగ్నిహోత్రంబుఁ గాపాడుచుండం గాంచి,

చం. గిర గిరఁ ద్రిప్పి శూలమును గిన్క నదల్చుచుఁ దల్లడిల్లు నా
సురల నెదుర్పఁగన్ దిశలఁ జూచుచు వారలు కాందిశీకు లై

పరువిడ వెన్కకుఁ మఱలి । వహ్నియుతుం డగుయజ్ఞపూరుషున్
హరుఁడు వధింపఁ బోవఁగ మృ।గాకృతిఁ దాల్చి యతండు పర్వెడెన్.

ఉ. ఎచ్చటికేగినన్ విడువ । నెమ్మెయిఁ జంపెదఁ దప్ప దంచు నా
చిచ్చఱకంటి వెన్కొనఁగఁ । జిత్రగతిన్ బరువెత్తి యెట్టులో
చెచ్చెర నాసతీశవము । చెంతకుఁ జేరి యదృశ్యుఁ డయ్యె, నా
చచ్చినప్రేయసిం గని వి।షాదహతుం డగు నంచు నెంచుచున్.

గీ. సతిని వీక్షించి తన్ను వి।స్మృతినిఁ జెంది
యమితదుఃఖహతుం డగు।హరునిఁ గాంచి
బ్రదుకుజీవుఁడ యంచు నె।మ్మదిఁ దలంచి
యజ్ఞపురుషుం డదృశ్యుఁ డై । హరినిఁ జేరె.

సతింగూర్చి పశుపతి విలపించుట

మాలిని. సురనుతగుణశీలన్ । సూక్ష్మమధ్యానువిద్ధన్
అరుణదశసవస్త్రన్ । హావభావప్రసిద్ధన్
సురుచిరకమలాస్యన్ । జూచి చింతించి యాత్మన్
ఖరతరపృథుశోకా।కారుఁ డై శూలి యేడ్చెన్.

సీ. అశనిపాతాహత।మాంసిమో యన మేను
ప్రాణశోభాదరి।ద్రాణ మొందె
సౌందర్యలక్ష్మికి । సదన మౌ వదనాంబు
జంబున జీవతే।జం బణంగె
మనమునఁ గల నీదు।ననురాగపుంజంబు
చరమరాగంబున । సంగమించె
మేనుసొంపుఁ దొఱంగి । మృత్యువార్ధినిఁ గ్రుంగఁ.
గాలుసేతులుఁ గల్వ।కాడ లయ్యెఁ

గీ. బ్రాణ మనియెడురవిబింబ । మస్తమింప
గాత్ర మనునట్టిలోకంబు । కనుల మోడ్చె

దైన్యమున నాదుజన్మంబు । శూన్య మయ్యె
బాల మాటాడఁ జాలవా । తాళఁజాల.

సీ. చంద్రాస్య నీముఖ।చంద్రబింబస్ఫూర్తి
చంద్రబింబమునందు । స్థలముఁ గొనియెఁ
పద్మాక్షి నీమనః।పద్మానురాగంబు
పద్మరాగంబునఁ । బాదుకొనియెఁ
ప్రాణేశ్వరీ నీమః।ప్రాణజగత్ప్రాణ
మాజగత్ప్రాణము । నైక్య మొందె
సదయాంతరాత్మ నీ।హృదయాంతరాత్మ యా
పరమాత్మయందున । నిరవుకొనియె

గీ. నీకుమే నొంతుమాత్రంబు । నేను జూడ
శేష మై యుండె, సర్వంబు । సృష్టియందు
లీన మై కానరాకుండె ; । జ్ఞానపథముఁ
దాఁటఁగితిఁ నినుఁ బాసితిఁ । దుట్టతుదకు.

సీ. కలకంఠమాధురీ।గరిమఁ గేరెడుముద్దు
పలుకులఁ బరభృతం।బుల కొసంగి
గంధసామజమంద।గతిఁ గేరు నతులగ
తులసొంపు హంసకాం।తల కొసంగి
మరుపూవుఁదూపుల । నిరసించువాలుఁజూ
పులపెంపు లేడిక।న్నెల కొసంగి
మోహాంధకారంబుఁ । బుట్టించువిభ్రమం
బుల మరుచ్చలితల।తల కొసంగి

గీ. నిర్దయుం బూని నాయెడ । నెనరు విడిచి
కట్టియం బోలునీమేను । కట్టకడకు

శోకమున కాస్పదంబుగ నా కొసంగి
పలుకరింపక యసువులఁ బాసి తివు.

మ. అపరాధం బొనరించె నీజనకుఁ డో ప్రాణేశ్వరీ ! నీకు నే
నపరాధంబును జేసియుండ నెపుడున్ ; హా నన్ను శిక్షింప నా
కపకారం బొనరింపఁ బాసితివి నీప్రాణంబులన్ ధర్మమే
చెప్పుమా ? నీదువియోగదుఃఖమున నాజీవంబు లర్పించెదన్.

గీ. భూతపతి పశుపతి యని పొగడుకంటె
నను సతీపతి యనుచుఁ దిట్టినను మిగుల
సంతసించెద నాప్రాణకాంత వగుట
నట్టి నన్నిట్టు లెడఁబాసి తబల చెపుము?.

గీ. పేర్మి దైవాఱఁగన్ నీవు పెనుపఁ బెరిఁగి
సుమములన్ ఫలములఁ గోరకముల నొసఁగు
భూరుహంబులు తుహినబాష్పముల విడిచె
నీవు మరణించుటం గాంచి యేడ్చునట్లు.

గీ. నేత్రముల మోడ్చి మరణించు నిన్నుఁ గాంచి
నాశనం బయ్యె నేత్రసౌందర్య మనుచు
నీమృగీబృంద మత్యంత మేడ్చుచుండెఁ
గనుల విచ్చి వీక్షింపు మో కమలపాణి!.

గీ. అనిలచలితంబు లగునీదు నలకలఁ గని
ఈవు బ్రదికియుండినయట్లు తెంచుచుంటి
మరణమో లేక మూర్ఛయో యరయకుంటి
నాదుసందేహముం దీర్ప రాదె యబల?.

గీ. శర్వరియుఁ జక్రవాకియుఁ జంద్ర చక్ర
వాకములఁ బాసినం జాయుఁ గాక, మగుడఁ

గలసి సుఖియించునిర్దిష్ట। కాలమునకు
నీకు నా కట్టిభాగ్యంబు । లేకపోయె.

గీ. మునుల మోహింపఁ గాఁ జేయు।కనుల విచ్చి
పలుకరించినఁ జాలు నో।కలికి! నాదు
దుఃఖ మంతయు వ్రేల్మిడిం । దొలఁగిపోవు
మధురగానంబుచే మనో।వ్యథను బోలి.

గీ. తరుణి! నాయనురాగంబుఁ । దలఁపకుండ
జనకుఁ డెగ్గాడె నని యెంచి । చచ్చి తీవ్ర
ప్రాణిలోకంబుఁ గబళింప।వలయు ననిన
హేతు వెట్లు లభింపదు । మృత్యువునకు.

గీ. ఈవు మరణించుటకుఁ దాడి । హేతు వనిన
విశ్వసింపఁగఁ జాలను । వీస మైన
నే జయించిన కతమునన్ । మృత్యుదేవి
పగను సాధించె నినుఁ జంపి । పంకజాక్షి!.

గీ. స్నానమున్ జేసి నవ్యపు।ష్పములఁ బూని
యడుగు పెట్టినయంతనే । పిడుగు పడియెఁ
బాష్పములతోడ నేఁడు ని।వాపవేళఁ
బుష్పముల నీకొసంగెదఁ । బూవుఁబోణి!.

గీ. ఈవు మాటాడ వనుచు నే । నేడ్చుచుండ
వ్యాఘ్రకంఠీరవాదిస।త్త్వంబు లెల్ల
కంటతడిఁ బెట్టెఁ గ్రూరమృ।గంబు లయ్యు
సుదతి దయ లేదె? క్రేగంటఁ । జూడరాదె?.

గీ. సానురాగి నై నేఁ గుంది।నంతఁ దాను
సానురాగి యైయుంట నీ।శైలవిభుని

స్వాంత మిపుడు ద్రవీభూత । మై స్రవించె
నీదుచిత్తంబు కరఁగదు । నీరజాక్షి!.

ఉ. కైతవవత్సలుండనో? వి। కారమనస్కుఁడనో? శఠుండనో?
నాతగులంబు సైఁపక మ। నంబున నెంతయు నేవగించితో?
నాతరమా? సహింపఁ గల। నా? లలనా! కలనాదకంఠి! హా!
హా! తరుణీమణీ! వికసి। తాంబురుహేక్షణ! నన్నుఁ బాసితే?.

ఉ. నీ మొగముం గనుంగొని క। నీనికలం జెదరంగనీక యు
ద్దామవియోగదుఃఖమునఁ । దద్దయుఁ దల్లడ మొందుచుండ నా
క్షేమముఁ గోర వేమియు వ। చింపవు నాదుఋణంబు దీఱెనా
కోమలి? నీమనఃప్రియుని। ఘోరవిషాదము మాన్పఁ జాలవే?.

మ. అని యీరీతి సతీవియోగమున ఫా। లాక్షుండు శోకించుచుం
గనకాలంకృతులం మణిస్థగితము। క్తాహారహీరంబులం
గని, మంజీరములం గనుంగొని యమాం। గళ్యంబు లయ్యెం గదా
వనితా యందు వచించుచు న్గనుఁగవ। న్బాష్పంబులం గ్రుక్కుచున్.

సీ. వల వల యేడ్చుచు । విల విలఁ దన్నుచు
భూమిపైఁ బొరలుచు । మొత్తుకొనుచు
దిక్కులం జూచుచుఁ । బొక్కుచు వెక్కుచు
నక్కటా చక్కని। చుక్క యనుచుఁ
జెట్టుచాటున డాఁగి । చెలువ రావే యంచు
వాయువేగంబునఁ । బరువు లిడుచు
నదిగో ముద్దులగుమ్మ । యిదిగో చిల్కలకొల్కి
యంచు భూమిం గౌఁగి। లించుకొనుచుఁ

గీ. గెవ్వు మని యార్చి వెండియు । నవ్వుకొనుచుఁ
తళుకు లీనెడు చెక్కుట। ద్దంబు లనుచు

సుద్దు లాడుచు సతిఁ గాంచి । ముద్దు గొనుచు
దీనుఁ డైయుండె మతిఁ దప్పి । తెలివిఁ దక్కి.

మ. హరుఁ డయ్యు న్మునిలోకసన్నుతతపో।వ్యాపారుఁ డయ్యు న్దమో
హరుఁ డయ్యు న్పటుమోహసంజనితమా।యస్ఫూర్తి లేకుండఁ బా
మరునిం బోలి సతీవియోగమున కి।మ్మై డిక్కు లన్ విలాపించెడున్
నరుఁ డెవ్వాఁ డు తరింపఁ జాలు భువి న।జ్ఞానోగ్రమాయాంబుధిన్.

వ. వినుం డట్టిసమయంబున,

గీ. భ్రష్టచేతను, సంకీర్ణ।భావు, శోక
వివశు, వేదనావిలచిత్తు, । విశ్వనాథుఁ,
గాంచి యసహాయశూరుఁ డై । పంచశరుఁడు
పంచ బాణంబులన్ బ్రయో।గించి నొంచె.

దేవతలు శనైశ్చరుం బ్రార్థించుట

వ. అక్కాలంబున నమ్మహానుభావుం డు ముమ్మరం బగుశోకంబున, బాష్పంబులం దొప్పఁదోఁగి కుందుచుండ, నా బాష్పంబులు భూతలంబునం బడిన, భూతలంబు భస్మీభూతం బగుననియు, సృష్టి కరిష్టంబు సంభవించు ననియు భీతిల్లి బ్రహ్మాద్యమరులు తల్లడిల్లి యుపాయంబు నన్వేషించువార లై సత్వరగమనంబునం జని, శనైశ్చరుఁ గాంచి, "లోకానుగ్రహకారక, మూలశక్తిసముద్భూత, సూర్యసంభవ, శూలహస్త, పాశహస్త, నమస్తే నమస్తే" యని యనేకవిధంబులం గొనియాడి యి ట్లనిరి.

చ. సతి గతియించె, నెంతయు వి।షాదహతుం డయి యీశ్వరుండు సంతతమును గుందుచుండె, మతిఁ।దప్పెఁ గనుంగవనుండి బాష్పముల్
క్షితిఁ బడు నేని ఘోరముగ । సృష్టి కరిష్టము సంభవించు న
క్షతమున వానిబాష్పములఁ । గ్రక్కునఁ ద్రావవలెన్ శనైశ్చరా!

గీ. సూర్యునిసుతుండ వీ వనివార్యముగను
శంభుకన్నీటివేండ్రింబు నైఁపఁగలవు
ఇతరు లిక్కార్యమును నిర్వహింపఁ జాల
రీవ కాపాడవలె లోకహితముకొఱకు.

చ. మును పాకమాఱు నిర్జరవిభుండు మహోద్ధతిఁ బుష్కరాదులన్
బనిపి ధరాస్థలిన్ సకలవారిధు లేక మొనర్చుచుండ మా
వినతుల నంది వాని యతివృష్టిని సర్వము నీవు త్రావవే?
జనములఁ బ్రోవవే? యిపుడు నైతము లోకముఁ గావకుందువే?.

వ. అనిన శనైశ్చరుం డిట్లనియె.

చ. అఱపదిమోములుం గలమహామహుఁడాతఁడు ఫాలనేత్రముల్
దెఱచిన భస్మ మౌదుఁ గడుఁదెంపు వహించినఁ గీడుమూడు, మీ
రెఱుఁగరె? నేను భీతిలిన సృష్టి కరిష్టము సంభవించు నే
తెఱఁగున నైన మీరలు విధించినకార్యముఁ జేయఁగావలెన్.

### శనైశ్చరుం డీశ్వరుని బాష్పంబులం ద్రాగుట.

వ. అని వచించి బ్రహ్మాద్యమరుల వీడ్కొని యోగమాయాంకరుణా ప్రసాదసమ్మోదితభావుం డై నిజపరిభావంబు దీపింప నంతర్హితుం డై మూర్తీభవించిన దుఃఖసాగరముం బోనివాని నీశ్వరునిఁ గాంచి సమీపించి కటకటం బడి యిట్టివాని కింతటిదుఃఖం బొప్పునే యని చింతించుచు,

గీ. సృష్టి నఖిలంబుఁ గంపింపఁ జేయు వహ్ని
ధరశిరోవినిర్గతశిలాద్రవముభంగిఁ
గనులఁ గన్నీరు మున్నీరుగా స్రవించు
చుండ నంజలిం గొని త్రాగుచుండె నతఁడు.

ఈశ్వరుని బాష్పంబులు వైతరణీనది యై ప్రవహించుట

వ. ఇట్లాశ్వేశ్వరుం డంజలిపుటంబులం బాష్పంబుల నెల్లం గొని త్రావి సైరింపఁ జాలని వేఁడ్రంబున, వికారస్వరూపుం డై, మై మఱచి వెఱచఱచి యెట్టకేలకు లోకాలోకనికటంబున కేగి యనంతరము పశ్చిమసాగరసమీపంబునం బుష్కరద్వీపపృష్ఠ భాగంబునం గలజలధారాహ్వయగిరిపై నాబాష్పంబుల వెడలం గ్రక్కి యొడలు మఱచి, 'హా' యని యఱచి మూర్ఛిల్లె. అంత నాబాష్పంబులు పర్వతమధ్యభాగమును దరీభూతముం జేయుచు భేదించుచు వెడలి కడలిం జేరుకొనియె.

గీ. అతిభయంకర మగుబడ। బానలమును
సంతతంబు భరించు నా। సాగరంబు
శంభు కన్నీటివేఁడ్రంబు । సైఁపలేక
తుంగభంగంబులం గొని । తొలఁగఁ ద్రోచె.

వ. అంత నాబాష్పసందోహంబు సముద్రసంపర్కంబున నించుక శైత్యము వహించి, పుష్కరద్వీపమధ్యభాగంబునుండి వైతరణి యనుపేర నదీరూపంబున యమపురద్వారంబుఁ బ్రవేశించి పాపాత్ముల శిక్షించుచుఁ బ్రవహించుచుండె. అనంతరమున,

సతీదేవి యవయవపతనము

ఉ. శోకవిమూఢచిత్తుఁ డయి । శూలి సతీశవమున్ భుజంబులన్
గైకొని దేశదేశములఁ । గాంచుచుఁ గుందుచుఁ బోవుచుండ నా
కౌకసు లెల్లరున్ విధియు । నంతట నాతనికుందు మాన్ప నె
ట్లో కద యంచుఁ జింతిలుచు । నుండిరుపాయము లేనివార లై.

గీ. కాలగళుదేహసంస్పర్శ। కారణమున
నవయవంబులు నశియింప । కట్లయుండె

శవము వీక్షించుచుండ నీశ్వరున కెట్లు
పొంగి మితి మీఱుదుఃఖ మణంగఁ గలదు?.

వ. అక్కతంబున బ్రహ్మాద్యమరులు వెండియుఁ జింతించి శనైశ్చరుఁ బ్రార్థింప నతండు శవంబునం బ్రవేశించి యవయవంబుల సడల్చుచుండఁ గ్రమక్రమంబున దేవీకూటంబునందు పాదయుగ్మంబు, నుడ్డియానంబునం దూరుయుగ్మంబుఁ, గామరూపదేశస్థ కామగిరియందు యోనిమండలంబుఁ, దత్పూర్వభాగంబున నాభిమండలంబు, జాలంధరకుధరప్రదేశంబున స్వర్ణహారవిభూషిత స్తనయుగళంబుఁ, బూర్ణగిరిశిఖరంబున గ్రీవంబు, భూపతనముం బొందె. శేషించినయవయవంబులు పవనేరితంబులై సురలచే నాకాశగంగాంబుపూరలయందు సంమిళితంబు లయ్యె. సతీస్నేహవశంబున మోహసంయుక్తుండై, శంభుం డేయేదేశంబులం దేయేయవయవంబులు బడియె నాయాదేశంబుల లింగస్వరూపి యై యుండె. అనంతర మాయాదేశంబులు దివ్యక్షేత్రంబులై కీర్తిపాత్రంబు లయ్యె. ఉడ్డియానంబునఁ గాత్యాయని యనియుఁ, గామరూపదేశంబునఁ గామరూపిణి యనియుఁ, బూర్ణగిరియందుఁ బూర్ణేశ్వరి యనియు, జాలంధరధరాధరంబునఁ జండి యనియు నాసతీదేవి పరికీర్తిత యయ్యె. వినుం డనంతరమున,

గీ. వృంతవిగళితనీలారవింద మనఁగ
నంబరముఁ దొలఁగినచంద్రబింబ మనఁగ
భార్యయౌదల భూమిపైఁ బడినయంత
నచటఁ గూర్చుండెఁ గుందుచు నాహరుండు.

## బ్రహ్మాదు లీశ్వరుని స్తుతించుట

చం. ఖరతరదుఃఖభారమునఁ గాలగళుం డటు లేడ్చుచుండ నా
సరసిజగర్భుఁడుఁ సురలుఁ జయ్యన నచ్చటి కేగి యీవ యి

ట్లురక సతీవియోగమున । కోపక కుందిన లాభ ముండునే ?
హర హర యూఱడిల్లు మన । నాతఁ డగోచరుఁ డయ్యె లజ్జచే.

వ. బ్రహ్మాద్యమరులు, "రుద్రాయ, ఉగ్రాయ, వృషధ్వజాయ, శివాయ, శాంతాయ, జటిలాయ, గిరీశాయ, ఆదిమధ్యాంతభూతాయ, జ్వాలామాలావృతాంగాయ, స్వభావానలదీప్తయే, లింగమూర్తయే నమో నమోస్తు ప్రసీద ప్రసీద"యని యనేకవిధంబుల సన్నుతించిన నమ్మహానుభావుండు శోకంబు మూర్తీభవించినట్లు ప్రత్యక్షంబుగ నిలచిన నంభోజసంభవుండు ప్రణమిల్లి యిట్లనియె.

సీ. విశ్వేశ్వరుండవు । విశ్వంభరుండవు
విశ్వాత్మకుండవు । విశ్వవినుత !
ఈవు దుఃఖించిన । సృష్టియు దుఃఖించు
శోకంబు విడువుము । లోకనాథ!
జ్ఞాననేత్రుండ వజ్ఞానతమోభాస్క-
రుండవు, మాయ నెఱుంగు దీవు
అఖిలంబు మాయచే । నాచ్ఛాదితం బయ్యె
మృత్యువు లేదెందు । సృష్టియందు

గీ. శాశ్వతము గానిదేహంబు । క్షయము నొందు;
నేక మై యుండుజీవాత్మ । యీవ చూవె,
ఓపికం బూని యించుక । యూఱడిల్లు
మఖిలము నెఱుంగఁ జాలుదు । వలికనేత్ర!.

వ. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులు, విచికిత్సా కృపాసూయాజుగుప్సతాశోకంబులు, మాయావశంబున జీవులఁ బీడించుచు బుద్ధినాశహేతువు లగుం గావె. భవచ్ఛోకనిశ్వాస వాయువులచే లోకంబులు పీడింపఁబడుం గావున శోకామర్షంబు

లం ద్యజింపవలయుం జూవె. వెండియు నాసతీదేవి త్రేతాదిని నీకు భార్య యగు విచారింపఁ బని లే దనిన శాంతించి భవుం డిట్లనియె.

ఈశ్వరుండు ప్రసన్నుఁ డగుట

గీ. అంబుజభ్రూణ! నీదువాక్యములవలన
ఖేదము నశించె, శోకాపనోదనంబు
చేయుచుండుము నన్నెడఁబాయకుండఁ
గొంతకాలంబునకు నైన వంత దీఱు.

గీ. అట్ల యౌఁ గాక యనియె నాయబ్జభవుఁడు
సురలుఁ బ్రమథులు సన్మునీశ్వరులు గొలువ
బ్రహ్మయు మహేశ్వరుఁడు హిమవన్నగంబు
పొంత కేగిరి జగములు సంతసింప.

వ. విశ్వేశ్వరుండు సమీపించు నని యెఱింగి యన్నగవిభుం డెన్నఁగ రాని మహోల్లాసంబున, నోషధిప్రస్థ మనియెడునిజనగరంబు వెడలి యెదుర్కొని యెల్లరమనంబుల సంపూజనంబుల నలరించి నిజనగరంబునకుఁ దోడ్కొని చనియె. అనంతరమున,

గీ. హరుఁడు నంభోజసంభవాద్యమరు లెల్ల
నోషధిప్రస్థనగరంబునుండి వెడలి
జలరుహాసుగంధవాసితాఖిలదిగంత
మునకు సిప్రసరఃప్రాంతమునకుఁ జనిరి.

సిప్రసరోవర్ణనము

మ. చని మున్ గాంచిరి సంయమీశ్వరతపస్సాఫల్యవాఃపూరమున్
వనభూభాగవినిర్గతానిలచలద్భృంగాతిగంభీరమున్
ఘనపాఠీనశిలీధులీమకరనక్రగ్రాహసంసారమున్
వనజేందీవరగంధసారమును సిప్రఖ్యాతకాసారమున్.

## సిప్రానదీవర్ణనము

వ. వెండియు నఖిలతటస్థకాదంబసారసహంసశ్రేణీవిరాజమానం బై, శంఖాలంకృతతీరముం గలయకూపారముం బోలి, గంభీరపవనోత్తుంగతరంగమృదంగనిస్వనంబులకు నర్తించు కోకద్వంద్వంబుచే నాట్యరంగంబుఁ బోలి, మహామీనాహతక్షుభితపక్షిపక్షవిక్షేపణోద్భూతవాతోద్ధూతకంజాతదళవ్రాతంబుచేత నిపతితావయవసంకీర్ణరణరంగంబుఁ బోలి, పృథురోమఝషవైసారిణగండకాదిక్షుద్రమీనసంకులం బై, తిమితిమింగిలపాఠీనశింశుమారకుంభీరగ్రాహసమూహవిరాజితం బై, శిలీధుళీకుళీరశాలూరసంచారతీరం బై, యపారం బైనపారావారముం బోలి, ప్రఫుల్లకల్హారకైరవేందీవరపుండరీకకోకనదజన్మస్థానమై స్థూలసూక్ష్మకనక్షత్రచిత్రితగగనంబుఁ బోలి, నీలోత్పలసందోహశ్యామీకృతజలం బై యమునం బోలి, పుండరీకషండధవళితస్వచ్ఛజలం బై గంగానదిం బోలి, సిప్రసరోవినిర్గతం బై సుప్రసిద్ధంబుగ శీఘ్రగతిం బ్రవహించుసిప్రానదిం గాంచి, యెల్లరు నమందానందాతిశయంబున మై మఱచి తత్తీరంబున యథాన్యాయంబుగ, మహేశ్వరుం బురస్కరించుకొని యుపవిష్టు లైరి.

గీ. అబ్జసంఘాతమధ్యస్థ। హంసములను
గాంచి వికసితపుండరీ। కంబు లనుచుఁ
దునుమఁ బోయినప్రమథునిఁ। గని హసించె
హంసరథి యైనపుండరీ। కాసనుండు.

గీ. పొంత నలరు నల్లగలువ। పొలుపువలన
నీలఖచితవ్రజం బను। లీల చాలఁ
గ్రాలుసంఫుల్లపుండరీ। కంబుఁ గాంచి
హరుఁడు మాళీందుకాంతిని। పరిహసించె.

గీ. అన్నదీమధ్యమున నీఁదులాడుహంసఁ
గాంచి తోషించి కాంక్షించెఁ గంజభవుఁడు
భృంగసంగతధవళారవిందముఁ గని
హరుఁడు రాకాశశాంకునిఁ బరిహసించె.

గీ. గగనకీర్ణనక్షత్రసంఘంబుఁ బోలి
క్రాలుధవళాంబురుహకోరకములనడుమఁ
దనరుఫుల్లనీలోత్పలతండముఁ గని
కాండముఖండ మనియె నాఖండలుండు.

సీ. పద్మినీపద్మాతపత్త్రసమీపస్థ
హంసలసౌభాగ్య మభిలషించి
తుంగతరంగమృదంగరావములకు
నర్తించుకోకబృందంబుఁ గాంచి
కల్హార కైరవ కమల నీలోత్పల
సందోహ మీక్షించి సంతసించి
తీరస్థసరళభూమీరుహసుమరజో
వాసితజలములఁ బ్రస్తుతించి

గీ. ప్రకృతి కామినీసౌందర్యవైభవంబు
నెంచి దుఃఖంబు మఱచి మహేశ్వరుండు
కొలువు కూర్చుండ సుమములఁ గొల్లలాడి
గంధములఁ దెచ్చి వెదచల్లె గంధవహుఁడు.

## సిప్రానదీవృత్తాంతము

వ. అని యిట్లు వచించి యమ్మార్కండేయమునీంద్రుండు శమకాది మునీంద్రులకు సిప్రానదీవృత్తాంత మిట్లు చెప్పం దొడంగె.

చం. వినుఁడు మునీంద్రులార! పృథివిం గలసన్మునికోటికిన్ మహా
మునివరుఁ డావసిష్ఠుఁడు తపోమహిమాఢ్యుఁ డతం డరుంధతీ

వనితను బెండ్లి యాడఁగ వి। వాహపవిత్రజలప్రవాహ మి
ట్లనుపమలీల జీవనది। యై ప్రవహించుచునుండె నేఁటికిన్.

సీ. సుప్రసిద్ధం బైన। సిప్రాహ్వయసరస్సు
సృష్టించెఁ బూర్వము। సృష్టికర్త
అతనిమానసపుత్త్రుఁ। డైనవసిష్ఠుని
వైవాహికాంబుప్ర। వాహ మవని
పరమ మై మానస। గిరినుండి ప్రవహించి
సాగరోపమసిప్ర। సరసిఁ జేరి
వెండియు నటనుండి। వెడలి సిప్రానదీ
విఖ్యాతి వహియించి। వినుతిఁ గాంచి

గీ. సంగమించె నాదక్షిణ। సాగరమున
మనుజమాత్రుఁ డాసరసినిఁ। గన నశక్తుఁ
డిన్నదీతటంబున యక్షు। కిన్నరాదు
లనిశము మెలంగుచుండ్రు వా। హ్యాళిలీల.

అరుంధతీ వసిష్ఠ వివాహవృత్తాంతము

మ. మును పుష్పాస్త్రుని పుష్పబాణములకు। న్మోహించి కామార్తుఁడై
తను ప్రేమించిన నబ్జసంభవుఁడు; సం। ధ్యాదేవియున్ వానిపై
ననురాగంబు వహించె; నంత శివుఁ డ। త్యంతంబు దూషింప లో
ననుతాపంబు వహించి యావనిత ప్రా। యశ్చిత్తముం గైకొనెన్.

గీ. స్వాభిమానంబు విడిచి మ। ర్యాద విడిచి
దూష్యముగ నే నొనర్చిన। దోషమునకు
తపముఁ గావించి తొలఁగించి। యపయశంబు
వేదమార్గపద్ధతి మేను। విడువఁ దగదె ?.

గీ. అతివలకుఁ దలమానికం। బనఁ దనర్చి
ముజ్జగంబుల సత్కీర్తిఁ। బొందలేని

కాంతజన్మంబు జన్మమే ? కాకిఁ బోలి
బ్రదుకవచ్చును వేయేండ్లు పరువు విడిచి.

గీ. శివుఁడు దూషించె ననుచు లజ్జింప నేల?
చంద్రభాగాద్రి కేగెద జగమునందు
లేనివిఖ్యాతిఁ బడసెద తేబరముగ
బ్రదుక నేటికి ధాత్రికి భారముగను.

గీ. అనుచుఁ జింతించి సత్వర యానమునను
చంద్రభాగానదీయుత చంద్రభాగ
గిరి నధిష్ఠించి యామె మిక్కిలి రహించె
సంధ్యఁ బూర్వాద్రి నుదయించు చంద్రుఁ బోలి.

చ. "నిజముగ సంధ్య సాధ్వియ, త్రినేత్రునివాక్యము లాలకించి చి
త్తజుఁ బొనరించుదుష్కృతికిఁ దద్దయుఁ గుందుచు నేగె" నంచు నా
యజుఁ డపు డెంతయు న్దలఁచి యాత్మఁ గడుంగడు నారటించి యా
త్మజుని వసిష్ఠునిం బిలిచి దగ్గఱి యిట్లనె నాతురంబునన్.

సీ. అలికనేత్రునియట్టహాసంబునకు నాఁడు
మందాక్షమై సంధ్య కుందెఁ జూవె
అపకీర్తిఁ బాపఁగఁ దపముఁ గావింపఁగఁ
జంద్రభాగాద్రికిఁ జనియె నిప్పు
డనుతాపముం బూనె నారాటముం బొందెఁ
బ్రాణంబులను నైనఁ బాయఁ దలఁచెఁ
దపముఁ గావించుపద్ధతి నెఱుంగదు పాప
మధికఖేదంబున నచటి కేగెఁ

గీ. చంద్రభాగాద్రి కేగి యా సంధ్యఁ దఱిసి
వరతపశ్చర్యఁ దెలుపఁగ వలయు నీవు

నీదునిజరూపముం గాంచి । ఖేద మొందు
నక్కతంబునఁ బొమ్ము రూ।పాంతరమున.

గీ. అనిన విని వసిష్ఠుండు స।న్మునివరుఁడు
కపటవర్ణి యై చంద్రభా।గమున కేగి
పొంత వీక్షించె సౌరభా।క్రాంతపవన
లోడితతరంగ మగుబృహా।ల్లోహితంబు.

వ. క్రమక్రమంబుగ నతఁ డాబృహాల్లోహితసరోవరంబును సమీపించి,

గీ. తీరగామిని యైనయా।తెఱవఁ గాంచి
జలజకైరవమండిత।సరసిఁ గాంచి
ఓషధీశోడుసహితప్ర।దోషసమయ
గగనమున నెంచె మోదంబు । గడలుకొనఁగ.

వ. మఱియు,

గీ. ఆసరసినుండి ప్రవహించి । యమ్మహాద్రి
సానువుల మీఱి దక్షిణ।సాగరమునఁ
దుంగభంగసంపూర్ణ యై । సంగమించు
చంద్రభాగానదిం గాంచి । సంతసించె.

వ. అంత నాకమతాదిమహర్షు లమ్మార్కండేయుం గని మహానుభావ ! చంద్రభాగాద్రివృత్తాంత మెట్టిదియో యానతి మ్మనిన నతం డిట్లు చెప్పం దొడంగె.

చంద్రభాగోపాఖ్యానము.

ఉ. జక్కవసూఁడు దక్షతను।జాతలఁ జక్కనిచుక్క లంచుఁ బెం
పెక్కినయట్టిముద్దియల । నిర్వదియేడ్వురఁ బెండ్లి యాడె ము
న్నెక్కుడుప్రేమ రోహిణిప।యిం గడు నెక్కొనె నక్కతంబునన్
దక్కటివారలన్ విడిచె । దక్షుఁడు మిక్కిలి యాగ్రహింపఁగన్.

గీ. విధువు విఁగిలినవారలన్ । విడిచినంత
గోలు గోలున నేడ్చుచు । జాలిఁ దూలి
చాలకాలంబుదనుక నా।శశి వియోగ
తాపమునఁ జిక్కియుండి రా।తరుణు లెల్ల.

సీ. తైలసంస్కారంబుఁ । దప్పిననీలకే
శంబులు మోహపా।శంబు లనుచు
భూరిసౌరభయుక్త।పుష్పహారంబులు
భయదవిషో।గ్రస।ర్పముల యనుచు
ధవళకాంతుల నీను।ధౌతవస్త్రంబు ల
సహ్యంబు లైవకూ।సంబు లనుచు
ఘనసారమిళితచం।దనలేపనాదులు
పొక్కించుచున్నము।పూఁత లనుచుఁ

గీ. జెఱఁగుమాసినయంత ల।జ్జించి యితర
పురుషలోకవిలోకన।ముం దొలంగి
గడియ యొకకల్పముగ వారు । గడపుచుండ్రి
యువతు లట్లుండ వలదె వి।యోగమునను.

వ. ఇట్లాశశాంకవదన లిర్వదియార్వురు వియోగానలసంతప్తచిత్త లై యొక్కనాఁడు,

ఉ. ఎక్కడ లేనిఘోరమున । కీతఁడు పూన్కొనె దిక్కు లేదె మా
కక్కట భర్త యై తగుల । మాఁ ఱడిపుచ్చె శశుండు, రోహిణిం
దక్క మముం గనుంగొనఁడు । తాళఁగ శక్యమె? వార లుండునా
చక్కటి కేగి పైఁ బడుటె । చక్కటి యంచుఁ దలంచి రెల్లరున్.

మ. అని యిట్లిర్వదియార్వురుం గలసి య।త్యంతా।గ్రహోద్రగ లై
అనఁతాపానలతప్తచిత్త లయి హా।హాకారముల్ సేయుచున్

జని యాచంద్రునియంకమందుఁ గలయా। చంద్రాస్య వీక్షించి భ
గ్గునఁ గోపాగ్నినిఁ బ్రజ్వలించి రతుల। క్రోధంబు దీపింపఁగన్.

వ. మఱియు వారలెల్లరు నొక్కుమ్మడి సమీపించి,

చ. అరవిరిపాన్పుపై మగని। యంకముపై నలరారురోహిణీ
సరసిజనేత్రిఁ గాంచి జడఁ। జయ్యనఁ జక్కఁగఁ బట్టి క్రిందికిన్
బరబర యీడ్చి పైని శశి। పైఁ బడఁ బోయి రతంబు ప్రేయసిన్
గరములఁ బట్టి యెత్తి తన। కౌఁగిటఁ జేరిచి బుజ్జగించుచున్.

గీ. లలన లాజ్యాహుతాగ్నికీ। లలను బోలి
తాము చూచుచునుండఁగఁ। దరుణిఁ బట్టి
కౌఁగిలించినరోహిణీ। కాంతుఁ జూచి
కలఁగి కన్నీరు గార్చుచు। నిలువఁబడిరి.

వ. అంత నాశశాంకుండు కోపావిష్టుండై వారలం గని.

ఉ. అవ్వకుఁ బూనినారె? పెను। తాఁగలు మీరలు రండలార, మీ
రెవ్వరు నాగృహంబునకు। నేటికి వచ్చితి రెగ్గొనర్పఁ, బొం
డవ్వలనుండి పల్కుఁడు, మదాంధ్యమునన్ గనుఁ గానకుండిరే?
ఇవ్వనజాయతాక్షి భువి। కీర్ష్యఁగఁ గారణ మేమి చెప్పుఁడీ?.

వ. ఆతనిభీషణభాషణంబు లాకర్ణించి యేకగ్రీవముగ వారలి ట్లనిరి.

ఉ. రండల మంచుఁ బల్కితివి। రండల మౌదుమె నీవు జీవివై
యుండఁగ? రండకుం దగని। యున్కి ఘటించితి వగ్నిసాక్షిగాఁ
బెండిలి యాడి ధర్మపద। విచ్యుతచిత్తుఁడవై శఠుండవై
పొం డని పల్కుచుంటి విది। పోలునె? పాడియె? రోహిణీప్రియా!.

ఉ. రం డని యాదరింపకయ। రండలఁ జేసి గృహంబునుండి వేఁ
బొం డని పల్కి రోహిణిని। ముద్దుగఁ గౌఁగిటఁ జేర్చి తీవు, మూ
ఢుండవు దక్షిణుండవె? శ। ఠుండ వశక్తుఁడవై భరింపలే
కుండిన రోహిణీవనిత। నొక్కతెఁ బెండిలి యాడరాదొకో?.

గీ. చానల కసంగమంబున । సంభవించు
నాధి యింత యం తని చెప్ప । నగునె చెపుమ
ఋతుమతిఁ సతిం బాసిన । నట్టిపతియు
భ్రూణహత్యామహాదోష । మునకుఁ బోవు.

ఉ. వ్యాకరముల్ గ్రహించితివి । మాముఖముల్ గన వెన్నఁ డైన దో
షాకర! నీవియోగమును । సైఁపఁగఁ జాలము జాల మేల? నీ
కేకట రోహిణీసతిప । యిం గము నెక్కొనుఁ గాక యిట్టు ల
త్రాఁకలఁ బెట్ట న్యాయ మగు । నా తగునా యిది నీకుఁ జెప్పుమా?.

ఉ. రోహిణి జాణ ని న్వలచె । రోయి వెలందిగ నామె యే జగ
న్మోహిని యంచు నెంచి మము । బుద్ధిఁ దలంపవు నీకుఁ గానియీ
దేహము లేల మాకు? కడ । తేఱిన మే లగుఁ గాదె స్త్రీలకుఁ
సాహస మెచ్చు పైఁ గడు వి । చారముఁ బొందెద వాలకింపుమా?.

వ. ఇవ్వాక్యంబుల నాలించి దండతాడితభుజంగిం బోలి రోహిణి యిట్లనియె.

కం. వలచితి నా మగవానిని
వలపించితి నట్టినేర్పుఁ । బడసిన మీరుఁ
వలచియు వలపింపుఁడు సుఖ
ములఁ బడయుఁడు నన్ను దూఱఁ । బోలునె చెపుడీ?.

మ. వలపింపం గలనేర్పు లేక నను నో । ర్వంబల్కఁగాఁ బాడియే?
వల పొప్పారెడుతమ్మిఁ గోరక ద్విరే । ఫం బొందు కాంక్షించునే?
కలహింపం బని లేదు మీప్రియుఁడు మీ । కౌఁగిళ్ళయం దుండ నే
బలిమిం గౌఁగిటఁ బట్టి తెచ్చితినె? నన్ । బాధింపఁగా నేటికిన్.

సీ. మగనాండ్రు కింతటి । తగవ్వుఁ జెప్పఁగ నేల?
యన్యోన్య మనురాగ । మాత్మఁ గలుగు.

మగవాని మగనాలిఁ । బగఁ బూని యెడఁబాప
జగడించుమగువలు । జగతిఁ గలరె?
ఏటికి నూరక । యేరాలిపోరాట
మీతనిం బాసెద । నేలుకొనుఁడు
మగవానిసమ్మతి । మగువ కైకొనలేక
గావింపఁ జాలునె । కాపురంబుఁ

గీ. గాన లతకూన యేమ్రానిఁ । గౌఁగిలించు
కొనునొ? కారణం బేమియో । జనుల కెఱుఁగ
నగునె? ఆఁగ లై పోరాడ । నగును గాక
ప్రకృతిజన్యానురాగంబుఁ । బడయఁ గలరె?.

వ. అని యిట్లు సంభాషించు నామెభాషణంబుల నాలింపక, యా కాంతలు నిజకాంతుఁ జూచి,

ఉ. చాలును సంతసించితిమి । సత్పథగామివి నీకుఁ బోల ది
ట్లాలరి వై మనుం దొఱఁగి । తక్కుట యక్కటికంబు లే దెదన్
దాళఁగఁ జాల మీవసుపఁ । దండ్రికిఁ జెప్పెద మంచు నెల్లరున్
గోలున నేడ్చుచున్ దొలఁగి । గొబ్బున వోయిరి పుట్టినింటికిన్.

గీ. ఔర! యిది యేటిపాడి యీ । యాగడంబు
తగదు, పెండ్లాడి విడనాడి । వగవఁ జేసె
నాఁడువారల ననుమనో । నాడి రవుకు
కలువచెలికాని నఖిలలో । కములవారు.

గీ. కొను లల్లాడ, నిందుమొ । గంబు లెల్ల
విన్నఁ బోవఁగ మేనులు । చెన్నుఁ దొఱఁగఁ
గనులఁ గన్నీరు మున్నీరు । గా స్రవింప
ముందటం గుందుకూఁతుల । మందలించి.

## యక్ష్మరోగావిర్భావము.

వ. దక్షుం డుదాత్తంబు సాంతంబుగ నాలించి దంతంబులు పటపటం గొఱికి మై మఱచి చంద్రు నుద్దేశించి దూషించి నాసికాగ్రంబు నుండి, మహాయక్ష్మరోగంబు సృజించినంత నారోగంబు పురుషాకృతిం దాల్చి భీషణుం డై, దంష్ట్రాకరాళవదనుం డై, కృష్ణాంగారసమకాయుం డై, యతిదీర్ఘుం డై, స్వల్పకేశుం డై, మృత్యుసంకాశుం డై, శుష్కీభూతగాత్రుం డై, తేజోహీననేత్రుం డై, యధోముఖుం డై, దండహస్తుం డై, శ్వాసకాసముఖరితముఖుం డై, సంభోగలోలుం డై, సమీపంబున నిలువంబడి దక్షునకు నమస్కరించి యీరేలుగున నేను వసింపఁ దగుస్థానం బెఱింగింపు మనవుడు దక్షుఁ డి ట్లనియె.

ఉ. చక్కనిచుక్క లైనతను । జాతల నెల్లరఁ గాకు సేసె నా
చుక్కలఱేఁడు, వానిమెయిఁ । జొచ్చి వసింపు మనంగ శ్లేష్మముల్
గ్రక్కుచుఁ గస్సుకస్సు రను । రావముల్ గళ మూఁది దగ్గుచుల్
జెక్కు చెమర్ప నుస్సు రని । చీఁదఱ వొందుచు మందగామి యై.

గీ. వెడలి తఱి వేచి చంద్రుని । యొడలు గాంచి
పుట్టంగోఁ బన్నగము చొచ్చు । పోల్కిఁ జొచ్చెఁ;
రాజుఁ బొందినకతమున । రాజయక్ష్మ
నామముం బొందె జగతి నా । యామయంబు.

గీ. యక్ష్మపరిపీడితుం డయి । యబ్జవైరి
శల్యమాత్రావశిష్టుఁ డై । శవముఁ బోలి
గ్రీష్మమున క్షుద్రనదిఁ బోలి । క్షీణదశకు
వచ్చె నోషధీశాఖ్యయు । వ్యర్థ మయ్యె.

### మహాక్షామోద్భవము.

సీ. గ్రీష్మాంబువులభంగి । క్షీణించె సర్వౌష
ధంబులు; జగములు । తల్లడిల్లె
సర్వౌషధంబులు । క్షయముఁ బొందినయంత
యజ్ఞంబు లన్నియు । నంతరించె
యజ్ఞంబు లన్నియు । నంతరించినయంత
నాకుల కన్నంబు । లేకపోయె
నాకుల కన్నంబు । లేకయుండినయంత
ధరణిపై వర్షంబు । కురియకుండె
గీ. వర్షలోపంబునం బంట । పండకుండె
నంత దుర్భిక్ష మెల్లెడ । నాక్రమించె
గోడు గుడుచుచు మలమల । మాడి తుదకుఁ
బ్రాణిలోకంబు సర్వంబు । క్షీణ మొందె.
గీ. ఆమయాక్రాంతదారిద్ర్య । మాక్రమించె
దానజల మింకినంతనె । దాతగృహము
నుండి యాచకులు తొలంగు । చుండి రిభక
పోలములఁ బాయుబంభర । ములను బోలి.
గీ. తిండికఱవున మద మింకఁ । దెల్లఁబాఱు
నేనుఁగుం బోలె దివి మేఘ । హీన మయ్యెఁ
బండఁబాఱినక్షేత్రంబు । లెండఁబాఱె
ధర్మ మనునది బురదలో । స్తంభ మయ్యె.
సీ. లోభంబుచే ధన । లోపంబుచే సర్వ
లోకంబులుం బొందె । నాకులంబు
పాపకర్ములక్రూర । వర్తనం బెల్లెడ
వ్యాపించె దుఃఖంబు । బాదఁగొనియె

బ్రాహ్మణోత్తమవేద। వాదనినాదంబు
ఖేదనాదముగ వ్యా।కీర్ణ మయ్యె
రాజు లధర్మక।ర్మంబులం గావింపఁ
జోరులయుద్వృత్తి । మేర మీఱె

గీ. రోష మిగురొత్తె రాజ్యాభి।లాష హెచ్చె
కారణము లేనికలహంబు । కడలుకొనియె
నఖిలవణిజులవ్యాపార । మతిశయిల్లెఁ
గపటజనవర్తనము లౌకి।కముగ మాఱె.

గీ. వివిధరోగముల్ జగతి నా।విర్భవించె
మూఢవైద్యులదంభంబు । రూఢి కెక్కె
ప్రజలకన్నీరు వర్షలో।పంబుఁ దీర్చెఁ
బాఁడియుఁ బంటయుఁ భువిఁ । బాడువాఱె.

గీ. ధరణి దారిద్ర్యదేవత । తాండవించె
వైదికుల వేషభాషల। ఘ్రాడి చెలఁగె
నవనిసురుల మర్యాదయు । నంతరించె
దాసరులసంఖ్య వర్ధిల్లె । దాత కుందె.

వ. అంత,

ఉ. అక్షయమయ్యె వ్యాకుల మ।హర్నిశము ప్రజకార్తి హెచ్చె, దు
ర్భిక్షము మేర మీఱె దుర।పిల్లిరి దేవత లంచు నాసహ
స్రాక్షుఁడు బ్రహ్మయాజ్ఞ నమృ।తాంధసులన్ బురికొల్పి లేచి వే
దక్షునిపాలికిం జని సు।ధాకరుఁ బ్రోవఁగ వేఁడె నెంతయున్.

వ. అంత బ్రహ్మసముం డగుదక్షుండు,

గీ. వేలుపులతేనివేఁడుకో। లాలకించి
యట్లయాఁ గాక, చంద్రుఁ డిల్లాండ్రి నిప్డు

డేలుకొను నేని నీపైని । వృద్ధిఁ జెంది
యట్లు క్షయ మొందుచుండు మా।సార్థమునకు.

గీ. అట్లు రయాఁ గాని మునుపటి।య ట్లహర్ని
శంబు సంపూర్ణకళ లొందఁ । జాలఁ డాతఁ
డనిన ధన్యోస్మి యని యిందుఁ । డజునికడకు
వెడలి వృత్తాంత మంతయు । విన్నవించె.

గీ. అఖిల మెఱిఁగినయాబ్రహ్మ । యతఁడు రాక
పూర్వమే బృహల్లోహిత।పుష్కరంబుఁ
జంద్రుఁ గాపాడ సృష్టించి, । చంద్రభాగ
శైలమున కేగె శశితోడ । శక్రుతోడ.

వ. అట్లెల్లరుం గొలువఁ జంద్రదేవేంద్రులతో బ్రహ్మ బృహల్లోహితం
బును సమీపించి,

గీ. పాకలామయగ్రస్తద్వీ।పంబుఁ బోలి
యక్ష్మరోగావృతుఁ డయి ప్రా।ణావశిష్టుఁ
డై కడుంగడు శుష్కించు।నతని సరసి
స్నానముం జేసి రమ్మని । యాన తిచ్చె.

గీ. చంద్రుఁ డప్పుష్కరంబున । స్నాన మాచ
రించి లేచినయంత విరించి యాత్మ
నలరెఁ; బురుషాకృతిం దాల్చి । యక్ష్మరోగ
మీవలకు వచ్చి నాగతి । యేమి యనిన.

వ. బ్రహ్మ యిట్లనియె.

గీ. అనిశ మెవ్వాఁడు స్త్రీలోలుఁ । డై రమించు
సంధ్యయం దెవ్వఁ డతివతో । సంగమించుఁ

గానసంయుక్తుం డెవ్వాఁడు । కాంతం గూడు
వానిదేహంబు నీకు ని।వాస మగును.

వ. వెండియు మృత్యుదేవీపుత్రి కృష్ణ యనునామె నీకు భార్య య
గుం బొమ్మనిన చంద్రునిం బాసి యథేచ్ఛం జనియె.

గీ. మధుపపరిభుక్తశుక్లక।మలముఁ బోలి
సారహీనుఁడై దీనుఁడై । యూరెలుంగు
రాలుపడఁ గంటఁ గన్నీరు । జాలువాఱ
బ్రహ్మ వీక్షించి చంద్రుండు । పలికె నిట్లు.

గీ. సడలి విడివడె నవయవ।సంధు లెల్లఁ
గార్యమునకు నుత్సాహంబుఁ । గలుగకుండెఁ
జుఱుకుఁదన మింకె బుద్ధియుఁ । దెలివిఁ దప్పెఁ
గారణం బేమొ? తెలియదు । కమలగర్భ!.

వ. కటకటం బడి బ్రహ్మ యిట్లనియె.

సీ. రోగలక్షణ మద్ది । రోగంబు నినుఁ బాసె
బలహీనమున మేను । బడలియుండు
జ్యోత్స్నయు నమృతంబు । శుష్కించె నీదుతే
జంబు సర్వంబు ని।స్సార మయ్యెఁ
దెఱ వొందు గల దది । తెలిపెద చాలింపు
క్రతుపురోడాశభా।గంబుఁ గొమ్ము
యజ్ఞవేళల నీకు । యజమాను లెల్లరు
నర్పింపవలయు । నాయాన చూవె

గీ. బలము వీర్యంబు పూర్వంబు।వలె లభించు
సానరాపునఁ గ్రొలువ।జ్రములఁ బోలి
నీదుకళ లెల్ల రాజిల్లు । నిశ్చయముగ
నని వచించి వేల్పులఁ గాంచి । యనియె మఱియు.

## చంద్రకళావిభాగము.

గీ. దక్షునానతిఁ బాలింపఁ । దగును మనకు
ఏకకళ శంభునాదల । నెపుడు నుండు
శుక్లపక్షంబునందలి । జ్యోత్స్న యెల్ల
కృష్ణపక్షంబునను దాని । నెనయుచుండు.

గీ. మిగులుపదునేనుకళలను । మీరలెల్ల
కృష్ణపక్షంబునంద గ్రహింపవలయు
శుక్లపక్షంబునన్ శశి । శోభఁ గాంచుఁ
గ్రమమునన్ గౌముదిం బొంది । కళలఁ గ్రాలు.

వ. ఇట్లు బ్రహ్మ వచించె నని మార్కండేయుండు కమఠాదుల కిట్లనియె.

గీ. ఆర్యవరులార, సర్వ మా । ఖ్యాత మయ్యెఁ
బర్వతశ్రేష్ఠ మైనయా । పర్వతమున
బ్రహ్మచే శశి భాగింపఁ । బడియెఁ గాన
చంద్రభాగాద్రి యనుసంజ్ఞ । సంభవించె.

గీ. చంద్రభాగాద్రిపైఁ బుట్టి । సరసిఁ జొచ్చి
యమృతతుల్యమై ప్రవహించి । యఖిలజీవ
ములకు జీవనం బయి వార్ధిఁ । గలసెఁ గాన
నన్నదియుఁ జంద్రభాగాహ్వ । యమును బొందె.

## వసిష్ఠుండు సంధ్యం గాంచి ప్రసంగించట

వ. వినుం డనంతరమున నాకుహనాబ్రహ్మచారి, ధమ్మిల్లబంధదిక్కృతయామినియు, మందగామినియుఁ, దీరగామినియు నైన యాసంధ్యాకామినిం గాంచి సమీపించి,

ఉ. ఎవ్వతవే లతాంగి ? జగ । మెన్నఁడుఁ జూడనిమేనిసొంపునన్
మవ్వమునన్ రహించెదవు । మానులఁ జూడఁగ వచ్చియుండు వే

నెవ్వఁడనో యెఱుఁగుదువె ? । యింతి నెఱుంగనిబ్రహ్మచారి నీ
వెవ్వరు లేనితావునకు । నేటికి వచ్చి తెఱుంగఁ జెప్పవే ?.

క. ఎలదీఁగఁ బోలుదానవు
ఎలప్రాయపుఁ జిన్నదాన । వెలనాఁగా ! కీ
డెలరారెడు నీస్థలమున
కెలమిఁ జనుదేర హేతు । వేమియొ చెపుమా.

సీ. పల్లవంబులఁ బోలు।పాదపద్మంబులు
కటికరాస్నేలపైఁ । గందవలసెఁ
గమలంబ యాఁగాక । కమలాస్య నీమోము
వసివాడి కమలి సొం । పెసఁగకుండె
నిందీవరము లేమొ । యింతి నీకనుదోయి
బీరెండ కరమోడ్చుఁ । గోరుచుండెఁ
బూఁదీఁగె యనవచ్చుఁ । బూఁబోఁణి నీమేను
సూర్యాతపంబున । సుర్కియుండెఁ

గీ. దుమ్మొదలగు డెఱుఁగని।తమ్మిఁ బోలి
యున్నదానవు గజయాన । చిన్నదాన
పసుపునిగ్గులు దేఱునై।పరువమునకుఁ
దగనితా విద్ది తగునె యీ।తెగువ మగువ ?.

గీ. చక్కఁదనమున కిక్కయై । చుక్కఁ బోలి
యందమున కంద మగునీదు।చంద మరయ
నలరువిలుకానిరాణికిఁ । దిలక మగును
చక్కఁదన మెక్కడిది మాకు । జలజగంధి ?.
ఘుమ్ముఘుమ్మని గంధంబు । గ్రిమ్ముకొనఁగ
సద్దస్ని జనియించుకమ్మలంబు।చందమునను

ఎవనిగర్భంబునం దుద | యించి తీవ్రు
కడల నెన లేనిమైత్రావి | కడలుకొనఁగ.

క. మగువయె నినుఁ జూచి వలచు
మగవానికిఁ జెప్పవలెనె? | మగువా! నీ పీ
జగ మెఱుఁగనితావున నుం
డఁగ నీకు విరక్తి కార | ణం బగు నేమో?.

ఉ. కారణ మేమియో తెలియఁ | గా మదిఁ దోఁపకయుండెఁ జూవె, నిన్
జేరినవాఁడ, డాఁపకుము; | చెక్కిలి నొక్కినఁ బాలు గాఱు నే
పూరుషుఁ డైన నిన్వలచి | పొందిక వమ్మొనరించె నేమొ? సం
సారము సారహీన మని | చాన తలంచితె నెమ్మనంబునన్?.

సంధ్య తనయుద్దేశముం దెలుపుట

క. అని పలికినకుహానావ
గ్గినిఁ గని యాతఁడు వచించు | నేరుపునకు లో
నెన లేనిమోద మొందుచు
వనజానన భావ మిట్లు | వ్యక్తముఁ జేసెన్.

క. అనఘా! నినుఁ గనుఁగొనినం
తనె నే నొనరింపఁబోవు | తపము ఫలించెన్
విను మొకకారణమునఁ బా
వన మగుతప మాచరింప | వచ్చితి నిటకున్.

క. జననం బఘుభాజన ముని
ఘన మగుచింతాభరమున | గాసిలి యిటకున్
జనుదెంచితిఁ దపమునకై;
జననుత వనజాసనుండు | జనకుం డనఘా!.

క. విను మాతనిమనమున నే
జనియించితి ముజ్జగములు | సంధ్య యనంగన్

దనరినదానను తపమున
కను వగుపద్ధతి వచింపు । మనుమోదమునన్.

వ. ఆపలుకుల నాకర్ణించి యక్కపటవర్ణి యిట్లనియె.

మ. తపమా? నీ వొనరింపఁజాలుదువె కాం।తా? మోదుగుంబూవుతో
నుపమింపం దగునందచందములతో । నొప్పారు నీదేహ మా
తపముం శీతలముం సహింపఁ గలదే? । ధైర్యంబు లే దైన నే
నుపదేశించెద సాహసింపఁ దగు నీ।యుద్యోగ మెట్లుండునో?.

విష్ణుమంత్రోపదేశము

వ. ఏమహాత్తేజంబు, మహాత్తపంబు, పరాత్పరం బట్టివైష్ణవంబు సమా
రాధ్యం బని యెఱుంగుము.

గీ. రమణి! ధర్మార్థకామమో।క్షముల కాది
కారణం బెవ్వఁ డెవ్వఁ డేకముగ నుండు
నెవఁడు జగదాద్యుఁ డెవఁడు వి।శ్వేశ్వరుఁడు
అట్టిపురుషోత్తముని నాత్మ । నరయవలయు.

వ. శంఖచక్రగదాద్యాయుధకరుని, కమలామనోహరుని, కమల
నేత్రుని, నీలాంజనసన్నిభగాత్రుని, నిత్యపవిత్రుని, శ్రీవత్సవక్షుని,
జగద్రక్షుని, శాంతుని, కరుణాస్వాంతుని, వనమాలాధరుని, పరు
ని, కేయూరకుండలభూషితుని, వేదభాషితుని, నిరాకారుని,
భక్తహృదయవిహారుని, దైత్యసంహారుని, సూర్యమండలమధ్య
స్థుని, స్వస్థుని, నిరంత మోమ్ నమో వాసుదేవాయ, నిత్యానం
దాయ, నిరాలంబాయ, యని భజించుచు, మౌనముద్ర వహించి,
స్నానం బాచరించుచుఁ, బూజించుచుఁ, దపంబుఁ గావింపవలె
నని యుపదేశించి యవ్వసిష్ఠుం డవ్వనజానన వీక్షించుచుండ నంత
ర్హితుం డయ్యె. అనంతరమున,

గీ. ఆబ్రహ్మలోహితతటంబు । నధిగమించి
ముజ్జగంబు లాశ్చర్యంబుఁ । బొందునట్లు
సతముఁ గమలాక్షి కమలాక్షు । మతిఁ దలంచి
తపముఁ గావించుచుండె వ । త్సరము లరుగ.

సంధ్యకు శ్రీవిష్ణువు ప్రత్యక్షమై వరంబు లొసంగుట

వ. అంతఁ గొంత కాలంబున కాకాంత యేకాంతంబునఁ దనయంత రంగమున నేరూపంబు ధ్యానించుచుండె, నారూపంబు మూర్తి వంత మైన ప్రత్యక్ష మయ్యె. వినుండు.

సీ. శాంతంబు భువి మూర్తి । వంత మయ్యె ననంగ
నాకృతి ప్రకృతిపై । నాక్రమింపఁ
గ్రవ్యాద మారణ । కారణకరములు
పురుషార్థముల నీయఁ । బూనుకొనఁగ
నరుణరేఖలతోడ । నలరారుకనుదోయి
భక్తానురాగంబు । ప్రజ్వలింప
సజ్ఞానమున జ్ఞాన । మావిర్భవించె నాఁ
గటిమేన దువ్వల్వ । కాంతులీన

గీ. శేషతల్పుండు కేయూర । భూషణుండు
పోషణుం డాశ్రితాభీష్ట । శోభనుండు
భీషణప్రదుం డరిలోక । భీషణుండు
గోచరించెఁ బ్రఫుల్లాబ్జ । లోచనుండు.

గీ. అట్లు ప్రత్యక్షముగ నిల్చు । హరినిఁ గాంచి
యే మని స్తుతింపఁ దగు నని । యెదఁ దలంచి
పుష్పములతోడ సంతోష । బాష్పములను
విడిచి ముకుళితనేత్ర యై । వెలఁది నిల్చె.

వ. అట్లు ముహూర్తమాత్రంబు నిలిచి.

గీ. శిష్టజనులను బాధించు। దుష్టలోక
శిక్షకుండవు భక్తాంగ। రక్షకుఁడవు
మాయఁ దొలఁగియు మాయతో । మలయుచుందు
వాఁడుబానను ని న్నేమి । యాడుదాన

## శ్రీ విష్ణుస్తుతి

వ. అని నిమీలితాక్షి యైనయప్పద్మాక్షి పద్మాక్షునికరుణాకటాక్ష ప్రసాదంబున దివ్యజ్ఞానంబు సంపాదించి, మౌనంబు విడిచి "కారణకారణాయ, సమస్తలోకాంతరమోహహదాయ, దివ్యజ్ఞానవిభూతిదాయ నమో నమోస్తు. అంతశ్చింత్యం, నిరాకారం, నిరాలంబం, జ్ఞానగమ్యం, గోవిందం, మనసాభజామి." అని యనేకవిధంబులఁ బ్రస్తుతింప నమ్మహానుభావుండు సంతుష్టాంతరంగుం డయి, మనోభీష్టం బెఱింగింపు మనవు డామె యిట్లనియె.

గీ. వినుము జీవంబు లావిర్భ। వించినంతఁ
గామముం బొందుచున్నవి । కమలనాభ!
అట్లు గాకుండ నీపైని । ప్రాణిసమితి
క్రమమునం బొందఁ దగియుండుఁ । బ్రకృతియందు.

గీ. సతులతలమానికం బని । జగము నన్నుఁ
బొగడ దొడ్డయిల్లాల నై । నెగడవలయుఁ
బతియ కనులకుఁ గనుపట్ట। వలయు, నన్నుఁ
గాంచినఁ బరుంపు క్లీబు డౌఁ । గాక జగతి.

వ. శ్రీమన్నారాయణుం డిట్లనియె.

గీ. మగువ! నీకాంక్షితంబు స। మంజసంబు
శైశవంబు కౌమారంబు । జవ్వనంబు

వార్ధకం బనునాలుగవస్థ లవనిఁ
బ్రాణికోటికి నీపైని బరిఢవిల్లు.

గీ. అతివ, బాల్యాంతమునఁ గామ మంకురించి
యౌవనంబున రేకెత్తి యధిక మగును
తపముచే నీదుమర్యాద ధరణియందు
స్థాపితం బయ్యె నీజయస్తంభ మనఁగ.

గీ. సతికి నుపమింపఁ దగుదువు జగతియందు
నీకుఁ గలయట్టియీయాలువు నెగడ దెందు
నెవఁడు మూఢుఁడై నిన్నుఁ గామేంగితమునఁ
గాంచు నాతఁడు క్లీబుఁ డౌఁ గాక యబల!.

గీ. సప్తకల్పాంతజీవి, యశస్వి ఘనత
పస్వి చారుతేజస్వి నీభర్త యగును
అని వరంబుల నొసఁగి నారాయణుండు
అచట నంతర్హితుం డయ్యె నక్కజముగ.

## సంధ్య యరుంధతి యై జన్మించుట

వ. అంత నాకాంత సంతుష్టాంతరంగ యై, యపావన మైన యీజీవనము త్యజించెదం గాక యని నిశ్చయించి, యేరికిం గానరానియాకారముం దాల్చి, శీఘ్రగమనంబునం జని, మేధాతిథిమునినాథుని యాగవహ్నిం బడినఁ బురోడాశమయం బగునామెశరీరమునుండి పురోడాశగంధం బాకాశపర్యంతము వ్యాపించె. అనంతరమున,

సీ. మగువశరీరంబు మార్తాండమండలాం
తరమును జొచ్చిన నతనె యినుండు
రెండుగా విభజించి యొండు పాత్రితస్సంధ్య
నొసరించె వేల్పులతనివికొఱకు,

రెండవపాలు పిత్రుప్రీతికొఱకు సా
యంసంధ్యఁ గావించె । నార్యులార!
యామెప్రాణంబులు । నాదినారాయణు
నానతి వైళంబ । యమ్మునీంద్రు

గీ. వనలకుండంబునం బడి । కనకవర్ణ
తుల్యగాత్రంబున రహింప । దుహితదుహిత
జననముం బొందె ననుచు న।మ్మునివరుండు
ఇనుమడించినప్రేముడిం । బెనుచుకొనియె.

గీ. ధర్మమున కనిరుద్ధవ।ర్తనముఁ గలిగి
మెలఁగవలె నని యమ్ముని।కులవతంసుఁ
డామెకు నరుంధతి యనంగ । నామ మొసఁగి
యనిశ మల్లారుముద్దుగ । నరయుచుండె.

గీ. చంద్రభాగానదీప్రదే।శమున నమ్ము
నీంద్రునాశ్రమంబున రతి।మృగి యనంగ
నెలమి నాడుచు శుక్లప।క్షేందుఁ బోలి
దినదినంబును మిగుల వ।ర్ధిల్లుచుండె.

వ. అంత,

చ. అయిదవయేఁడు వచ్చె నని । యాత్మఁ దలంచి సమస్తవిద్య లె
ట్లయినను నేర్పఁగావలయు ; । నింతికి నీతియ జీవనంబు, వి
ద్యయ కడు మేలొనర్చు నని । యమ్మునివర్యుఁడు లేచి, పుత్త్రికో
రయమున నేగి భారతి కె।ఱఁగి యరుంధతిఁ జూపి యిట్లనున్.

### అరుంధతీవిద్యాభ్యాసము

గీ. నాదుగారాబుకూఁతు శ్రీ।నాతిమిన్న
తల్లి! విద్యలం గన్నకాం।తామతల్లి

వగుము, విద్యచే విజ్ఞాన । మతిశయిల్లుఁ
గరుణఁ గలిగి యీమెకు విద్యఁ । గఱపవలయు.

గీ. పుష్ప మనిచెప్ప నొప్పదె । పూవుఁబోణి
సౌరభంబు వాసింబు పుష్పమున కరయ
విద్య యనుగంధ మిసుమంత । వెలయకున్నఁ
బోలఁతి యేటికి మోహనగుం। బూవుపోల్కి.

వ. అని వచించి యాభారతికి నరుంధతి నర్పించి యథేచ్ఛం జనియె.

ఉ. స్త్రీలకు విద్యఁ జెప్పఁ దగ।దే యనుసూదియు మేల? చెప్పఁగాఁ
బోలు; జగంబు భారతిని । పూరుషుఁ గా వినుతింప దేల? వి
ద్యాలత కాలవాల యని । యామెఁ గఱగఱ సన్నుతింపఁగా
నేల? వివేక మున్న బుధు । లీవిషయంబు గ్రహింపుఁ డాత్మలోన్.

వ. వినుం డనంతరమున:—

గీ. కనక మెన లేనిరతనంబు । నెనసినట్లు
పొలఁతి నవయావనంబునఁ । బొలుపుఁ గాంచె
మలయజంబు పుష్పించిన।మాడ్కి నతుల
విద్యచే నామె జగమున । విరియఁ బాఱె.

వ. అంత నొకనాఁడు,

గీ. బ్రహ్మమానసపుత్త్రిని । బ్రహ్మచారి
నవ్వసిష్ఠుని వీక్షించె । నాలతాంగి
యాలతాంగిని వీక్షించె । నాతఁ డంత
వారి కన్యోన్యరాగంబు । మేరమీఱె.

వి వా హ ము

వ. వారిరువురయింగితంబు గ్రహించి, యాభోజసంభవుండు మేధా
తిథి కెఱింగించి శుభముహూర్తంబున వివాహంబుఁ గావించె.
అవ్వధూవరుల మంగళస్నానజలంబ యిట్లు సిపారినదీరూపంబు

నం బరమపవిత్రింబుగఁ బ్రివహించుచుండె నని యమ్మార్కం
డేయమునితల్లజుండు కమఠాదిమునీంద్రుల కెఱింగించె.

ఆశ్వాసాంతము.

క. రామా, రఘుకులజలనిధి
సోమా, నిర్జితసురారి । శూరస్తోమా
కామారి వినుతపావన
నామా, సంగ్రామభీమ । నతసుత్రామా!.

శా. అర్ణోరాశివిహార, హారఫణిసీ।హారేందుఫుల్లాంబుజో
దీర్ణోత్ఫుల్లయశః ప్రకీర్ణదశది।గ్దేశాంత, దేశాంతరా
భ్యర్ణవ్యాప్తకథాసుధాప్రముదిత।బ్రహ్మాదిదేవార్చిత
స్వర్ణాంభోజపదాబ్జ, అబ్జహితవం।శా, వంశనాదప్రియా!.

కమలవిలసితవృత్తము. సరసిజనయన, త్రి।జగదుపకారీ
సురుచిరగుణగణ, । సుజనవిహారీ
హరిహరవిధినుత, । అరివిజితారీ
జరదరదనివద।దళితసురారీ!.

గద్యము. ఇది శ్రీమద్భాగవతుల నారసింహశర్మ ప్రణీత శ్రీమహా
కాళీపురాణాంతర్గత శృంగారసంధ్య యందుఁ
ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు.



# THIS CANCELS ALL PREVIOUS RULES.

***Estd. in 1911.***

**Registered**




భాగవతుల
నరసింహశర్మ
ప్రొప్రైటర్.
వేగుంజుక్క
గ్రంథమాల,
పూడిపెద్దివారివీధి,
బరంపురం (గంజాం)

**1927**

సంపాదకులు:—బ్ర॥ శ్రీ॥ ఆదిభట్ల తరణియ్యసిద్ధాంతిగారు.

## నిబంధనలు.

1. నిరూపకనవలలు, సాంఘికనవలలు, పుణ్యచరిత్రములు, మృదుమధుర ప్రబంధములు, మనోహర నాటకములు, మనోల్లాసకరములగు నితిహాసములు, చక్కని కాగితముతో, రమ్యమగు అచ్చుతో, రెండుమాసముల కొకొక్కటిగా వెలువడును.

2. గ్రంథము వెలువడినవెంటనే చందాదారులకు ఒక్కొక్క గ్రంథము ఒక్కొక్కరూపాయికి వి. పి. చేయఁబడును మనియార్డరు కమీషను ప్రత్యేకము ఇతరులకు ప్రతిగ్రంథము రూ 1—8—0 (ఖర్చులతోసహా)

3. ఆరుగ్రంథములు (పోస్టేజీలుగాక) సంవత్సరమునకు ఆరు రూపాయలు మాత్రమే ఈయారురూపాయలు ముందు (అడ్వాన్సుగా) బంపు చందాదార్లకు ఎట్టి ఖర్చులుండవు.

క్రొత్తగా చందాదారులగువారు మొదటి పార్సెలు పోస్టేజి మొదలగు ఖర్చులు భరించుకొనవలెను. ప్రతిగ్రంథముఁ దప్పక పుచ్చుకొను చందాదారులకు మాత్రమే అనుబంధగ్రంథ ముచితము

4. చందాదారులగువారు వెనుకటి గ్రంథములలో నేయొకగ్రంథమునైనఁ గోరికొని ప్రవేశరుసుము 0-4-0 మాత్రమే. అట్లు కాక, తాము ప్రవేశించిన పిమ్మట నుండి గ్రంథములఁ బంపఁగోరికొని ప్రవేశరుసుము 0-8-0 మాత్రమే.

5. చందాదారులగువారు వెనుకటి గ్రంథములు పుచ్చుకొనవలెనను నిబంధన యెంతమాత్రము నులేదు. వారు కోరికొని (కోరినగ్రంథములబట్టి) చౌకగా ఇచ్చెదము.

6 అప్పుడప్పుడు వెలువడు అనుబంధ గ్రంథములు చందాదార్లకుమాత్రమే యుచితము.

# గ్రంథరచనా నియమములు.

1. Characterisation 2. Development of character 3. New Ideas 4. Historical Beauties 5. Description of nature and other varieties.

గమనింపుడు—చందాదారులు ప్రతిగ్రంథముఁ బుచ్చుకొనుట తమకు విధియై యున్నది. తిరుగ పంపించినప్పుడు గ్రంథము నెంతమాత్రము త్రిప్పివేయరాదు. ప్రతి గ్రంథమునకు ముందు ఇంటిమేమనుఁ పంపుదుము. ఇష్టములేనివారు వెంటనే మాకు దెలియఁజేయవలెను. త్రిప్పివేయక ప్రతిగ్రంథము పుచ్చుకొను చందాదారులకు మాత్రమే అనుబంధము చితముగా పంపుదుము. ఆదాయ్వానుసంపిన చందాదారులకు మేము కృతజ్ఞులమై యుందుము.

## నూతనప్రచురములు. (New Publications.)

# శ్రీతులసీరామాయణము.

నిర్వచనము—చిత్రపటశోభితము.

వాల్మీకి రామాయణమువలెనే హిందూదేశమునం దంతటఁ బ్రఖ్యాతిఁగాంచిన రామాయణమిది. మనభాష కిదియొక నూతనాలంకారము. ఇది హిందీభాషయందు శ్రీతులసీదాసమహాకవిచే వ్రాయఁబడినది బ్ర॥ శ్రీ॥ భాగవతుల నృసింహశర్మగారిచే నాంధ్రీకరింపబడుచున్నది. జగద్గురువగు శ్రీగాంధిమహాత్మునిచే నిత్యముఁ బారాయణము జేయబడు నీరామాయణ ప్రాశస్త్యముఁ జదివినవారనేకవిధములఁ గొనియాడకపోరు వివిధరసములకు, నుపాఖ్యానములకు, మనోహరగాధలకు నిది జన్మసీమ. ఒక్కొక్క కాండము చొప్పున వెలువడును. ఆంధ్రీకృత శ్రీతులసీరామాయణముఁ బొగడుచు మహనీయులు వ్రాసిన యుత్తరములం ననుమున్న ప్రచురింపఁబడును. బాలకాండము వెలువడినది. కొలఁది ప్రతులుమాత్రము కలవు. అయోధ్యాకాండము రెండు భాగములు. ప్రతిసంపుటము చందాదారులకు రూ 1-0-0 ఇతరులకు రూ 1-8-0 పోస్టేజి ప్రత్యేకము.

# ఉగ్రభైరవము.

చందాదార్లకు రు 1—0—0 పోస్టేజి వేరే ఇతరులకు రు 1—8—0 పోస్టేజివేరే.

గ్రంథకర్త:—పోడూరి రామచంద్రరావుగారు, బి. ఏ. బి. యల్.

ఇదియొక భయంకరమైన డిటెక్టివ్ నవల. ఆంగ్లమునగల "The Hound of the Baskervilles" అను నవల ననుసరించి మృదుమధురశైలిని వ్రాయఁబడినది. చిత్రపటశోభితము. హంతకుఁడొక బాగిలముద్వారా చేయించిన యత్యద్భుత భయంకర ప్రక్రియ ఇందు నిరూపింపఁబడినది. తుదివరకుఁ జదువనిదే విడిచిపెట్టను గుండె లవియఁజేయుచున్నాటు. వలయువారు వెంటనే వ్రాయవలెను. కొలదిప్రతులు మాత్రమే కలవు.

# సర్వమంగళ.

చందాదార్లకు రు 1-0-0] [ఇతరులకు రు 1-8-0 ఎల్లరకు పోస్టేజి ప్రత్యేకము.

గ్రంథకర్త:—వారణాసి నరసింహారావుగారు.

ఇదియొక సరసమైన సాంఘికనవల. అరుంధతీ దయామయుల పరోపకార పారీణత, సుశీలాసర్వమంగళ భయంకరకష్టములు, కామినీ భీషణ ప్రతిహింస, డాక్టర్ భువనసుందరుని దుర్దాంతదురంత కార్యములు, కాముకవికారప్రక్రియలు, చదివితీరవలెను. ఇంతయేల? ఆంధ్రపత్రికాది పత్రికలచేఁ బాగ ప్రశస్తికెక్కిన నవల యిది. చక్కని నిండు కాలికోబైండు, మంచిఅచ్చు, మంచికాగితము.

# రసపుత్ర జీవన సంధ్య.

గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మగారు.

బంగాళిభాషయందు శ్రీరమేశచంద్రదత్తుగారిచే వ్రాయఁబడినది. పైగ్రంథకర్త గారిచే ననువదింపఁబడినది ప్రథమప్రతులన్నియు సరిపోయినవి. ద్వితీయముద్రణమునకు సిద్ధముగానున్నది. వలయువారు వెంటనే తెలియఁజేయవలెను. వెల 0-14-0 పోస్టేజి ప్రత్యేకము.

నాటకత్రయము—గ్రంథకర్త—భా॥ నృ॥ శర్మ॥

# 1 విజయ విజయము.

వీరరసప్రధానమగు నాటకము. కర్ణార్జునుల యుద్ధము. ఎల్లరు భారతమునం జదివినవారే కాని కర్ణుడెట్టివాఁడో యోచించినవారు లేరు. కర్ణునికొఱకే యీనాటకము వ్రాయబడినది. అనేకులు కొనియాడిన నాటకమిది. వెల రు 0-10-0 పోస్టేజి ప్రత్యేకం.

# 2 ప్రతిజ్ఞావిజయరామరాజీయము

లేక

# విచిత్ర వీరబొబ్బిలి.

బొబ్బిలియుద్ధనాటకము లనేకములున్నవి. యథార్థములగు వంశములతో విరాజిల్లు నాటకరత్నమిదియే. విజయరామరాజుగారి రాజనీతికి బొబ్బిలివారి పరాక్రమము లకు నిధి యయినట్టు వెంగళరావు, రంగారావు, పాపయ్య, మొదలగు వీరుల పద్యము లన్ని పాత్రములను వర్ణించును. దీని వెల 0-12-0 పోస్టేజి ప్రత్యేకము. కొలదిప్రతులు మాత్రమే కలవు

# 3 ప్రతిజ్ఞాచాణక్యము.

శ్రీద్విజేంద్రలాల్ రాయ్‌గారు వంగభాషయందు నాటకగ్రంథకర్తలలో సర్వశ్రేష్ఠుడని ప్రఖ్యాతి. ఆతడు వ్రాసిన నాటకమునకు "చంద్రగుప్త" శిరోభూషణము. ఆచంద్రగుప్తనాటకమే యీప్రతిజ్ఞాచాణక్యము. అనేకనాటకములవారు నాటకమాడి ప్రఖ్యాతిగణించిరి. చాణక్యునెంతయుం దలంచినవారీనాటకముం జదివితీరవలెను. దేశభక్తి కిది పుట్టినిల్లు. చందాదార్లకు 0-12-0 ఇతరులకు రు 1-0-0 పోస్టేజి ప్రత్యేకం.

# అభినవభర్తృహరి.

గ్రంథకర్త:—భాగవతుల నృసింహశర్మగారు.

ఈనామముంబట్టియే యిది భర్తృహరి సుభాషితములంబోలు గ్రంథమని తెలియంగలదు. శృంగారాది వివిధరసములకు, నీతి భక్తి జ్ఞాన వైరాగ్యముల కిది పుట్టినిల్లు. మృదుమధురపద్యములు, చక్కనిశైలి, మంచికాగితము, సొగసైన అచ్చు. దిట్టమగు నట్టబైండు కొలది ప్రతులే యున్నవి. దీనివెల 0-10-0 పోస్టేజి ప్రత్యేకము.

# కామాక్షీ సరసము.

గ్రంథకర్త:—శృంగారశిరోమణి, మండా వెంకటేశుగారు.

తారాశశాంకవిజయము, బిల్హణీయము, రాధికాసాంత్వనము, మొదలగు శృంగారరసప్రబంధములకంటె నిదిమేలు. ఉపదేశరూపమున శృంగారరసముం గుప్పింపంబడినది నీతిబోధకము, మంచిఅచ్చు. మానసోంపుగనుండును. మత్తేభమాలిక.

మనోహరశైలి వెల 0—1—0 మాత్రమే.

వెలస్వల్పము !! ఫలమధికము !!!

# పద్మరాగము.

(అద్భుతమైన నిరూపకనవల.)

గ్రంథకర్త:—బూర్ల వెంకటరమణయ్యగారు. ఆంగ్లేయమునందుగల "Reddle of the purple Emperor" అనునవల ననుసరించి స్వతంత్రముగ వ్రాసిన నవల యిది. పద్మరాగాద్యనర్ఘరత్నములకై జరిగిన యద్భుత సంఘటనములతో నిండియుండును ప్రసిద్ధికెక్కిన డిటెక్టివ్ నవలలలో నిదియొకటి యని యెల్లరచేం గొనియాడబడినది.

వెల చందాదారులకు రూ 1—0—0

# దుర్గాదాస్.

గ్రంథకర్త:—వారణాసి భానుమూర్తిగారు.

వంగభాషలో సుప్రసిద్ధులగు శ్రీయుత ద్విజేంద్రలాల్ రాయిగారి దుర్గాదాస్ నాటకమున కనువాదమిది. అత్యద్భుత వీరావేశముఁ బుట్టించును. ఔరంగజేబు నల్లల నాడించిన గుల్నార్ నాయిక. వెల ఖర్చులతోసహా 1—0—0 మాత్రమే.

# మురళీధ్వని. (అనుబంధగ్రంథము)

గ్రంథకర్త:—శ్రీయుత పురిపండా అప్పలస్వామిగారు.

చక్కని భావకవిత్వమునకుఁ దోవఁజూపు పద్యరత్నము లిందుఁగలవు. శైలి మృదుమధురము. వెల 0—4—0 మాత్రమే. ఖర్చులు ప్రత్యేకము.

# చపల.

## అత్యద్భుతకథాసంవిధానముఁ గల్గిన నిరూపకనవల.

గ్రంథకర్త:—పండిత ఆదిభట్ల తరిణయ్య సిద్ధాంతిగారు.

ఇట్టిది మనభాషయందు వెలువడి యుండలేదు. వంగీయపత్రికలన్నియు దీనిని బహుశ్లాఘనలఁ బ్రశంసించినవి. ఇందు ముగ్గురు రహస్య పరిశోధకులు, ముగ్గురు నాయకులు, ముగ్గురు నాయికలు, మూఁడస్త్రములు, ముమ్మారు ప్రయోగము, మూఁడు హత్యలు, మూఁడు పలాయనములు, మూఁడుమారుజాబులు, మూఁడుహింసలు, మూఁడు ప్రవృత్తులు, మూఁడు పూర్వ వృత్తాంతములు, నవనీత కోమలాంగియగు మ్లేచ్ఛస్త్రీ చాంద్‌బీబీ ఆగావించిన పైశాచిక కృత్యములు, నరరాక్షసుఁడగు శశిభూషణుని దుర్దాంత వ్యాపారములు, వలచిన కాంతను నిరాకరించుట, ఒల్లని యబలను బలాత్కరించి వివాహమాడుట. పెండ్లిలో పెద్దపెండ్లి. నిద్రలో దీర్ఘనిద్ర. క్రొత్తపెండ్లికూతురు మగనిని జంపినట్లు నిర్ధారణ, వింత దొంగతనము, దొంగనోట్లను సృష్టించుట. అబల దానవియగుట, మనుజుఁడు రాక్షసుఁడగుట, అనుమానము. వేషభూషము, మోసము, అవిశ్వాసము, భ్రమ, పరాభవము, దంభము. వేషము, హెచ్చరిక, మొదలగు విషయములతో నిండియుండును. దీనిని చదువనారంభించినంతనే, ముగించువరకు నిద్రాహారములం దభిరుచి యుండదు. గ్రంథము నీతిబోధకము. ఉద్వేగ పరిపూర్ణము, కాకతాళీయ భ్రాంతము, సాపత్న్య నిరాకరణము, సాపవిపాక సమాప్తము శైలి సులలితము, సలక్షణము. దీనివెల చందాదారులకు రు. 1—0—0 ఇతరులకు రు. 1—8—0 ఖర్చులతో సహా.